# రేపటి విజేతలందరికీ శుభాకాంక్షలతో...

ఏ విజయాన్నైనా చాలా మంది కలిసికట్టుగా ప్రయత్నించినప్పుడే సాధించడం వీలవుతుంది. నేను కూడా ఐ.ఏ.ఎస్. సాధించడానికి మా అమ్మ నాన్నలు ( శ్రీమతి ఆకురాతి భోగేశ్వరి, డా॥ ఆకురాతి కోదండరామయ్య ) ఎంతగానో తోడ్పడ్డారు వారి కృషితో నా కృషిని కలుపుకుని ఈ విజయం సాధించాను. - **ఆకురాతి పల్లవి**

గత 8 సంవత్సరాల నుంచి ఎనలేని కృషితో పట్టుదలతో శ్రమించి ఇంగ్లీష్‌లో ఉన్న ఎన్నో పుస్తకాలను చదివి తనదైన శైలిలో తెలుగులోకి తర్జుమా చేసి తెలుగులోనే సివిల్స్ వ్రాసి విజయకేతనం ఎగురవేసిన **ఆకురాతి పల్లవి** ఎంతో కష్టపడి తయారు చేసి సంపాదించిన జ్ఞానాన్ని ఆమె వరకే పరిమితం కాకుండా మెటీరియల్ ద్వారా అందరికీ అందుబాటులోకి తెచ్చినందుకు వారికి కృతజ్ఞతలు.

అనువాదం చేసేటప్పుడు చాలా సమస్యలు ఎదురవుతాయి. ఎందుకంటే ఒక భాషా నిర్మాణం మరో భాషా నిర్మాణంతో పూర్తిగా సరిపోదు. అటువంటి ఎన్నో సమస్యలను ఎదుర్కొని ఇంగ్లీషు నుండి తెలుగులోకి అతి సులభ పద్ధతిలో తర్జుమా చేసి ఆ మెటీరియల్‌ను తెలుగు మీడియం విద్యార్థులకు అందుబాటులోకి తేవాలనే నా కోరికను మన్నించినందుకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

ప్రతి మనిషిలో అనంతమైన శక్తి దాగి ఉంటుంది. దానిని వినియోగంలోకి తెచ్చుకోవడంలోనే మనిషి విజయం ఆధారపడి ఉంటుంది. ఆ శక్తిని ఎవరైతే పూర్తిగా సద్వినియోగం చేసుకోగలుగుతారో వారే ఆకాశమే హద్దుగా విజయాలవైపు అడుగులు వేయగల్గుతారు.

అసహనంతో జరిగే ప్రయోజనమేమీ లేదు. ఓర్పువహించండి. విజయం మిమ్మల్ని తప్పక వరిస్తుంది. కావున మీ లక్ష్యానికి తగ్గట్టుగా పట్టుదలతో నిరంతరం శ్రమించండి. విజయం మీదే !

**మంచి స్నేహితునిలా ఈ మెటీరియల్ ఎందరి మనసుల్లో తట్టి లేపి విజయపథం వైపు నడిపిస్తుందని ఆశిస్తున్నాను.**

**గమనిక:** గత 8 సంవత్సరాల నుండి ఎంతో శ్రమ పడి తయారుచేసుకోబడ్డ ఈ మెటీరియల్‌ను అందరికీ అందుబాటులోకి తేవాలనే సంకల్పంతో ఉచితంగా ఈ మెటీరియల్‌ను **శ్రీనివాస జిరాక్స్ సెంటర్**‌లో ఇవ్వడం జరిగింది. కేవలం జిరాక్స్‌కైన మొత్తమునే చెల్లించి ఈ మెటీరియల్ పొందవచ్చు.

మీ ఉన్నతిని ఆశిస్తూ....

ఎ. మధుసూదన్ రెడ్డి, Civil Aspirant

## Books that I referred to prepare this material

# MEDIEVAL INDIA

1. Satish Chandra 2 volumes***
2. Mehta 3 volumes
3. NCERT
4. IGNOU***
5. Brilliant
6. Gopala Reddy
7. Ambedkar Open University
8. P.G. Guides
9. Publications Division (Majumdar & Others)
10. Krishna Reddy
11. Hanumantha Rao
12. V. D. Mahajan***
13. Sri Vathsava

# Medieval India (3)

# Chapter - 16   The 14th Century.

## Foreign contacts : Ibn Battuta

క్రీ.శ. 1333-47

హర్షుని మరణానంతరం, తన రాజకీయ ఐక్యతని కోల్పోయిన భారతదేశం, దాని తీర ప్రాంతాలు తప్పించి, క్రమంగా ఇతర దేశాలతో సంబంధాలు కోల్పోయింది. ఉత్తర భారతంపై తురుష్క ఆక్రమణాలు సాధించిన ఒక గొప్ప విజయం - భారతదేశం యొక్క ఈ ఒంటరితనాన్ని ముగించి నాటి సమకాలీన ప్రపంచంలో భారత్ కు అంతర్జాతీయ హోదాను అందించడం గా చెప్పవచ్చు.

భారతదేశం పశ్చిమ, తూర్పు దేశాలతో వర్తక, వాణిజ్య, సాంస్కృతిక సంబంధాలను పెంపొందించుకుంది. పశ్చిమాన యూరోప్, ఆగ్నేయాసియా, చైనా, మడగాస్కర్, ఆఫ్రికా దేశాలతో, గల్ఫ్ దేశాలతో నాడు భారత్ విరివిగా వ్యాపారం చేసేది. [అబ్బాసీదు రాజ్య స్థాపన తర్వాత

Intro — అరబ్ వర్తకులు మునుపటికన్నా మరింత చైతన్యమయ్యారు. ఎన్నో భారత రాయబార బృందాలు బాగ్దాదు ను దర్శించాయి. ఈ సంబంధాలు ఆ తర్వాత కూడా కొనసాగాయని ఇబన్ బటూటా రచనల వలన లేదా బటూటా యాత్ర (visit) వలన తెలుస్తుంది.]

[అబు అబ్దుల్లా మహమ్మద్, సాధారణంగా అతని 'కుటుంబనామం' 'బటూటా' ద్వారా ప్రసిద్ధుడు.]

ఇతడు (ఉత్తర ఆఫ్రికా, మొరాకో) లోని టాంజియర్ (Tangier) నందు క్రీ.శ. 1304 లో జన్మించాడు. ఫెజ్ నందు తన 74 వ ఏట మరణించాడు. క్రీ.శ. 1325 లో తన ఇల్లు విడిచి విదేశాల యాత్రలకై భూమార్గం గా బయలు దేరాడు.

బటూటా అనేక ఆఫ్రికా, పశ్చిమాసియా దేశాలను దాటుతూ క్రీ.శ. 1333 లో సింధునది దాటాడు. చైనా, ఇండోనేషియా వంటి సుదూర ప్రాంతాల దాకా యాత్రలు చేశాడు. 1,23,200 కి.మీ. పైగా చేసిన యాత్రలో బటూటా 22,400 కి.మీ. కేవలం భారతదేశ, మాల్దీవులు, శ్రీలంక యాత్రలో పూర్తి చేశాడు.

ఇతడు భారతదేశంలో దాదాపు 14 సంవత్సరాలు (1333-47) ఉన్నాడు. ఇందులో 8 సం॥ ఢిల్లీ లోనే (1334-42) ఉన్నాడు. ఆ కాలంలో మహమ్మద్ బిన్ తుగ్లక్ ఇతన్ని ఖాజీ గా నియమించాడు. అయితే ఆరంభంలో సుల్తాన ఆదరణను పొందినా తర్వాత ఏవేవో ఆరోపణలకు గురై జైలు పెట్టబడ్డాడు. సుల్తానుకు వ్యక్తిగతంగా మనవి చేసుకొని జైలు నుండి బయటపడ్డాడు. రెండవసారి సుల్తాను తిరిగి రాజ సభాదరణను సన్మానంగా అనుగ్రహించాడు. అయితే సుల్తాను తరఫున రాయబారి గా చైనా వెళ్లేందుకు

గురించి , నాటి భారతీయ వేశ్య, సాంఘిక - ఆర్థిక
పరిస్థితుల గురించి రాయబడింది. ఇది నాటి
ఆచారాల వ్యవస్థ , రోడ్లు, ట్రాఫిక్, రవాణా/నీటి వ్యవస్థ,
మనుషుల, ఆ రాజ్య ఆలోచనలు , వ్యవసాయ ఉత్పత్తులు,
ఆస్థాన ఉత్సవాలు, వాణిజ్యం, నాగరికం, సంస్కృతి
మొదలగు వైవిధ్య విషయాలను వివరిస్తుంది.

విస్తారంగా ప్రచురించిన , తెలివైన
వ్యక్తి యొక్క సమకాలీన రచనగా "రిహ్లా" అనేది
నాటి చరిత్రకు అమూల్య ఆధారంగా తోడ్పడుతుంది.
ఈ రచన మహమ్మద్ బిన్ తుగ్లక్ ను గురించి సరైన
అంచనా వేసేందుకు తోడ్పడుతుంది — ముఖ్యంగా అతని
స్వభావం, విధానాలు గురించి. విదేశీయుడు కావడం
వల్ల ఆస్థాన రచయితల్లాగా బెదురు లేని కారణంగా,
సమకాలీన భారతీయ చరిత్రకారులవలె కాక సుల్తాన్
మీద వ్యక్తిగత ఇష్టాయిష్టాలు ఏర్పడి ఉండని కారణంగా
అతని విశ్లేషణ ఖచ్చితమైనదిగా, నిష్పక్షపాతమైనదిగా
అనిపిస్తుంది. అతను మహమ్మద్ తుగ్లక్ కు
ఇచ్చిన చిత్రం, అతని గురించి చెప్పిన దానిలో
సరిపడటం ఆసక్తిదాయకమైనది.

[అయితే] బటూటా ఇచ్చిన ఢిల్లీ సుల్తానుల విశేషాలు - ఐబక్ నుంచి మహమ్మద్ బిన్ తుగ్లక్ దాకా, సాధారణంగా అతడికి తెలిసిన భారతీయుల నుంచి తీసిన మౌఖిక సమాచారం ఆధారంగా రాయబడినవేనన్న సంగతి గమనించాలి.

[బటూటా] మధుర (Madura Sultanate) సుల్తానేట్ / సుల్తానత్ ను గురించి కూడా రెహ్లా లో వివరించాడు.

మొత్తం మీద మధ్యయుగ కాలనాటి లో భారతదేశానికి దక్షిణాన విదేశీయాత్రికులందించిన రచనల్లో "రెహ్లా" నాటి రాజకీయ, సాంఘిక - సాంస్కృతిక పరిస్థితులు తెలుసుకోవడానికి అమూల్యమైన ఆధారమని చెప్పవచ్చు.

# Chapter 16 : 14th Century

## Muhammad Tughlaq's Major 'Projects'

## మహమ్మద్ బిన్ తుగ్లక్ యొక్క పథకాలు :

మహమ్మద్ తుగ్లక్ తన పాలన ను సంస్కరించి, ఏకశిల పాలన ను ఏర్పాటు చేయాలని ఆకాంక్షించాడు. అతని 'మనస్సు' ను జారీ చేసినట్లు ఇబన్ బటూటా రచనల వలన తెలుస్తుంది. ఇవి పాలన-రాజకీయ సంబంధమైనవి, ఆర్థిక-వ్యవసాయ సంబంధమైనవి.

### 1) రాజధాని మార్పిడి :- (1326 - 27)

**కారణాలు :**

① మహమ్మద్ జౌనా ఖాన్ గా యువరాజుగా దక్కన్ లో సన్నిహిత సంబంధాలు ఏర్పర్చుకున్నాడు.

② సుల్తాన్ కాగానే దక్కన్ లో గుర్షాస్ప్, సాగర్ గవర్నర్లు తిరుగుబాటు చేశారు, ఢిల్లీ ఆగా బాకతో మొత్తం ద్వీపకల్పం లో తిరుగుబాట్లు రేగాయి, అందువల్ల లాంఛనంగా రాజధాని దక్షిణానికి మళ్లించాలని ఉండవచ్చు.

③ మహమ్మద్ ఆదర్శవాది. కొత్త (ప్ర)యోగాలకు తెరతీయాలనుకునే వాడు. భారతదేశమంతా ఒకే ఏకకేంద్రీకృత పాలన కిందికి రావాలి ఆ కార్యం సుల్తానత్ చేపట్టాలని భావించాడు. హిందువు దేవాలయాలకు మధ్యగా ఉండే "దేవగిరి"

క్షేమమైనదని తలచాడు.

(4) 1321–22 లో చేసిన వరంగల్ దండయాత్ర వైఫల్యం పొందటానికి రాజధానితో వార్తా సంబంధాలు సరిగా లేకపోవటమే కారణం. ఈ లోపం మళ్ళీ పునరావృతం కావడం ఇష్టం లేక దేవగిరి కి మార్చాలనుకున్నాడు / అని ఉండవచ్చు.

(5) మాలిక్ కాఫూర్ దక్షిణ విజయాల కాలం నుంచి సుల్తానేట్ దక్షిణాది ధనం తోనే గడుస్తుంది. అప్పుడే రాజకీయ కేంద్రం దక్షిణాది కి మళ్ళింది. దక్షిణాది సంపదలు ఆకర్షించి ఉండవచ్చు.

(6) దేవగిరి లోని ఉత్తమ వాతావరణం, సుసంపన్న వ్యవసాయం, మంచి ప్రాకారం, మరాఠా యోధుల సైనిక మద్దతులు వెరసి ఇవి అన్నీ రాజధాని మార్పిడి కి ప్రోత్సహించి ఉండొచ్చు.

(*) <u>బరనీ</u> దౌలతాబాద మధ్యప్రాంతంలో ఉండడమే కారణమన్నాడు. <u>ఫెరిష్తా</u> కూడా ఇదే కారణాన్ని చెప్పాడు.

# Chapter 23

## పర్షియన్ చారిత్రక రచనలు :

నాటి చారిత్రక అంశాలు (ప్రధానంగా పాలన, అడ్మినిస్ట్రేటివ్ కార్యాలు, గణాంకాల పత్రాలు/పట్టికలు, పాలనా రికార్డులు [ఫర్మానాలు, నిషాన్లు, పర్వానాలు మొ॥], లేఖలు (ఇన్షా సాహిత్యం), కావ్యాలు, చారిత్రక-భౌగోళిక రచనలు, నిఘంటువులు మొ॥ వాటి ద్వారా దొరుకుతున్నాయి. అయితే మనం ప్రధానంగా చారిత్రక రచనలకే ప్రాధాన్యత ఇస్తున్నాము.

అన్నిటి కన్నా ముఖ్యమైంది ఆనాటి టర్కీ భాష లో (చాగతాయి) రాయబడి అక్బర్ కాలంలో పర్షియన్‌లోకి అనువదించబడిన బాబరు స్వీయచరిత్ర "బాబరునామా"(1). ఇందులో క్రీ.శ. 1483 నుండి 1529 వరకు గల బాబరు జననం నుంచి మరణం పొందే వరకు వివరాలున్నాయి.

అక్బర్ అత్త గులబదన్ బేగం, బాబరు కూతురు రాసిన "హుమాయున్ నామా"(2). ఇది ప్రధానంగా బాబరు, హుమాయూన్‌ల పాలనా కాలాన్ని వివరిస్తుంది. అక్బరు పాలనా కాలంలో అతని కోరిక ఒత్తిడి మీద ఇది పూర్తి చేయబడింది.

"తుహ్ఫా-ఎ-అక్బర్ షాహీ" ("తారీఖ్-ఎ-షేర్ షాహీ"(3)) అబ్బాస్ ఖాన్ సర్వాని చేత క్రీ.శ. 1586 కి అక్బర్ కాలం లో రాయబడింది. ఇది షేర్షా యొక్క జీవితం, కార్యక్రమాలు తెలుపుతున్నందున

ముఖ్య చారిత్రక ఆధారం.

అబ్దుల్ కాదిర్ బదౌని యొక్క "ముంతఖబ్ ఉత్ తవారిక్"(4) ఇదొక అక్బరు కాలంలో రాయబడి అక్బరు ను తిరస్కారం చేయబడని రచన. బదౌని అక్బరు యొక్క "మత భ్రష్టతలు", "నూతనసృష్టి" పట్ల తీవ్ర విమర్శనాత్మకంగా ఉన్నాడు. ఇందులో మొదటి సంపుటం సుబుక్తజిన్ నుండి హుమయూన్ వరకు గల చరిత్ర లో నిండింది. ఇది రాజకీయ వర్ణన. రెండవ సంపుటి లో అక్బరు పాలనా కాలంలోని మొదటి 40 సం॥ గురించి రాయబడింది. మూడవ సంపుటం "తాజ్కిరా" tazkira లో ముషైక్, ఉలేమా, వైద్యులు, కవుల (అక్బరు పాలనా కాలం లోని) జీవిత చరిత్ర సంగ్రహంగా రాశాడు. అక్బరునామాలో వివరంగా రాయబడని అంశాలు (ఉదా: మహజర్ నామా) ఈ ముంతఖబ్ లో స్థానం పొందాయి.

అక్బరు కాలంలో రాయబడిన అమూల్య మైన గ్రంథం అబుల్ ఫజల్ యొక్క "అక్బరు నామా"(5). ఇందులో మూడు సంపుటాలున్నాయి. మొదటి రెండు వర్ణనాత్మకమైన కథనాలు (narrative part) కాగా మూడోది "ఐన్-ఇ-అక్బరి". మొదటి సంపుటం Adam నుండి అక్బరు పాలన లో మొదటి 17 సం॥ వరకూ చరిత్ర తెలుపుతుంది. రెండవ సంపుటం లో

అక్బరు పాలనలో 46 వ సంవత్సరం వరకు దాకా ఉంటుంది.

మూడవ సంపుటం లో అక్బర్ రాజరిక ప్రభుత్వ శాఖలైన నాణేల ముద్రణ, దస్తూరి Calligraphy, చిత్రకళ, గుర్రపుశాలలు, సైనికాధికారాల మొ॥ వాటి గురించి వివరిస్తుంది. ఐనీ అక్బరీ రాయడం అక్బరు 42 వ పాలనా సంవత్సరంలో ముగిసింది. అనేక వస్తువుల ధరలు తెలుపుతాడు. అయిన రెవెన్యూ, పాలన అధికారుల విధులు, రెవెన్యూ రేట్లు మొ॥ చెబుతుంది. సాంఖ్యికాలు, లెక్కలు తోటలు కూడా ఉన్నాయి. అంతేగాక ఐనీ అక్బరీ సుబా, సర్కార్, పరగణా-ప్రకారం భూమి కొలతలు, రెవెన్యూ గణాంకాలు, అక్బరు సామ్రాజ్య విస్తర వివరాలు చెబుతుంది.

జహంగీరే స్వయంగా రచించిన "తుజుక్-ఇ-జహంగిరి"(6) జహంగీరు పాలన గురించి తెల్పుతుంది.

షాజహాను కాలంలో ముగ్గురు అధికారిక చరిత్రకారులకు తన పాలనా కాలానికి చెందిన అధికారిక చరిత్ర రాసే పని అప్పజెప్పాడు. అమీన కాజ్వీని మొదటి పది సంవత్సరాల చరిత్ర రాశాడు. తర్వాత అబ్దుల్ హమీద్ లాహోరి ఈ పని చేపట్టి మొదటి 20 సం॥ చరిత్ర రాశాడు. మహమ్మద్ వరిస్ షాజహాను పాలన లోని 21 వ సంవత్సరం నుంచి 30 వ సంవత్సరం వరకు రాశాడు. ఈ ముగ్గురి రచనలను కలిపి "బాదుషానామా"(7) లేదా "పాదుషానామా" అంటారు.

షేక్ ఫరీద్ భక్కరి రచన

"జఫైరత్ ఉల్ ఖవానిన్" అనేది అక్బరు నుంచి షాజహాను వరకు ప్రముఖుల జీవిత చరిత్ర పొందుపర్చిన మంచి రచన.

ఔరంగజేబు పాలనలోని మొదటి పది సంవత్సరాల గురించి అధికారిక చరిత్ర అయిన "ఆలంగీర్‌నామా" (1668) ద్వారా తెలుసుకోవచ్చు. దీన్ని "మహమ్మద్ ఖాజిమ్" రాశాడు. ఆ తర్వాత ఔరంగజేబు అధికారికంగా చరిత్ర రాయించడాన్ని నిషేధించుకున్నాడు. అయితే అనేక సమకాలీన రచనల వలన అతని పాలన గురించి తెలుసుకోవచ్చు. ఖాఫీ ఖాన్ రాసిన "ముంతకాబ్ ఉల్ లుబాబ్", ఈశ్వరదాస్ నాగర్ యొక్క "ఫుతుహాత్-ఇ-ఆలంగిరి", సాకీ ముస్తయిద్ ఖాన్ యొక్క "మాసిర్-ఇ-ఆలంగిరి", భీమసేన రాసిన "నుస్ఖా-ఇ-దిల్‌కుషా" మొ|| ఔరంగజేబు పాలన గురించి తెలుపుతాయి.

# Chapter : 23 Culture during the Mughal Empire

## Music Classical Music

మొఘలులు సంగీతం & మంచి పోషకులు.

బాబరు కు సంగీతం ఎంతో ఇష్టం. అతని కాలంలో ఒక మంచి పాట పాడటం ఎంతో మెప్పుకోలుగా ఉండేది.

హుమాయూన్ కూడా సంగీతకారుల్ని - గాత్ర, వాయిద్యకారుల్ని ఎంతో ఆదరించాడు. సంగీతం కోసం సోమ, బుధ వారాల్ని కేటాయించాడు. క్రీ.శ. 1535 లో మండు ను పట్టుకున్నప్పుడు హుమాయూన్ ఖైదీలందర్ని [POW] సామూహికంగా చంపమన్నాడు. ~~అయితే~~ ఆ ఖైదీల్లో ఒక గాయకుడు ఉన్నాడని తెలిసి అతన్ని మరణం నుంచి తప్పించడమే గాక తన ఆస్థాన గాయకుణ్ని చేశాడు.

సూర్ వంశానికి చెందిన ఆదిల్షా సంగీతాన్ని బాగా ఆదరించాడు. భగత్ ఖాన్ సంగీతానికి మంచి ప్రోత్సాహం ఇచ్చాడు. ఇస్లాం షా సూర్ కూడా ఇతర సంగీతకారుల్ని ఆదరించడమే గాక స్వయంగా మంచి పఖావాజ (Pakhawaj) పఖావాజ్ వాయిద్యకారుడు.

అక్బరు సంగీతానికి గొప్ప ప్రేమికుడు

66

~~గౌరవనీయులైన చక్రవర్తి గారికి శిష్యురాలు పొందిన~~

~~సంగీతకారులు [illegible] లకి [illegible]~~

"మహారాజు గారి కోరిక. సంగీత శాస్త్ర
పరిజ్ఞానం ఉందంటే ప్రఖ్యాతి పొందిన సంగీతకారులకి
కూడా ఇంత జ్ఞానం ఉండదు. అలాగే అవలీల/వాలిద
వాయిద్యాలను పలికించడంలో కూడా ముఖ్యంగా
నగారా లో అందెవేసిన చెయ్యి"

— అబుల్ ఫజల్

ఇది అక్బరు సంగీత ప్రావీణ్యం అబుల్ ఫజల్ వెల్లడించినది. అక్బరు హిందు, ఇరానియన్, తురానియన్, కాశ్మీర మొదలైన ప్రముఖ సంగీతకారులను ఆదరించాడని అబుల్ ఫజల్ తెలిపాడు. ఆస్థాన సంగీతకారులు 7 బృందాలుగా విభజింపబడినారు. వారంలో ఒక రోజు ఒక బృందానికి కేటాయించబడేది. అబుల్ ఫజల్ 36 మంది పాటగాళ్ళ, వాయిద్యకారులైన పండితుల జాబితా ఇచ్చాడు. మనుపటి మాళ్వా పాలకుడైన బాజ్ బహాదూర్ కూడా వారిలో ఒకడు. అతనికి మనసబ్-1000 ఇవ్వడమే గాక నాయిక గాయకుడని పొగడబడ్డాడు.

అక్బరు హిందీ గాత్ర సంగీతంలో ప్రత్యేక అభ్యాసం "లాల్ కలావత్" లేదా మియాన్ లాల్ వద్ద చేశాడు. హిందీ భాషలో సంబంధమున్న ప్రతి ఊపిరి, చివాలిని మియాన్ లాల్ అక్బరుకు బోధించాడు.

అక్బరు కాలంలో గొప్ప చిత్రకారులు

గాయకుడు "తాన్‌సేన్"! అబుల్ ఫజల్ మాటల్లో చెప్పాలంటే

"అతని లాంటి గాయకుడు భారతదేశంలో గత వెయ్యేళ్ళుగా లేడు."

తాన్‌సేన్ సూరదాస్ కు దగ్గరి స్నేహితుడు. ఇతడు గ్వాలియర్ లో రాజా మాన్‌సింగ్ స్థాపించిన (established) సంగీత పాఠశాల లో సంగీతం నేర్చుకున్నాడు. తాన్‌సేన్ కొన్ని నూతన రాగాల్ని కూడా అందించాడంటారు, వీటిలో కొన్ని నేటికీ పాడుతున్నారు. ఇతడు వేలాదిగా ఎన్నో పాటల్ని కూర్చాడు. ఇతడు గ్వాలియర్ నుంచి నేర్చుకున్న శైలిని ధ్రుపద శైలి అంటారు. తాన్‌సేన్ సృష్టించినట్లుగా చెప్పబడుతున్న రాగాలలో "మియాన్ కీ మల్హార్", "మియాన్ కీ తోడి", "దర్బారి" లు ముఖ్యమైనవి.

అక్బరు కాలంలోని ఇతర ముఖ్య సంగీత కారులుగా బాబా రాందాస్, బైజు బావ్రా, సూర్‌దాస్ లను చెప్పాలి. బైరాం ఖాన్ బాబా రాందాస్ కు లక్ష టంకాలను బహుమానంగా ఇచ్చాడు.

అక్బరు కాలంలో అనేక సంగీత శైలులు మేళవింపబడి నూతన "భారతీయ సంగీత శైలి" ఆవిర్భవించింది.

జహంగీరు తన ఆస్థానంలో ఎంతోమంది సంగీతకారుల్ని ఆదరించాడు. వారి పాండిత్యాన్ని, ప్రతిభను

అనుగుణంగా వారికి పారితోషికాలు అందేవి. ఇబ్రాహీం
స్వయంగా ఎన్నో హిందీ పాటల్ని కూర్చినట్లు తెలుస్తుంది.
అతని కాలంలో మొహమ్మద్ ఖాలిక్ గొప్ప హిందీ పాటల
గాయకుడు. జగన్నాథ, జనార్థన భట్టులు అనే మంచి సంగీతకారులు.

షాజహాన్ సామ్రాజ్యం వేళల్లో
ఉత్తమ సంగీతకారుల పాటల్ని వినేవాడు. గాత్ర, వాద్య
సంగీతాలను వినడానికి గాను "దివాన్-ఎ-ఖాస్" లో ప్రత్యేకం
ఏర్పాట్లు జరిగేవి. షాజహాన్ చక్రవర్తి స్వయంగా
సంగీతం లో పాల్గొంటున్నవాడు. షాజహాన్ గొంతులో
మాధుర్యం ఎంతో ఆకర్షణీయంగా ఉండేది, అందుకే
సూఫీ గురువులు, ఇతర సాధువులు సామ్రాజ్యం వేళల ఈ
సభలకి ఆహ్వానంగా వెళ్ళి అతని పాట పారవశ్యంలో
వైరాగ్యం పొందేవారని తెలుస్తుంది. షాజహాన ఆస్థానంలో
రాందాస్ మరియు మహాపాత్రులు ముఖ్య గాయకులు.
జగన్నాథుడు మహోన్నత గాయకుడు. ఒకసారి షాజహాను అతని
గానానికి పరవశం చెంది అతనికి అతని బరువంత బంగారాన్ని
బహుమానంగా ఇచ్చినట్లు తెలుస్తుంది. షాజహాను కు నచ్చిన
ముఖ్యమైన హిందీ రాగం "ధ్రుపద రాగం". దిల్లీ తాన్సేన
కొడుకైన లాల్ ఖాన చక్రవర్తి ని రంజింపచేసేట్లు పాడేవాడు.
లాల్ ఖాన కు "గుణ సముద్ర" బిరుదు ఇచ్చి గౌరవించాడు.
సూరసేన వీణా వాద్యంలో నేర్పరి. సుఖసేన ఆస్థానంలో

వారిని తన రబాబ్ / రుబాబ్ సంగీతంలో అలరించేవాడు.

## ఔరంగజేబు తన పాలనా కాలంలోని

మొదటి పది సంవత్సరాలు సంగీతాన్ని ఆదరించినట్లు తన ఆస్థానంలో పలుకురు గాయకుల్ని పోషించినట్లు తెలుస్తుంది.. పైగా ఔరంగజేబ్ స్వయంగా మంచి వీణా వాయిద్యకారుడు. అయితే తరువాత అతడు సంగీతాన్ని & కళల్నే తన ఆస్థానంలోని గాయకుల్ని పంపించేవాడు. ఇటువంటి పరిస్థితుల వలన ఔరంగజేబు తన ఆస్థానం నుంచి గాయకుల్ని నిషేధించినా వాయిద్య సంగీతకారుల్ని మాత్రం ఆదరించినట్లు తెలుస్తుంది. అయితే సంగీతం అన్ని రూపాల్లోనూ హారేం లోని ఆనాటి రాణుల చేత, ఇతర ప్రముఖుల చేత పోషింపబడినట్లుగా తెలుస్తుంది. అందువలననే శాస్త్రీయ భారతీయ సంగీతం మీద పర్షియన్ లో అత్యధిక గ్రంథాలు ఇతని కాలంలోనే వెలువడ్డాయి. వాటిలో "తుహఫత్ - ఉల్ - హింద్" ఔరంగజేబు మనవడు జహాందర్ షా కోసం రాయబడింది.

## మహమ్మద్ షా పాలనా కాలంలో

(1720 -48) సంగీతంలో చెప్పుకోదగ్గ అభివృద్ధి, మార్పులు జరిగాయి. ఆనాటి చెందిన గొప్ప గాయకులు గా నియామత్ ఖాన్ సదరంగ్ మరియు ఫిరుజ్ ఖాన్ అదరంగ్ లను చెప్పవచ్చు. వీళ్ళు ధ్రుపద్ లో మంచి పాండిత్యం గలవారు, అయినా ఎంతో మంది విద్యార్థులకి ఖయాల్ శైలి లో శిక్షణ నిచ్చారు.

ఖయాల్ శైలి ఎక్కువ గేయరూపంగా ఇతివృత్తం లో భావాత్మకంగా భావ కవిత్వం లాగా ఉండి శృంగార యుతంగా ఉంటుంది. (lyrical in theme and erotic in approach) ఇది చాలా ప్రజాదరణను బాగా పొందింది. స్వయంగా మహమ్మదషా రంగీలా పియా అనే కలంపేరు తో ఎన్నో ఖయాల్స్ రాసినట్లు తెలుస్తుంది. ఎంతో మంది ఆస్థానకారులు కూడా వారి సంగీత పరంపరతో పేరుపొందారు.

తబల, సితార్ ఈ కాలంలోనే బాగా ప్రసిద్ధి పొందాయి, కానీ ఎవరి చేత ఆవిష్కరించబడ్డాయో మనకు తెలియడం లేదు.

మహమ్మదషా ఆస్థానంలో ఖయాల్ గాయకుల్లో లో గొప్ప నిపుణులుగా సదరంగ, అదరంగ (Sadaranga and Adaranga) ఉండేవారు. అనేక రకాల సంగీత రీతులు ఉదా: తరన, దద్ర, ఘజల్ మొ॥ ఎన్నో ఈ కాలంలో వెలుగు చూశాయి. అలాగే ఎన్నో జానపద సంగీత రీతులు కూడా ఈ కాలంలో శాస్త్రీయ సంగీతంలో చేర్చబడ్డాయి. ఈ విభాగంలో జానపద క్రమంలో వెలసిన "ఠుమ్రి", పంజాబులోని ఒంటెల్ని నడిపేవారి పాటల్లోంచి వృద్ధి చెందిన "టప్పా" మొ॥ పాటలని చెప్పవచ్చు.

* గ్వాలియరు కు చెందిన రాజా మాన సింగ్ స్వయంగా గొప్ప సంగీతకారుడు, సంగీతకారులకు గొప్ప పోషకుడు. ఇతడు ~~కొ~~ కొత్త రాగాలను సృష్టించినట్లు చెప్తారు. వీటన్నింటినీ " మన కౌతుహల " అనే గ్రంథంలో ఇతడు సంకలనం చేశాడు.

ఆస్థానంలోనే గాక ఆలయాలు, సూఫీల సభల్లోనూ సంగీతానికి ఆదరణ ఇవ్వబడింది. బృందావనానికి చెందిన స్వామి హరిదాస గొప్ప సంగీత విద్వాంసుడని తెలుస్తుంది. అక్బరే స్వయంగా అజ్ఞాతరూపంలో ఆయన సంగీతం వినడానికి వెళ్ళేవాడట! భక్తి ఉద్యమకారుల రచనలు చాలా వరకు భిన్న రాగాలు, స్వరాలకు అనుగుణంగా మలచినవే -నన్న విషయం మరువరాదు.

# Mystic Eclecticism - Dara Shukoh

eclectic = not following one style or set of ideas but choosing from or using a wide variety

వైవిధ్యభరిత

విలక్షణ మార్మిక పరిశీలన - దారా షుకోవ్

[దారా షుకోవ్ విశాల దృక్పథం గల మంచి సంస్కర్త. అతని మత భావనను అక్బరు భావాలతో పోల్చవచ్చు. అయితే అతను ఇస్లాం ప్రాథమిక సూత్రాలను ప్రశ్నించలేదు. [అతనికి దేవుడి మీద నమ్మకం ఉంది. ఖురాన్ ను, మహమ్మద్ ప్రవక్తను నమ్మాడు. ముస్లిం సాధువుల జీవితాన్ని గురించి రాశాడు. ఇవన్నీ ఔరంగజేబు దారా ను మతభ్రష్టుడిని చేసిన నేరారోపణ నిజం కాదని నిరూపిస్తాయి.]

[అయితే దారా కు ఇతర మతాలు ఏం చెప్పదల్చుకున్నాయో తెలుసుకోవడం మీద మంచి ఆసక్తి ఉంది. ఇతడు ముస్లిం పండితులతో, మార్మికులతో ఏ విధంగా చర్చలు జరిపేవాడో అదే విధంగా హిందూ యోగులతోను, పండితులతోను కూడా చర్చించేవాడు.] అతని సాంగత్యంలో ఉండేవారిలో ముఖ్యుడైన చంద్రా భాన్ అనే బ్రాహ్మణుడు మార్మిక శైలిలో ఉన్న మంచి పద్యాలు రాశాడు.

[దారా ముల్లాషా కి కదిరియా క్రమానికి చెందిన సూఫీ గురువు మంచి శిష్యుడు.]

[ఢిల్లీ లోని ప్రముఖ సూఫీ

ఆరాధకవాది అయిన సర్మద్ తో కూడా దారా

కు పరిచయం ఉంది.]

[ఖదిరియా క్రమం యొక్క గుర్తింపైన

జన్మగాథ్ సంపాదించిన అర్థాల ద్వారా "సఫీనతుల్

అవులియా" మరియు "సకీనతుల్ అవులియా"

అనే రెండు గ్రంథాల్ని రాశాడు. ఇవి రెండూ కూడా

మార్మికుల జీవితచరిత్రలే. మార్మికత మీద దారా

ఇతర రచనలు "రిసాలె హక్నుమ", "మజ్మాల

బహ్రైన" మరియు "హసనతుల్ ఆరిఫిన".

అతని మత లేదా దివ్యజ్ఞానం సమకాలీన

హిందూ-ముస్లిం మార్మికుల్లో బహుళ ప్రచారం లో ఉన్న

"వహదతుల్ వుజుద్" తో అంత ప్రభావితం

అయింది.]

[దారా వేదాలను (పేరొందిన), సూఫీ సాహిత్యాన్ని,

న్యూ టెస్టమెంట్ ను చదివాడు. ఇతడు వేద

మత, తాత్విక గ్రంథాల్ని రాశాడు. ఇతడు రాసిన

"రెండు మహాసముద్రాల సంగమం" అనే గ్రంథం

హిందూ-ముస్లిం మతాల తులనాత్మక అధ్యయనానికి సంబంధించినది. ఇతడు 52 ఉపనిషత్తులను బెనారస్ పండితుల సాయంతో పర్షియన్ లోనికి అనువదించాడు. ఇతడు అనేకమంది పండితుల్ని ఆదరించాడు, వారిలో ఆంధ్రుడు చెందిన సంస్కృత పండితుడు జగన్నాథుడు కూడా ఉన్నాడు.

"అయితే ఢిల్లీ రాజు గాని లేకపోతే విశ్వరాజు గానీ మాత్రమే కోరికల్ని తీర్చగలరు. ఇతర రాజులు ఇచ్చేది కేవలం ఆటకూర లేదా ఉప్పు కొనడానికి మాత్రమే సరిపోతుంది"

— జగన్నాథ పండితుడు ఢిల్లీ రాజాస్థానంలో అందే ఆదరణను పొగడుతూ చెప్పిన మాటలివి.

పాండిత్య, ఆధ్యాత్మిక చర్చల ద్వారా యొక్క అత్యున్నత స్థానం తెలుస్తోంది.

"ప్రేమ, ముక్తి, దివ్యత్వం ల కోసం మరణం పొందినవాడు; మానవ జాతి లో శాంతి సౌభాగ్యాల కోసం నిలిచిన సాహసోపేతమైన ఆత్మ; గుడ్డి అధికారం, సిద్ధాంతాల సంకెళ్ల నుంచి మానవ మేధ ను విముక్తి చేయడానికి నిలిచిన వీరుడి లాంటివాడు"

— అని దారా గురించి ప్రముఖ రచయిత అన్నాడు.

[బాహ్య ఆచారాల్లో భిన్నంగా వేరుపడ్డం

చూసి] హిందూ, ముస్లింలలోని అంతరంగ సామ్యాన్ని తెలుసుకోవాలి

రెండు మతాలకీ సమానంగా ఉన్న విజ్ఞాన గ్రంథాల ద్వారా

కృషి చేశాడు.] భారత దేశంలో మతపరంగా శాంతియుత

వాతావరణం ఏదో ఒకటి చెయ్యదలుచుకున్న వారెవరయినా దారా

నిలిచిన చోటు నుంచి మొదలు పెడితే/పెట్టాలి, అతడు

వేసిన బాట మీదుగా ముందుకు నడవాలి. హిందూ-ముస్లిం

మతాల యొక్క మౌలిక విశ్వాసాల ఆధారంగా వారిద్దరికీ

సామాన్య మత వేదిక ని ఏర్పాటు చెయ్యాలన్నది దారా ఆకాంక్ష.

ఆధునిక మనసుకు / ఆలోచనకు తట్టే గొప్ప సత్యాన్వేషకుల్లో

దారా చిరస్థాయిగా మిగిలిపోతాడు.

దారా, జహనారాల చేత ఆదరింపబడిన

చిష్టీ సాధువులు, ఖాదిరి సాధువు - లాహోరుకు చెందిన మియాన్ మీర్

మొ|| వారు 'వహదత్ ఉల్ వజూద్' లేదా ఏకత్వం (monism)

అనే తత్త్వం కింద ఉదార భావాలున్న చేరడానికి దోహదం

చేశారు.

[దారా వేదాల సంకలనం చేసి రచించిన

" ముక్నె ఉల్ కిత్తాబ్ " అను పరిచయం రాస్తూ వేదాలను

" heavenly books in point of time "

" ఏ కాలమందైనా దివ్య గ్రంథాలు "

అని, మరియు

"in conformity with the holy Quran"

"పవిత్ర ఖురాన్ కు అనుగుణంగానే ఉన్నది"

అని రాశాడు. ఈ విధంగా హిందూ-ముస్లిం తత్వాలకు ప్రాథమిక, వాస్తవ విభేదాలు ఏమీ లేవని నమ్మకాన్ని బలపర్చాడు. అందువలనే ఔరంగజేబు దారా ను బందీగా పట్టుకున్నప్పుడు ఉలేమా ఇస్లాం ను అవిశ్వాసకుల మతం లా (infidelity) సమానం చేశాడని - అది నేరం అని దారా కు మరణశిక్ష విధించాడు.

# Maharashtra Dharma

వైష్ణవం యొక్క భాగవత ధర్మానికి మహారాష్ట్రలో లభించిన ఆదరణ కారణంగా దీని మరాఠా ధర్మమని 'మహారాష్ట్ర ధర్మ' అని అంటారు. ఈ మహారాష్ట్ర ధర్మానికి దీర్ఘ చరిత్ర ఉంది.

13 వ శతాబ్దాంతంనుంచి కల్లా మహారాష్ట్రలోని భక్తి ఉద్యమానికి వృద్ధి, చైతన్యాలను అనేక మంది కవులైన సాధువులు అందించారు. వారిలో జ్ఞానేశ్వరుడు అగ్రగణ్యుడు. భగవద్గీత మీద మరాఠీలో "భావార్థదీపిక" లేదా "జ్ఞానేశ్వరి" అనే వ్యాఖ్యానాన్ని రాశాడు. ఇతని ఉద్యమానికి కేంద్రం పండరీపురం. ఇచట విఠోబా ఆలయం ఆ తర్వాత కాలంలో మహారాష్ట్ర భక్తి ఉద్యమానికి నెలవైంది. పండరీపురం యొక్క కృష్ణభక్తి ఉద్యమం ఒక గుడికి ఒక దేవునికి చెందిందే అయినా అది విగ్రహారాధనకి పరిమితమైంది కాదు. విఠోబా ఒక దేవుడి కన్నా ఎక్కువ, ఇందులో ప్రాముఖ్యం దాని ప్రతీకాత్మకత.

వైష్ణవ భక్తిలో ప్రధానాంశాలైన ఆచార ఆడంబర వ్యతిరేకత, కుల వ్యతిరేకత మొ॥ వి ఉత్తర భారతంలోని ఇతర సంప్రదాయాల ఉద్యమాల వలెనే మహారాష్ట్రలోనూ ఉన్నాయి.

కవి-సాధువులు మరాఠీ సమాజంలోని అట్టడుగు వర్గాల వారికి అందుబాటుగా కృషి చేశారు. భగవద్గీతను

మధురమైన మరాఠీ రాగాల్లో ఆలపిస్తూ జ్ఞానేశ్వరుడు మహారాష్ట్ర లో భాగవతధర్మానికి (వార్కరి శాఖకి బలం ఇవ్వడం ద్వారా) పునాదులు వేశాడు. ఈ వార్కరి శాఖ ఆరంభంలో పెద్దసర్దారులలా పండరీపురానికి తీర్థయాత్రలు చేసేది.

వార్కరి శాఖ వారికి విఠోబా సర్వస్వం. దీని అనుయాయులు గృహస్థులు, వీరు సంవత్సరానికి రెండుసార్లు పండరీపురం దర్శిస్తారు. దీని సభ్యులు కులభేదాల్ని అంగీకరించరు. మహారాష్ట్రలో ఈ ఉద్యమంలో విభిన్న సామాజిక వర్గాల వారు — శూద్రులు, ఆటవికులు, కుంభార, మాలి, మహార (అంటరానివారు) అటువంటి బలహీనవర్గాలవారు మొ|| పాల్గొన్నారు. సమాజంలో కింది కులాలకి చెందిన సాధువులుగా చోకా (మహార), గోరా (కుంభార), నరహరి (సోనార), బంక (మహార) మొ|| వారిని చెప్పవచ్చు.

జ్ఞానేశ్వరుడు జ్ఞానదేవ దనోబా (1271-96) గా ప్రసిద్ధి చెందాడు. ఇతని భావార్థదీపికలో లయబద్ధమైన గద్యం పాటరూపంలో ఉంటుంది. దీన్ని స్మరించాలి. నాథ సంప్రదాయంలో దీని ఆరంభాలు ఉండడం చేత అద్వైతానికి (Monism) ఏకత్వం మధ్య మధ్య వెల్లడౌతున్నది. కానీ ఇతని భక్తి నిజానికి వార్కరి మతం ప్రభావం చే కలిగినది.

వార్కరి మతస్థులు గృహస్థులుగా ఉంటారు, సన్యాస జీవితాన్ని వ్యతిరేకిస్తారు. కులవ్యవస్థని వ్యతిరేకించి

వార్కారి మతస్థులంతా సువ్యవస్థభావాలతో ఉంటారు.

మహారాష్ట్రులలో భాగవత ధర్మంలో ముడిపడిన మరో భక్తుడు నామదేవుడు (1270-1350). కులరీత్యా దర్జీ అయిన ఇతడు సాధువుగా మారి ఎటువంటి పోరాటం చేశాడు. ఇతడు కవిత్వాన్ని వరంగా పొందినవాడు. ఇతడు పండరీపుర దేవునికి అనేక సామూహ్య, పారవశ్యంత నిండిన పాటల్ని, కీర్తనల్ని పూర్తిగా అర్పించాడు. తాను, తన సహచరులు కలిసి వందలాది అభంగలను రాస్తానని ప్రతిజ్ఞ చేశాడు.

"హిందువు గుడ్డివాడు. ముసల్మానూ అంతే.
హిందువు గుడిలో పూజిస్తాడు, ముసల్మాను మసీదులో.
కాని నామదేవుడు ఎవరైతే దేవాలయం గాని, మసీదు
గాని అవసరంలేని అతన్ని పూజిస్తాడు"

అని భగవతత్త్వాన్ని చెప్పాడు. జనాబాయి (3) శూద్ర స్త్రీ అతని సేవకురాలిగా ఉండేది. అభంగలను రాయడంలో ఆమెది అందె వేసిన చెయ్యి. ఆమె నామదేవుని, విఠోబాల సేవల్లో జీవితాం గడిపింది. ఆమె అంతర్భావం ఆమె పద్యాల్లో కన్పిస్తుంది. జనాబాయి అభంగాలు వాటి సరళత, భావం యొక్క లోతులు, మూర్తి అంకితత్వానికి దర్పణాలు.

నామదేవుడు భాగవత ధర్మాన్ని, తన మధుర కీర్తనల్ని ప్రచారం చేయడం కోసం చేసిన ఏర్పాటులు మహారాష్ట్రలో ఒక ఉద్యమ క్రమం

ఏర్పడ్డానికి కారణం. నామదేవుడు 80 ఏళ్లకి మరణించాడు. అతని అస్థికల్ని పండరీపుర దేవాలయ ద్వారం వద్ద పాతిపెట్టి తగిన గౌరవం చూపారు.

వీరి తర్వాత తుకారాం, రాందాస్, ముఖ్య మరాఠీ సాధువులు. ఏకనాథుడు జ్ఞానేశ్వరుడి బాటను మరింత బలపర్చాడు. తుకారాం, రాందాసు (శివాజీ గురువు) లు కూడా కులవ్యవస్థకి, దురాచార వ్యవస్థకి నినాదాలు చేశారు. ఏకనాథుని బోధనలు మరాఠీలో ఉన్నాయి. ఇతడు మరాఠీ సాహిత్యంలో సిద్ధాంతపర రూపాల నుండి వర్ణనాత్మక రూపాల మీదికి ప్రాధాన్యాన్ని మళ్లించాడు.

తుకారాం బోధనలు దోహాల రూపంలో ఉన్నాయి. వీటిని గాథలు అంటారు. మరాఠా వైష్ణవాన్ని చదవడానికి ఇదే ముఖ్య ఆధారం.

[వార్కరీ మరాఠా సాధువులు నాటి మత బోధనా విధానాన్ని "కీర్తనలు" నిరూపణల ద్వారా బోధించేవారు] మరాఠా ఉద్యమం మరాఠీ సాహిత్య వృద్ధి చెందడానికి కారణం అయింది. ఈ సాధువులు తమ బోధనల్ని ప్రాంతీయ మరాఠీ భాషలో రాయడం ద్వారా మరాఠీ సాహిత్య భాషగా ఎదిగింది. వార్కరీ మత సాహిత్యం ఈ ఉద్యమం యొక్క తీరు సామాన్య ప్రజాజీవనంలో ఎలా ఉండేది తెలుసుకోవడానికి తోడ్పడుతుంది. ఇది కుణబీలు (రైతులు) వనిలు (వ్యాపారులు)

చేతివృత్తుల వారు మొ॥ వారి సమస్యల్ని చర్చించింది. ఈ ఉద్యమం ప్రాంతీయ భాషాభివృద్ధికి, బడుగువర్గాల సముద్ధరణకి దోహదం చేసిందని ఎమ్. జి. రెనడే అన్నారు.

* తుకారాం కుల వ్యవస్థని తీవ్రంగా నిరసించడమేగాక హిందూ ముస్లింల ఐక్యత కోసం కూడా కృషి చేశాడు.

* జ్ఞానదేవుడు, నామదేవుడు

"మహారాష్ట్ర ధర్మ" (rise) ఆవిర్భావానికి దోహదం చేశారు. 16, 17 శతాబ్దాలలో ఇది నూతన చైతన్యం పొందింది.

(4) దీన్ని సాధించిన వారిలో ఏకనాథుడు ముఖ్యుడు. ఇతడు చతుశ్శ్లోకి భాగవతాన్ని 1036 పద్యాల్లో చెప్పాడు. ఇంకా "హరిపాఠ" పేరుతో 26 అభంగాలు రాశాడు. ఏకనాథుని ఈ రచనలు మహారాష్ట్రలో గొప్ప ఆధ్యాత్మిక శక్తిగా పనిచేసి అన్ని సమాజాలలో భిన్న తరగతుల మధ్య ఐక్యతా భావాన్ని సృష్టించాయి. తాను బ్రాహ్మణుడైనప్పటికీ ఆధ్యాత్మిక రంగంలో అందరికీ సమానావకాశాలుండాలి అన్నాడు. కీర్తనలు ఉన్నత, తక్కువ అనే తేడా లేకుండా అందరికోసం అని చెప్పాడు. ఇతడు ప్రాంతీయ ప్రజాదరణ గల భాషను వాడాడు. సనాతన రచయితలు కావ్యగ్రస్త కాలంగా పరిగణించే

కలియుగాన్ని దాని వైభవాన్ని అతడు కీర్తించాడు.
కేవలం వారి యొక్క వైభవాన్ని కీర్తించటం ద్వారా
మాత్రమే / కీర్తించినంతనే మోక్షం లభించగలదని
ఏకనాథుడు చెప్పాడు.

మహారాష్ట్ర అందించిన గొప్ప కవి - సాధువులందరిలోనూ "తుకారాం" (5) అగ్రగణ్యుడు. ఇతనిని భారతీయ సాధువుల గాదా అతడే గొప్పవాడిగా చెప్పబడతాడు. ఇతడు నామదేవుని బోధనల చేత ప్రభావితుడయ్యాడు. ఇతని రచనల్లో "అభంగ్ ఆర్తి" ని అందించిన భక్తిరస పద్యాలు ఉంటాయి. తుకారాం ప్రేమ వారసత్వం నిండిన మార్గదర్శకుడు. ఇతడు ప్రజల కవి.

"వాళ్ల భాష మాట్లాడుతూ, వారి నవ్వులు వినిపిస్తూ, వారి జీవితం గురించి మాట్లాడుతూ, వారిని అంతర్గత జీవితానికి యాత్రికులు కమ్మని వేడుకుంటూ, ఆడంబరాలు, మోసాలు, మూఢనమ్మకాలు ఇట్టివి అధికారిక సందర్భాలన్నీ విడనాడి, భగవత్ ప్రణయాన్ని గురించి ఆలోచించమంటాడు"

"నేను శూద్ర కుటుంబం లో
పుట్టాను, అందుకే స్వార్థం, గర్వాలు
నుండి స్వతంత్రంగా ఉన్నాను"
— తుకారాం

మహారాష్ట్ర లాంటి కష్టమైన సాధువులలో
చివరి గొప్పవాడిగా రాందాసును (6) చెప్పవచ్చు. ఇతడు ముఖ్య
రచన "దాసబోధ". అనేక సంవత్సరాల పాటు అతను
రాసిన రచనలు, చేసిన ఉపన్యాసాలు ఇందులో ఉన్నాయి. ఇది
అతని ఆధ్యాత్మిక, మత భావాలనే గాక సమకాలీన సమాజ
స్థితి (ఉదా: బ్రాహ్మణుల దురవస్థ, ఇస్లాం ప్రమాదం వంటి) ని
గురించి కూడా వివరించుతుంది. ఇతడులో భక్తి భావం త్రియాశీలత్వం
చైతన్య భావం రెండూ (devotionalism and activism)
దగ్గరగా / చిక్కగా పెనవేసుకొన్నాయి. రాందాసు బ్రాహ్మణుడే
అయినా బ్రాహ్మణుల ఆధిక్యతని వ్యతిరేకించాడు. ఇతడు
చైతన్య తత్వాన్ని చెప్పాడు (philosophy of activism).
దేవాలయాలకు అనుసంధానంగా తన మఠాల వ్యవస్థని
నెలకొల్పి తన భావాల ప్రచారం చేశాడు. శివాజీ
ఇతని శిష్యుడై విరివిగా విరాళాలు అందించాడు.

# మహారాష్ట్ర ధర్మ

[illegible] → మహారాష్ట్ర లోని వైష్ణవ భాగవత ధర్మాన్ని

— 13 వ శతాబ్దాంతానికల్లా అనేకమంది కవి సాధువులు .. వారిలో
జ్ఞానదేవుడు → భావార్థ దీపిక , జ్ఞానేశ్వరి

— ఆడంబర ఆచార వ్యతిరేకత, కుల వ్యతిరేకత

— మరాఠీ ఏర్పడిన వర్గాలకి .. జ్ఞానదేవుడు గీతని మరాఠీ రాగాల్లో
వార్కరి శాఖ కి బలం -- మ. ధ. కి పునాది

— వార్కరీ శాఖ వారు గృహస్థులు విఠోబా సర్వస్వం

— వార్కరీ కవి-సాధువులు నూతన సాధనా మార్గం - కీర్తనలు

— నామదేవుడు దర్జీ కులం -- ([illegible])

— జనాబాయి : అంకితత్వం

— జ్ఞా. దే + నాం. దే మ. ధర్మ ఆరంభానికి దోహదం చేశారు.
16,17 శతాబ్దాల్లో కవులు వృద్ధి

— ఏకనాథుడు 'హరిపథ' : భిన్నవర్గాల మధ్య ఐక్యత

— తుకారాం : ఆత్మ శక్తి

— రామదాసు 'దాసబోధ' — మఠాలు — శివాజీ
: భక్తితత్వం & చైతన్యతత్వం చక్కగా మేళవించబడ్డాయి.

— ప్రాంతీయ భావన వృద్ధి + బడుగు వర్గాల ఉద్ధరణ -- M. G. రెనడే

# Evolution of the Sikh Community [Khalsa]

భక్తి ఉద్యమ కాలంలో ఒకడైన గురునానక్ బోధనల ఫలితంగా సిక్కుమతం ఆవిర్భవించింది. నానక్ బోధనలు, అతని వారసుల కృషి చివరకు సిక్కుమత పరిణామానికి దారి తీసాయి. క్రీ.శ. 1538లో నానక్ మరణానికి ముందు అతడు అంగద్ ను తన వారసునిగా నియమించాడు. గురునానక్ ఇలా అంగద్ ను తన వారసునిగా నియమించడం వల్లే నానక్ పంథీలు నాటి ఇతర పంథీల వలె హిందూ మతంలో కలిసి పోకుండా ఉంది. కబీరు వలె నానక్ హిందూ, ముస్లిం దేవుళ్ళ పేర్లను గాని మరే బాహ్య ఆచారాల్ని గాని స్వీకరించకపోవడం కూడా వీరి ప్రత్యేకతను నిలబెట్టింది.

గురు అంగద్ "గురుముఖి" లిపి ని ప్రచారం చేశాడు. ఇతడు నానక్ జీవిత చరిత్ర ని, అతని బోధనల్ని సంకలనం చేశాడు. ఇతడు నానక్ శిష్యులకి మంచి క్రమశిక్షణ ని నేర్పాడు.

గురు అంగద్ ను గురు అమర్ దాస్ క్రీ.శ. 1552 లో వారసునిగా అనుసరించాడు. ఇతడు "లంగర్ వ్యవస్థ" ను పునరుద్ధరించి దాని కోసం ప్రాదేశికాల నియమించాడు. ఇతడు తన ఆధ్యాత్మిక రాజ్యాన్ని 22 భాగాలుగా చేసి (మంజీస Manjis) ఒక్కో దాన్ని ఒక

శిష్య పర్యవేక్షణాలని చేశాడు. ఇతడు శిష్యుల
జన్మ, మరణ సమయాలలో ప్రత్యేక ఆచారాల్ని నిర్దేశించాడు -
ఇవి హిందువుల ఆచారాల కంటే భిన్నమైనవి. గురు అమరదాస్
"సతి" ని నిషేధించాడు. స్త్రీలకు పరదా ని ఖండించాడు.
గురు అమర్ దాస్ కింద శిక్కుల ప్రత్యేక సంఘ గా
స్వవ్యక్తిత్వం కావడానికి మూలాలు ప్రారంభమయ్యాయి.
ఇతని కాలంలో హిందువుల, శిక్కుల భేదాలు కొద్ది
కొద్ది గా కన్పించడం, మెల్లిగా శిక్కులు సనాతన
హిందూమతానికి దూరంగా జరుగుతూ నూతన సాంప్రదాయాల
వర్గంగా తాము ఏర్పడటం మొదలైంది. ఈతని కాలంలో
మొదటి ముగ్గురు గురువుల పద్యాల్ని / బాణీల్ని ఇతర
భక్తుల రచనలు - (ఇవి నానక్ బాణీలని ప్రతిబింబిస్తుంటే)
సంకలనం చేయబడ్డాయి.

గురు అమర దాస్ తర్వాత గురు రామదాస్
గురువయ్యాడు. ఇతడు ఛాక్ గురు లేదా రామదాస్‌పురం
అనే నూతన పట్టణాన్ని కట్టించాడు, ఇదే తర్వాత అమృతసర
గా పిల్వబడింది. ఇతడు రెండు చెరువుల్ని -
అమృతసర్ మరియు సంతోఖ్‌సర్ లను తవ్వించాడు.
ఇతని కాలంలో శిక్కుమతం ప్రజాదరణ, ప్రఖ్యాతి
పొందింది.

ఆత్మీయత నెలకొల్పాడు. మానవ సౌభ్రాతృత్వం,
శిఖ్కు మతం క్రీ.శ. 1699 లో ఖాల్సా స్థాపించడం ద్వారా కొత్త
రూపు సంతరించుకుంది.

ఆనందపూర్ లో గురు గోవింద్ సింగ్ శిష్యుల
మహాసభ జరిపి వారిలో ఐదుగురు ఆకాంక్షుల్ని ఎంచుకొ
న్నాడు, వారే "పంజ్ పియారాలు" (Panj Piaras). వాళ్ళు
అమృతం తాగించారు. వారిని (baptising) ______
______ చేయించిన తర్వాత గురువు తనను కూడా
శిష్యు (చేయమన్నాడు) చేయించమని వారిని చెప్పాడు.
ఈ విధంగా గురువు శిష్యులు శిష్యు గురువులని కలిపివేయాలి.

శిఖ్కులు చేరిన స్త్రీ, పురుషులందరూ
(baptism) బాప్టిజం ను స్వీకరించి నూతన
క్రమశిక్షణాయుతమైన జీవితాన్ని ప్రారంభించాలి చేయాలి. వీటిలో
ముఖ్యమైనవి పంచ 'క' కారాలు ధరించటం, కొన్ని నిషేధాలు
పాటించడం. పంచ 'క' కారాలు – కేశ్, కంఘా, కృపాణ్,
కరా, కచ్ఛా. పొగాకు ను మానడం, ముస్లిం పద్ధతిలో
చంపిన మాంసాన్ని మానడం, ముస్లిం స్త్రీలతో శారీరక
సంబంధాలు పెట్టుకోవడం వంటి నిషేధాలు ఉన్నాయి. శిఖ్కు లు చేరిన
వారు పేరు మార్చుకోవాలి. శిఖ్కు స్వీకరించిన పురుషుడు
'సింగ్' ను స్త్రీలు 'కౌర్' ను తమ పేరు కు జోడించాలి.
ఈ విధంగా గురునానక్ అనుచరులు సైనికులైన సాధువులుగా
మారారు. (soldier-saints)

క్రీ.శ. 1708 లో తన మరణానికి ముందు గురు గోవిందుడు తన తర్వాత గురువు వ్యక్తి కాకూడదని ఉండదని చెప్పాడు. "ఆది గ్రంథ్" లేదా, ఖల్సా పంథ్ లేదా గురువు ఉంటుందని చెప్పాడు. నాటి నుంచి ఆది గ్రంథ "గురు గ్రంథ్ సాహెబ్" అయ్యింది.

దాదాపుగా ఆధునిక శిక్కు మతాన్ని బహిర్గతంగా వేరు పరిచే అన్ని స్వభావిక లక్షణాల్ని గురు గోవిందుడు ఉద్దేశపూర్వకంగా చేసిన ఏర్పాట్లు ఫలితమేనని, చెప్పారు. (లేదా అతని కాలంలో జరిగినవేనని) అయితే క్రీ.శ 1699 లో ముఖ్య ఘటన జరిగిందనడానికి, గురుగోవింద స్వయంగా సైన్యాధ్యక్ష సమూహాన్ని/రకాలు ఏర్పాటు చేశాడనడానికి ఎట్టి సందేహం లేదు, కానీ ఇంతకు మించి ముందుకెళ్ళ దానికి నమ్మదగిన ఆధారాలు లేవు. పైగా అయితే ఖల్సా యొక్క నిర్దిష్ట లక్షణాలు గురు గోవిందుని మరణం తర్వాత అనేకం ఏ మాత్రం సంబంధం లేని ఒత్తిడులకి ప్రతిస్పందనగా ఏర్పడ్డాయనడానికి తగిన ఆధారాలు ఉన్నాయి.

ఈ ఒత్తిడులలో రెండు చాలా ముఖ్యమైనవి. మొదటిది, శిక్కుమతం మీద ఆది నుంచి జాట్ భావాల ప్రభావం ఉంది. గురువు లందరూ నగర/పట్టణాలకి చెందిన క్షత్రియ కులానికి చెందిన వారే అయినప్పటికీ అనుచరుల్లో చాలా మంది గ్రామీణులు. వీరిలో శిక్కు /మతం లో

పిర్యాయాలా ఓసారి గురువు రహస్యంగా ఉంటూనే ఉంటారని భావించారు. ఎప్పుడైతే పదుగురు శిక్కులు కలిసారో అప్పుడు వారి మధ్య ఉంటానని గురు గోవిందుడు చెప్పాడు. ఈ సిద్ధాంతం తర్వాత నిర్దిష్ట క్రమంలో జరిగే మిస్సిల సమావేశాలకి బాగా విస్తరింపచేసారు. ఈ సమావేశాలు సదా ఆది గ్రంథ్ సాన్నిధ్యంలో జరిగేవి, ఈ సమావేశాల్లో తీసుకున్న నిర్ణయాలు గురు ఇష్ట ప్రకారంగానే జరిగినట్లు భావించేవారు.

## గురు సిద్ధాంతంలో మరొక మార్పు

19 వ శతాబ్దం తొలి కాలంలో వచ్చింది. రంజిత్ సింగ్ తన తోటి మిస్లీదార్ల పై తన ఆధిపత్యం వచ్చాక వారి ఈ సమావేశాలని ఆపుచేసాడు. దాంతో "గురు పంథ్" సిద్ధాంతం దాదాపుగా పోయింది. తిరిగి "గురు గ్రంథ్" సిద్ధాంతం పూర్తి ప్రాబల్యం సంపాదించింది. మత గ్రంథంలో గురువున్నట్లు ఎప్పుడైతే గుర్తించటం చేసారో అప్పుడు చెప్పాల్సింది ప్రాబల్యాన్ని మార్చటమే. గురు గ్రంథం నేడు కూడా శిక్కు మత అభివ్యక్తీకరణలో కేంద్ర స్థానం ఆక్రమిస్తుంది. నిర్ణయాలు సాధారణం గా గురు గ్రంథ సాహిబ్ ను ఒక oracle గా ఉంచి చేస్తారు. వివాహాలు ఇప్పటికీ, పిల్లలకు పేర్లు పెట్టటాలకి గురు గ్రంథ్ ను తెరిచినా చదువుతారు. మత పండుగలన్నింటికీ గురు గ్రంథ్ ప్రతి రోజూ తప్పనిసరి. ఈ విధంగా వాడబడే గ్రంథం గురు అర్జున్ సంకలనం చేసిన ఆది గ్రంథ్ తప్పించి 18 వ శతాబ్దంలో సంకలనం చేయబడిన "దశమ గ్రంథ్" కాదు.

మత ఉత్సవాలు కూడా భక్తి నుంచి

విస్తారంగా పెరగడం వలన "గురుద్వారా" (గురువు యొక్క ద్వారం) అనే సంస్థాగత వ్యవస్థ వృద్ధి చెందింది. దీని మూలాలను నానక్ శిష్యులు మత కీర్తనల్ని పాడేందుకు నిర్మించబడిన/ ప్రత్యేకించబడిన గదిలో తరచుగా సమావేశమయ్యే రోజుల కి చెప్పవచ్చు. ఈ గదిని "ధర్మశాల" అనేవారు. ఈ ధర్మశాల విధుల్ని మత ఆసక్తులు పెరగటం వలన విస్తరింప చేయటం భక్తి & మతపరమైన పరిమితం కాకుండా విస్తృత విధులు ఇవ్వటం వలన దాని పేరు గురుద్వారా గా మారింది. నేటికీ గురుద్వారాలు సిక్కు మత కార్యకలాపాలకి కేంద్రం గా ఉన్నాయి. వాటికిచ్చే భక్తుల దానాలు ప్రతి ఏడాది చెప్పలేనన్ని వివాదాల్ని కలిగించటానికి కారణం కావచ్చు. నేడు సిక్కుల రాజకీయ కార్యకలాపాలు, అకాలీ పార్టీ ద్వారా జరిగేవి, చాలా వరకు ధనిక గురుద్వారాల నియంత్రణ మీద (ముఖ్యంగా అమృతసర్‌లోని స్వర్ణ దేవాలయం) ఆధారపడి ఉన్నాయి.

## Chapter : 22.

## Economy and Society, 16th and 17th Centuries

### FAMINES

సామ్రాజ్యం, సమృద్ధి ఉన్నప్పటికీ మొగలుల కాలంలో కూడా భారతదేశం క్షామాలతోనూ విస్తృత కరువు తోనూ బాధలు పడింది. ఋతు పవనాలు విఫలం చెందటం, విపరీతమైన వరదలు, నిరంతర ఘర్షణ-యుద్ధాలు, మొ॥ వి నాటి కరువులకు కారణాలుగా ఉండేవి.

రికార్డు / నమోదు చేయబడినంత వరకు మొగలుల కాలంలో మొదటి కరువు అక్బరు సింహాసనానికి వచ్చే కాలంలో క్రీ.శ. 1555-56 ప్రాంతంలో వచ్చింది. ఢిల్లీ, ఆగ్రా, ఇతర పరిసర ప్రాంతాలలో వచ్చిన ఈ కరువులో జన నష్టం, పశు సంపద నష్టం అపారంగా జరిగింది. క్రీ.శ. 1573 నుండి 1595 ప్రాంతంలో మరో ఏడు క్షామాలు సంభవించాయి. క్రీ.శ. 1573 లో గుజరాత్ లో సంభవించిన క్షామం దాదాపు ఆరు నెలల పాటు అల్లకల్లోలం చేసింది. వాయువ్య ప్రాంతంలో క్రీ.శ. 1583 - 84 లో క్షామం వచ్చింది. క్రీ.శ. 1595 లో కాశ్మీరు లో కరువు ప్రజల్ని అష్టకష్టాల పాల్జేసింది.

షాజహాను పాలనా కాలంలో క్రీ.శ. 1630-31 ప్రాంతంలో చాలా తీవ్రమైన క్షామం సంభవించింది. దీని ప్రభావానికి గుజరాతు, గోల్కొండ ప్రధానంగా

గురి అయ్యాయి. అంతకు ముందు మూడు సంవత్సరాలపాటు పంటలు సరిగా పండక పోవడం, ఆ ఏడాది రుతుపవనాలు వైఫల్యం పొందటం తో ఈ క్షామం ఏర్పడింది. జీవించటానికి కావాల్సిన కనీస అవసరాలకు కూడా తీవ్రమైన కొరత ఏర్పడింది. క్రీ.శ. 1641 లో కర్నూలు లోను, క్రీ.శ. 1646 లో పంజాబు లోనూ క్షామ పరిస్థితులు ఏర్పడ్డాయి.

ఔరంగజేబు పాలనా కాలంలో ప్రధానంగా మూడు క్షామాలు వచ్చాయి. ఇవి క్రీ.శ. 1659, క్రీ.శ. 1670-71, క్రీ.శ. 1684 లలో వచ్చాయి. ఇవేగాక 18 వ శతాబ్దం తొలి సంవత్సరాలలో అంటే క్రీ.శ. 1702-04 మధ్య కాలంలో పెద్ద క్షామం విజృంభించింది. అయితే ఔరంగజేబు ముందరి పాలకుల కాలంలో వచ్చిన క్షామాలతో పోల్చితే ఇవి అంత తీవ్రమైనవి కావనే చెప్పవచ్చు.

క్షామాలు ఇలా తరచుగా వస్తున్నప్పటికీ మొఘలు ప్రభుత్వం ప్రభావిత ప్రజలకు ఉపశమన చర్యలు చేపట్టేందుకు తగిన చర్యలు తీసుకునేందుకు ఏ ఏర్పాట్లూ నిర్దిష్టంగా, శాశ్వతం గా చేయలేకపోయింది. ఎప్పటికప్పుడు తాత్కాలిక ఉపశమన చర్యల రూపం మాత్రం వారి పద్ధతుల్లో తెలుస్తుంది.

క్షామాలు వచ్చినపుడు పాలకులు ఆహార సరఫరా, ఉచిత పంపిణీ చేయడం, ఆ

ప్రాంతం లో పన్నుల నుంచి మినహాయింపు కల్పించడం మరియు ఉదారమైన చర్యలు చేపట్టేవారు. దాంతో పాటు ప్రత్యామ్నాయ జీవిక కల్పించేందుకు కూడా యత్నించారు. రోడ్ల నిర్మాణం, కాలువలు, ప్రజోపయోగ భవనాలు మరియు కట్టించడం ద్వారా ఈ ప్రత్యామ్నాయ ఉపాధి కల్పించేవారు.

అయితే సాధారణంగా ప్రభుత్వ సహాయం అస్పష్టంగా వెలువడి ఆకలి, రోగాల బారినపడి చనిపోయిన తీవ్రత ఉండేది.

ప్రభుత్వం చొరవ తీసుకుని ఈ విధమైన సహజ వైపరీత్యాల 'నివారణ' కోసం ఎలాంటి పథకాలూ రూపొందించలేదు.

సమర్థమైన, వేగవంతమైన ఆధునిక సమాచార సంబంధాలు, రవాణా లేని కారణంగా ప్రభుత్వ సహాయం అందాల్సిన సమయంలో అందాల్సిన వారికి చేరక క్షామ తీవ్రత హెచ్చయ్యేది.

అయితే అదృష్టవశాత్తు మూడు నాలుగు క్షామాలు వాటి దుష్ప్రభావాలు ఏదో ఒక ప్రావిన్సుకే ఎప్పుడోగాని రెండు ప్రావిన్సుల ప్రాంతాలకే పరిమితం అయ్యేవి. పైగా ఈ పరిస్థితులు పునరావృతమైనా, వ్యవసాయ ఉత్పత్తి చెడుగా ప్రభావితం చేయడం గాని ; జనాభా పెరుగుదలల దెబ్బతిన్న

అవాంతరాన్ని గాని కలుగజేయలేదు.

కరువు కాలంలో ఆకలి బాధలకు తాళలేక పల్లెల్లోని పేదప్రజలు పట్టణాలకు వలస పోయేవారు. ఈ కరువు సమయాన్ని ధనికులు, మధ్య తరగతి రైతులు కొందరు పేద రైతుల్ని అప్పుల్లోకి నెట్టేందుకు, వారి భూముల్ని స్వాధీనం చేసుకునేందుకు అలాగే వారి వ్యవసాయ పనిముట్లని కూడా [illegible] అవకాశంగా భావించేవారు.

# Conditions of Peasants

16, 17 శతాబ్దాలలో గ్రామాలలో దాదాపు 85% భారత ప్రజానీకం జీవించేది. వీరిలో అత్యధికులు రైతులే. గ్రామ ప్రజానీకం లో ఒక ముఖ్య భాగం అయిన రైతుల ఫలవంతమైన కృషి మీదనే లక్షల గ్రామ తరగతులన్నీ (నిజానికి పట్టణప్రజానీకంలో సహా) ఆధార పడి ఉన్నాయి.

ఈ కాలంలో రైతుల్లో ఆర్థికంగా, సామాజికంగా తీవ్రమైన అంతరాలు చోటు చేసుకున్నాయి. రైతుల్లో ధనికులు ( అంటే ఖుద్ కాష్త్, ఘరుహాల, మరియు మిరాస్ దార్) పేదలు ( అంటే రెజారియా, మాల్టి, కున్బి ) ఉండేవారు. గ్రామాల్లో శాశ్వత నివాసం గల రైతులు (మిరాస్ దార్లు, థాల్కర్) తాత్కాలిక నివాసం గల రైతులు (పాయికాష్త్, ఉపారి) ఉండేవారు. కులాలు, వారసత్వ సంబంధాలు (భాయిభరా) కూడా రైతుల్లో విభజనలకి దారి తీసేవి. గ్రామం లో రైతుల పైన ఉండే మరో గ్రామీణ వర్గం "జమిందార్లు". వీరు రైతుల నుంచి భూమిశిస్తు వసూలు చేయడంలో మధ్యవర్తి పాలకులకి సాయం గా ఉండేవారు.

గ్రామాల్లోని రైతుల్లో అధికులు తాము ఆ గ్రామాల వాస్తవ, ఆది నివాసులమని

చెప్పుకునే వారు. ఈ నివాస / స్థానిక వ్యవసాయదారులు రెండు రకాలు - ప్రత్యేక హక్కులు గల "రియాయతి" సాధారణ, సామాన్యమైన "రైయతి".

రియాయతి వర్గం లో స్థానికులైన వ్యవసాయదారులు భూమి కి యజమానులు గానూ తమ భూమి కి వారే సాగుదారులు గానూ ఉండేవారు. (resident, owner-cultivators) వీరిని మహారాష్ట్ర లో "మిరాసి" అని, రాజస్థాన ప్రాంతాల్లో "ఘరు-హాల" అని అనేవారు. పర్షియన్ వీరిని "ఖుద్‌కష్త్" అనేవారు. ఖుద్‌కష్త్ అనే పదానికి 'ఎద్దుల వెంట తనుభోగదానికి తానే ధనం చెల్లించి, రైతుల (riaya) చేత - సాగుచేయించుకునేవాడు' అని అర్థం చెప్పబడింది. 'భూమి యొక్క యజమానే (మాలిక్-ఇ-జమీన్) తాను భూమి ని సాగు చేసుకుంటే అతడు ఖుద్-కష్త్' అంటారని 18వ శతాబ్దం లోని ఒక గ్రంథం తెల్పింది.

అంటే క్రమం లో (1) ఇది నివాసం వారా లేదా స్థానిక నివాస వారా, (2) భూమి యొక్క యాజమాన్యం మరియు (3) భూమిని పట్టించుకున్నారా, కూలీ కి

పెట్టుకున్న రైతుల పొలంలో సాగు చేయడం లేదని 'ఖుద్-కాష్త్' యొక్క మౌలిక లక్షణాలని తెలుస్తుంది. ఖుద్-కాష్త్‌లు భూమిశిస్తు ను మినహాయింపు పొందిన రేటు లో కట్టడమే గాక, వారికి మొత్తం గా గాని కొంతగా గాని లేక పన్నుల నుండి మినహాయింపు ఉండేది - ఉదా: పెళ్లిళ్ల మీద పన్ను. ఖుద్-కాష్త్ కు గ్రామంలో స్థిర నివాసం ఉన్నంత కాలం అతడు ఇంటి పన్ను కూడా కట్టనవసరం లేదు.

"ఖుద్‌కాష్త్ ఉన్న వాళ్ళు విలువైన వాళ్ళు, అది ఆర్థిక సదుపాయాలు కలిగిస్తున్నందుకే కాదు, దాని వలన ఒక విధమైన సాంఘిక హోదా కూడా కలుగుతున్నందు వలనే. వీరు గ్రామప్రజల పాలక వర్గం గా దాని 'భద్రలోక' లేదా గౌరవనీయ తరగతి గా ఏర్పడ్డారు"

అని 18 వ శతాబ్దాని కి చెందిన W.W. హంటర్ అనే ఆంగ్ల పాలకుడు వ్యాఖ్యానించాడు. ఖుద్‌కాష్త్‌లకు గ్రామ పచ్చికబయళ్ళు, అడవి భూములు, నీటి చెరువులు, చేపలు, గ్రామాధికారుల సేవలు మొ॥ వినియోగించుకునే హక్కు కలిగి ఉన్నారు.

అయితే ఈ ఖుద్‌కాష్త్ లను లేదా స్థానిక, యజమాని - సాగుదార్ల ను మొత్తం స్థానిక సాగుదార్లందరి లో సమానం గా చూడడం పొరపాటు అవుతుంది.

అలాగే ఖుదకష్టులను "పాహి" లేదా "పాంచు-కష్ట" (అనగా పరిసర గ్రామాల నుంచి, పరగణాల నుంచి మిగులు అధిక Surplus సాగు చేసేందుకు భూముల్లో గాని, శిథిలమైన గ్రామాల్లో తిరిగి నివసించేందుకు గాని, లేదా క్రొత్త గ్రామంగా ఏర్పడ్డానికి గాని వచ్చినటువంటి వారు) ల నుంచి కూడా వేరు చెయ్యాలి.

పాహీలు లేదా పాయుకష్టలను మినహాయింపు రేట్ల కై పట్టాలిస్తారు. అయితే వారు మొత్తం రేటు ను 3 వ లేదా 5 వ లేదా ఇంకా తర్వాత నుంచి గాని కడతారు. ఈ విధమైన మినహాయింపులు ధనం లో, కాలం లో పరిస్థితుల్ని బట్టి మారుతూ ఉండేవి. పాహీ లకు సొంత వ్యవసాయ పనిముట్లు లేకుంటే వారికి రాజ్యమే నాగలి, ఎద్దులు, విత్తనాలు, ఎరువులు, మొ॥ ప్రత్యక్షంగా (ప్ర) భుత్వమే ఇవ్వడమో లేదా గ్రామ వడ్డీవ్యాపారి (బ్రాహ్మణులు) ఇవ్వడమో చేసేవారు. వారు భూమిశిస్తు చెల్లించినంత కాలం తమ భూముల్ని కలిగి ఉండేందుకు కూడా అనుమతించబడింది.

ప్రాకృతిక కారణాల వల్ల [కరువులు మొ॥] గాని, యుద్ధాలు - స్థానిక తిరుగుబాటులు మొ॥ వాటి వల్ల

గాని రైతులు వలస పోవడం, గ్రామం నుంచి గ్రామానికి మారడం నాడు సామాన్య విషయమే. ఇది 16వ శతాబ్దంలోనే విరివిగా ఉన్నట్లు తులసీదాసు రచనల వల్ల తెలుస్తుంది. తమ పరిస్థితుల్ని మెరుగు పర్చుకునేందుకు, కొత్త గ్రామంగా స్థిరపడేందుకు, సాగు విస్తీర్ణం పెంచేందుకు, పునర్నివాసాలు ఏర్పర్చేందుకు ఇలా అనేక కారణాల కోసం రైతులు గ్రామం నించి గ్రామానికి మారేవారు. అందువల్ల అస్థిర పరిస్థితుల్లో 'పహీల' సంఖ్య బాగా పెరిగేది.

కొత్త, పేదా శిస్తుల గ్రామాలకి తాము సాగులోకి తెచ్చిన భూమి పై యాజమాన్యం పొందుదామని వచ్చిన దళితుల్ని పహీలుగా మార్చివేసిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. ఇటువంటి వృద్ధి దళితులకి వారి సొంత గ్రామాల్లో సాంఘిక ఆచారాల కారణంగా సాధ్యమయ్యేది కాదు. అయితే కొటు మెట్ట ప్రాంతాలలోని దళిత వర్గం రైతుల్ని కూడా భూమికి యజమానులు కాబిచ్చిన సందర్భాలు ఉన్నాయి.

పహీలను తాత్కాలిక పేదా వలస కూలీలుగా చూడటం తప్పు. ఎందుకంటే వారిలో చాలా మంది గ్రామాల్లో స్థిరపడ్డారు,

క్రమంగా రెండు, మూడు తరాల తర్వాత వారు
స్థానిక వ్యవసాయదార్ల వర్గం లో చేర్చబడ్డారు.

వ్యవసాయదారుల్లో సాధారణ వర్గం
వారిని "రైయతీలు" లేదా "పల్టీలు" అనేవారు.
(రాజస్థాన్ లో పల్టీలు) దక్షిణాన లో వీరిని "ముజారియన్"
(Muzarian) అనేవారు. వీరు సాధారణంగా ముఖ్య
తరగతులకి చెందినవారు - జాట్, గుజార్, మాలి, అహిర్,
మీనా మొ॥ వి. వారు ↓ యజమానులు గాని
(మాలిక్, ధని) అంటే సాగు చేసే భూమికి
లేదా కౌలుదార్లు గా గాని ఉండేవారు.
రైయతీ యజమాని - సాగుదార్లను రైయతీ దస్తూర్
ప్రకారం శిస్తు మదింపు చేసేవారు. ఇది పంటని బట్టి,
మట్టిని బట్టి, నీటిపారుదలా సౌకర్యాన్ని బట్టి
మారుతూవుండేది. అయితే సాధారణంగా పొలజ్ భూమి
పై సామాన్య శిస్తు ఉత్పత్తి లో సగభాగం
భూమిశిస్తు గా కట్టేవాడు. గోధుమ, బజ్రా పంటలకి
$\frac{2}{5}$ వంతులు కట్టేవాడు. భూమిశిస్తు నగదు రూపాల్లో
(జిహాత్) లో చెల్లించినది కాదు.

కౌలుదారు లేదా పల్టీ (Palti) కౌలుదార్లు

రెండు రకాలు — (ప్ర)భుత్వ కౌలుదార్లు, ధని కౌలుదార్లు.

బంజరు భూముల్లో, ధనులు వదిలేసిన భూముల్లో సాగు చేసే వారిని (ప్ర)భుత్వ కౌలుదార్లు అంటారు. వీరు తమ సొంత నాగలి, ఎడ్లు కలిగి ఉంటారు. (ప్ర)భుత్వం ఇచ్చిన ఒక సంవత్సరానికి లేదా ఒక పంటకి ఇచ్చిన పట్టా కలిగి ఉంటారు. ఈ పట్టా పునరుద్ధరించుటకు (renewable) దగ్గరై ఉంటుంది.

ధని కౌలుదార్లు జమీందార్ల వృత్తిగల భూముల్లో; భూమియాలు, పటేల, ఇనాముగా భూమిని పొందిన వారి భూముల్లో సాగు చేసేవారు. వీరు సాధారణంగా మహాజన, జమీందార, పటేల మొ॥ వారి పై ఎడ్లు, నాగలి, విత్తులు మొ॥ వాటి కోసం ఆధారపడేవారు. వీరు భూమిశిస్తు ఆ రూపంగా తమ యజమానికి అద్దె చెల్లించడమో లేదా పంట-భాగాన్ని వాటా ఇవ్వడమో చేసేవారు. ఈ ధని కౌలుదార్లు,

ఈ సాగుదార్లు చాలా తక్కువ సాంఘిక స్థాయికి చెందినవారు. ఒక్కసారి వీరికి వాడే పల్టీ Palti పదాన్ని నిర్వాహంలో వాడేవారు. పల్టీలు కూడా పరిస్థితులు మెరుగు కాగా గ్రామం నుంచి గ్రామానికి తిరిగేవారు. కొత్త లేదా శిథిల

గ్రామాన్ని ఉత్పత్తులనుంచి వీరికి మినహాయింపు లేదా భూములని ఇచ్చేవారు. ఒక్కోసారి ఈ పల్లెలను పటేలను దేవ మాదిరిగా చూసేవారు.

సాగుదార్లే కాక భూముల్లేని కొందరు కూలీలుగా వ్యవసాయ కూలీలుగా (మజూర్లుగా) Majurs పని చేసేవారు.

సాగుదార్లలో రైతులు మధ్యతరగతి వారికి చెందినవారు. పెద్ద గ్రామాల్లో 5 నుంచి 10% రైతులు ధనికులు, 15 నుంచి 30% సొంత భూముల్లేని పేదలు, కాగా తక్కిన రైతులు మధ్యతరగతి వారు. ఈ విభాగంలో భూముల్లేని వ్యవసాయ కూలీలు లేరు.

సాధారణంగా కేంద్ర లేదా స్థానిక ప్రభుత్వ పర్యవేక్షణ బలహీనంగా ఉన్నప్పుడు గ్రామాల్లోని ధనిక రైతులు తాము చెల్లించాల్సిన భూమిశిస్తును పేదరైతుల మీదకి తోసేసేవారు. వ్యవసాయ పనిముట్లకి, భూమిశిస్తు చెల్లింపులకి పేద రైతులకి అప్పులిచ్చి తర్వాత సమయంలో అధిక వడ్డీలతో సహా రాబట్టుకునేవారు. కరువు సమయాల్లో అప్పులు తిరిగివ్వలేకుండా ఉన్నప్పుడు వారి భూముల్ని స్వాధీనం చేసుకునేవారు. కరువు సమయాల్లో తమ భూములపై వారిని కూలీలుగా మార్చేసేవారు.

సాధారణ పరిస్థితుల్లో మాత్రం ధనం,
పనిముట్లు, సాగు విస్తీర్ణం, వైవిధ్యం పెంపొందించు వ్యవస్థీకరణ,
మేలు రకం పంటలు పరిచయం చేయడం మొ॥ వాటి ద్వారా
ఈ ధనిక రైతాంగమే పేద రైతాంగానికి సాయపడేది.
ఇలా ధనిక రైతుల వల్ల పేద రైతులకి మంచి చెడు
రెండూ ఉన్నా చెడు ప్రభావమే అధికమని చెప్పాలి.

బంజరు భూములు (Cultivable waste land)
విరివిగా ఉన్నా భూసంపదలో అసమానతలు అధికంగా ఉండేవి.

సాధారణ మొగలు సూత్రం ప్రకారం
పంటలో 1/3 నుంచి 1/2 వరకు భూమిశిస్తు విధించేవారు.
ఏదైనా ఖచ్చితంగా ([illegible]) భూసారం, సాగుదారుని శక్తి, ఆ
ప్రాంత జమీందారు తత్వం, సంప్రదాయాలు ఇలా ఎన్నో కారణాలపై
భూమిశిస్తు ఆధారపడి ఉండేది. కులం కూడా పాత్ర
వహించేది. రాజస్థాన్, బెంగాలు లాంటి ఉన్నత వర్ణాలు
(బ్రాహ్మణులు, క్షత్రియులు (రాజపుత్రులు) కొంత మినహాయింపు
పొందారు. వీరు కాక గ్రామాధికారులు చౌధురీలు,
ముకద్దములు మొ॥ వారు కూడా కొంత మినహాయింపు
పొందారు. ఇలాంటి మినహాయింపులు సాధారణ రైతుకు
శిథిల గ్రామాల్ని పునర్నిర్మించటం వంటి ప్రత్యేక సందర్భాల్లోనే
ఇచ్చేవారు, అదీ 3వ లేదా 5వ సంవత్సరం నుంచి
మొత్తం శిస్తు చెల్లించాల్సి ఉండేది. అదే సాధారణ రైతు

# Condition of Women

క్రీ.శ. 16, 17 శతాబ్దాలలో స్త్రీల పరిస్థితి మత, ఆర్థిక, సామాజిక కారణాల మీద ప్రధానం గా ఆధారపడి ఉండేది.

పరదా : ముస్లిం స్త్రీలలో బురఖా సర్వసాధారణం. వీరి ప్రభావంలో ఉన్నత హిందూ కుటుంబాల్లో కూడా పరదా ప్రాధాన్యం పెరిగింది. తమ స్త్రీల గౌరవం, వారి సౌందర్యం తమ పవిత్రత కాపాడ్డం కోసం హిందువులు పరదా ను అవలంబించారు. స్త్రీలని నిర్బంధంలో ఉంచటం రెండు మతాల ఉన్నత కుటుంబాల్లో చేశారు. మగవైద్యులు పరదాలని స్త్రీలని చూసే వీలు లేదు. స్త్రీ - పురుషుల మధ్య సమాచారాలు చేరవేసేందుకు కొజ్జా (eunuchs) కొజ్జాలను వాడేవారు.

బార్బోసా 'కాంబయాంత్' ప్రాంతంలో స్త్రీలు పరదా ధరించినా తరచుగా తమ స్నేహితురాళ్లను కలుసుకునేవారని, పరదాలో ఉన్నా వారికి సౌకర్యంగా మంచి స్వేచ్ఛ ఉండేదని రాశాడు. ముఖ్యంగా రాజవంశస్త్రీలు పరదా ను తప్పనిసరి గా ఆచరించలేదు. వీరు యుద్ధవిద్యలో శిక్షణ పొందటం, వేటలకి వెళ్లడం చేసేవారు.

దక్షిణ భారతం లో ఎవరూ [illegible]

ముస్లిం గోషాబాలు తప్ప పరదాను పాటించలేదు. విజయనగర సామ్రాజ్యం లో రాజస్త్రీలు తప్ప పరదా లేదు. వేశ్యాస్త్రీలు, ముఖ్యంగా మధ్య, అధమ తరగతుల వారు ఏ నిబంధనలూ లేకుండా స్వేచ్ఛగా సంచరించ గలిగేవారు. కింది తరగతి మహిళలు వారి మగ వారికి కన్నా బయట పనుల్లో సహకారం అందించేవారు.

భ్రూణ, శిశు హత్యలు : ఆడపిల్ల జన్మ సాధారణంగా కోరుకునేవారు కాదు. వరుసగా ఆడపిల్లల్ని కనే భార్యకి విడాకులు ఇచ్చేవారు కూడా. శిశుహత్యల ఆచారం మాత్రం ఏవో కొన్ని రాజస్థాన్ ప్రాంతాలకే పరిమితమైంది. ఆడపిల్ల పెళ్లి ఖర్చులు ఆకాశాన్ని అంటేట్లుగా ఉండేవి ఆ ప్రాంతాల్లో. దీని తప్పించుకునేందుకు స్త్రీ శిశుహత్యలు చేసేవారు.

వివాహ సంబంధ దురాచారాలు :

బాల్య వివాహాలు సాధారణం. వరకట్నం విపరీతంగా ఉండేది. అక్బరు / బాలబాలికల వివాహ వయస్సు నిర్ణయించడం, స్త్రీకి వివాహం విషయంలో స్వేచ్ఛ నివ్వడం కోసం కృషి చేసినా ప్రయోజనం కలగలేదు.

మగవాళ్లు తమకన్నా పెద్ద స్త్రీలని

పెళ్ళి చేసుకోవడం ఎంతగా పెరిగిందంటే అప్పుడు ఆ వివాహాలు చెల్లవని శాసనం చెయ్యాల్సి వచ్చింది.

రాజపుత్ర స్త్రీలకి వరుడిని ఎన్నుకోవడంలో కొంత స్వేచ్ఛ ఉండేది.

హిందూ - ముస్లిం పాలకులు, భూస్వాములు, ఉన్నత వర్గాలకు చెందిన వారిలో బహుభార్యాత్వం ఉండేది. సామాన్య హిందువులు మాత్రం ఏకపత్నీత్వం ఆచారంగా కలిగి ఉన్నారు. ముస్లిములు మాత్రం పేదవారు కూడా షరియత్ అంగీకరించినట్లు నలుగురు భార్యలుండాలని కోరుకునేవారు. మతగురువులు ముఖ్యంగా వారి సంఖ్య పెంచుకునే ఉద్దేశంతో దీన్ని ప్రోత్సహించేవారు. అక్బరు మాత్రం సామాన్య ముస్లిం మొదటి భార్యకి సంతానం లేనప్పుడు తప్ప ఇంకో పెళ్ళి చేసుకోరాదని ఆజ్ఞ చేశాడు.

వివాహానంతరం స్త్రీ అత్త అజమాయిషీ లోకి రెండు మతాల్లోనూ వస్తుంది. ముస్లింలలో ఆమె అత్త [illegible] లేకపోతే విడాకులు ఇవ్వవచ్చు. హిందూ స్త్రీలు విడాకులు పొందరు, అత్త ఆజ్ఞ తప్పేవి కాదు. అయితే ఒక నాటి అత్త పీడ పోతే భర్తతో సంతోషంగానే జీవించేదని జహాంగీరు రచన వల్ల తెలుస్తుంది.



హిందువు & ముసల్మాను

భార్య భాగస్వామ్యం లేదా తోడు లేకుండా
సమాజంలో హిందువు రాజ్యంలో ఏ మంచి
పని చేయలేమన్నది ఒక నిత్యసత్యం
లాంటిది. వారు భార్యని పురుషుని
యొక్క ఉత్తమ అర్ధ గా భావిస్తారు"

— జహాంగీరు

చివరి మాట భర్తదే అయినా స్త్రీ పురుషుల పరస్పర సహకారం ఉండేదని తెలుస్తుంది.

విడాకులు, పునర్వివాహం ముస్లింలలో సాధారణం, కానీ హిందువులలో అవి నిషేధించబడ్డాయి. హిందువులు వీటికి దూరంగా ఉండేవారు.

సతి :

హిందువులలో (పునర్వివాహం) విత్తంతు వివాహాలు కింది తరగతుల్లోని విధవలలో మాత్రమే జరిగేది. ఉన్నత కులాల వారు సాధారణంగా 'సతి' ఆచరించేవారు.

జౌహార్ సంప్రదాయం రాజపుత్రులకి మాత్రమే పరిమితమైంది. యుద్ధాల్లో ఓటమి తప్పదని తెలిసినపుడు తమ గౌరవాన్ని కాపాడుకునేందుకు వారు సామూహికంగా ఆత్మాహుతులు చేసుకునేవారు. బాబరు చందేరిలో మేదినీ రాయ్ స్త్రీల జౌహార్ ని విపులంగా రాశాడు.

హిందువుల్లోని ఉన్నత కులాల్లో 'సతి'
సర్వ సాధారణం. అక్బరు తన రాజ్యంలో కు స్త్రీ ఇష్టానికి
వ్యతిరేకంగా సతి జరగకుండా చూడమని ఆజ్ఞాపించాడు. ఒకసారి
అలాంటి స్త్రీని రక్షించాడని స్వయంగా. కబురే తెప్పించుకునేవాడు.
దీన్-ఇ-ఇలాహీ ఈ ఆచారాన్ని నిరసించింది. జహంగీరు
పర్షియా సాదాత్ల మతమార్పిడి పొందిన ముస్లిం లలో ఇంకా
సతి కొనసాగుతున్నదని తెలిసి జహాంగీరు శిక్షార్హ,
సతి లను మరణశిక్ష గల నేరాలు చేశాడు. షాజహాను
ముస్లిం పుట్టిన సమయాల్లో సతి ని నిషేధించాడు. ఔరంగజేబు
ఈ మరణాన్ని ఖండించడానికి తన సామ్రాజ్యమంతటా
నిర్దిష్ట చట్టాలు చేపట్టిన ఏకైక ముస్లిం పాలకుడు.

అయితే రాజస్థాన్ రాజుల్లో విధవలుగా
మిగిలిన రాణుల సంఖ్య పెంపుదల బట్టి నాడు 'సతి'
చేయడంలో విపరీతమైన ఒత్తిడి తీవ్రంగా ఉండేదని
చెప్పవచ్చు. కాని, రాజు భార్యలు గాని, ఇతర లేదా
సంబంధిత స్త్రీలు గాని 'సతి' చేసినట్లయితే ఆ మరణించిన
రాజు పవిత్ర గౌరవం పెరుగుతుందని చెప్పి అతని రాణుల్ని,
సాధారణ భార్యల్ని, సేవకురాళ్ళ ని సతి చేయించేవారు.
1698 లో బికనీరు రాజు అనుప్ సింగ్ చనిపోగా అతని
ఇద్దరు రాణులతో పాటు 9 మంది సాధారణ భార్యలు
7 గురు సేవకురాళ్లు సతి చేశారు.

తల్లిగా :

ఆ కాలంలో తల్లిగా సమాజంలో స్త్రీ కి ఎంతో గౌరవం ఉండేది. చక్రవర్తులు వారి తల్లుల్ని ఆశీర్వదించేందుకు ఎన్నో దూరాలు ప్రయాణించేవారు. తమ జన్మదినాన ఆమె ఆశీస్సులు అందుకునేందుకు వెళ్ళి ఆమెను దర్శించగానే సాష్టాంగదండప్రమాణం (సిజ్దా), తస్లీం మొ॥ చేసేవారు. బహుశా రాజపుత్రుల కన్నా తమ తల్లుల్ని ఎక్కువగా గౌరవించి ఉండరు.

ఆస్తి వారసత్వ : ముస్లిం స్త్రీ

ముస్లిం స్త్రీలకు వారసత్వంగా ఆస్తిలో నిర్దిష్టమైన వాటా ఉంది, పైగా ఈ ధనాన్ని ఆమె ఎలాగోవాలంటే అలా వినియోగించుకోవచ్చు. పెళ్ళి తర్వాత కూడా ఆమెకే వారసత్వ ఉంటుంది. మహర్ ఆమె కి మహా రక్షణ (Mahr).

కానీ హిందూ స్త్రీ కి తన భర్త తల్లిదండ్రుల ఆస్తిలో ఏ వాటా ఉండదు. ఆమె కి కేవలం ఇల్లు, పాడిగా పశువులు కొన్ని కదిలే వస్తువులు (ఉదా: నగలు) మాత్రమే ఇస్తారు. ఈ విధంగా హిందూ స్త్రీ అడుగడుగునా ఆధారపడేదానిగా చేయబడింది.

ఆచరణ లో ముస్లిం స్త్రీల విషయంలో కూడా క్రియలు జరిగేది. ప్రముఖుల కుటుంబాల్లో ఆచరణ తర్వాత, చనిపోయిన ప్రముఖుని ఆస్తిని వారసుడు తనకు కొడుకుల మధ్య తన కిష్టం వచ్చిన రీతి లో పంచేవాడు. ప్రముఖుల కుమార్తెలకు ఆస్తిలో వాటాలు ఇచ్చినట్లు ఎక్కడా కన్పించదు. అయితే స్వాయత్తస్థానాలు కలాంటి కాపురాల్లో (ఇతర) సామాన్య ముస్లిం ల విషయంలో తేడా పట్టి ఉండవచ్చు).

కు

మ

పురుషాధిక్యత గల సమాజం లోని చెడు ప్రభావముంటూనే వుంది స్త్రీ గురించి తండ్రి, భర్త, కొడుకుల మీద ఆధారపడి జీవించాల్సి ఉండేది. అయితే ఉన్నత కుటుంబాల్లోని స్త్రీలు విద్యనేర్చిన వారు, విలాసవంతమైన జీవితం గడిపే వారు, పాలనలోనూ పాలుపంచుకునేవారు, భర్త ని అసంతృప్తి భావాలు, పెద్దలతో పంచుకునే వారు గా భావించారు. వీరి లో కొందరు మాత్రం రాజకీయాల్లో కూడా ముఖ్యమైన పాత్ర వహించారు. గోండ్వానా రాణి దుర్గావతి, అహ్మదనగర్ లో చాంద్ బీబీ మొదలైన వారు ఇందుకు నిదర్శనం. భర్తల ద్వారా అధికారం చెలాయించిన వారు కొందరు, నూర్జహాన్ ఈ కోవలోకే వస్తుంది. జహనారా, షాజహాన్ కూతురు, ఈమె తన

ఆంధ్ర రాణులు, కాకతీయ రాణులకూ రాజకీయాలతో
దగ్గర సంబంధం చాలా ఉండేది. ఇంకా ఎందరో స్త్రీలు
మహమ్మదీయ పాలనలో రంగాయమ్మ (స్త్రీ)
జుహ్రా, బేగం రాణి ఉత్తమ బాయి, ఒసప్పటు
నాట్యగత్తె, మొగలుల పతన కాలంలో రాజకీయాల్లో
పాత్ర వహించారు. మహారాష్ట్ర కి చెందిన తారాబాయి
కూడా.

సాధారణంగా స్త్రీలు కుటుంబానికి పరిమిత
మయ్యేవారు. వ్యవసాయం, కూలి తరగతుల స్త్రీలు
మాత్రం పురుషుల లా పాటుగా కుటుంబ పోషణలు,
వ్యవసాయం, పశు పెంపకం, నూలు వడకడం, నేయడం, బుట్టలు
మొదలైన పనుల్లో పాలు పంచుకునే వారు. వారిలో
కొందరు దుకాణాలు నడిపేవారు. కొందరు మంత్రసానులుగా
కొందరు ఉపాధ్యాయురాళ్లు గా ఉండేవారు. చాలామంది
నాట్యగత్తెలుగా, గాయనీలుగా ఉండేవారు.

కొందరు ముస్లిం స్త్రీలు ఎంతో విద్యావంతులై
పేరొందిన గొప్ప కవయిత్రులయ్యారు. గుల్బదన్ బేగం
"హుమాయూన్ నామా" రాసింది. ఔరంగజేబు పెద్ద
కూతురు జైబున్నీసా గొప్ప కవయిత్రి. హిందూ
స్త్రీలేమీ వెనుకబడలేదు. కుమార కంపన భార్య
గంగాదేవి "మధురా విజయం" రాసింది. భక్త

మీరాబాయి అద్భుతమైన కీర్తనలు రాసింది. రామభద్రాంబ " రఘునాథాభ్యుదయం " రాసింది.

స్త్రీలు రాచరిక అభిరుచుల్ని ప్రభావితం చేశారు. సమకాలీన సమాజ శైలిని, సాంస్కృతిక స్వభావాన్ని ప్రభావితం చేశారు. హారెం లలోని ధనిక స్త్రీలందరూ కళాకారుల్ని పోషించి, ఆదరించారు. స్వయంగా కళా కారిణులైన వారూ ఉన్నారు. జెబున్నీసా "మఖ్ఫీ" కలం పేరుతో ఎన్నో కవితలు రాసింది. రోషనారా ఢిల్లీలో సాహిత్య కేంద్రాన్ని " బెయిత్ ఉల్ ఉలూమ్ " ను స్థాపించింది, ~~ఈ~~ కారణం చేతనే ఆమెను ఔరంగజేబు వెళ్ళగొట్టాడు.

సాధారణ స్త్రీకి జీవితం కష్టంగానే ఉండేది. భవన కట్టడ పనుల్లో పనివాళ్ళలో పని చేస్తున్న స్త్రీలు చిత్రాల్లో కన్పిస్తుంటారు. మగవారి కంటే ఆడకూలీలకు తక్కువ వేతనాలు ఇచ్చేవారు. కొన్ని వృత్తుల్లో మాత్రం స్త్రీలు ప్రాముఖ్యం, ప్రత్యేకత సంపాదించారు. అన్ని తరగతుల్లోనూ నూలు వడకడం స్త్రీలు విరివిగా చేసేవారు. ఢాకా లో ప్రపంచ ప్రఖ్యాత మస్లిన్ కి చక్కని దారాన్ని స్త్రీలే వడికేవారు, అరుదుగా వేగంగా కదిలే వేళ్ళ, సూక్ష్మమైన కంటి చూపు గల ఉన్నత వర్గ స్త్రీలే వడికేవారు. వారికి నైపుణ్యం గల పనివారికిచ్చేది నెలకి రూ..3 ఇచ్చేవారు. అవధ్ లో ప్రఖ్యాతి చెందిన చికన్ పని కూడా స్త్రీలదే. ~~అయితే~~ వీరంతా ప్రావీణ్యం

లేదా ముస్లిం రాజులకు కలిగిన నియంత్రణాలలోనే పని చేసేవారు.

ఉన్నత వర్గాల వారు కేవలం స్త్రీలు మాత్రమే ఉండే భవంతులు – "హారేం" అను ఏర్పాటు చేసుకునేవారు. వీటిని కాపలా కాయడానికి కొజ్జా బానిసలను పెట్టేవారు.

స్త్రీ బానిసల కొనుగోలు, అమ్మకాలు మంచి లాభదాయక వ్యాపారంగా ఉండేది.

ముస్లింలలో: సంప్రదాయమైన స్త్రీలెవరూ బురఖా లేకుండా బయటికి రారు, అసలు బయటికి రావడమే చాలా తక్కువ. పేద స్త్రీలు మాత్రమే నడిచి వెళ్ళేవారు. ధనిక స్త్రీ లందరూ మూసిన పల్లకీలలోనే వెళ్ళేవారు. దగ్గరి బంధువుల్ని కూడా తమ భార్యల్ని చూడనిచ్చేవారు కాదు. స్త్రీల ప్రైవసీకి చాలా విలువ ఇచ్చేవారు. వారి హారేంల లోకి ఏ మగవాడు – భర్త, కొడుకు మొ॥ వారు ఎవరైనా ముందుగా వస్తున్నట్లు చెప్పాకే వెళ్లాలి.

అయితే తన కుటుంబం వరకు ముస్లిం స్త్రీ చాలని గౌరవాన్ని హోదా స్థానాన్ని కలిగి ఉండేది. ఆమెని కుటుంబ గౌరవంగా చూసి, ఆ గౌరవం కాపాడేందుకు ఏ త్యాగమైనా చిన్నదిగా భావించేవారు.

6 పరదా గల స్త్రీల పల్లకీ

"దేశమంతటా పవిత్రంగా భావించబడేది,
దాన్ని ఎదిరించటానికి ఎవరూ సాహసించరు"

— బదౌని.

ముస్లిం స్త్రీలు మతవిద్య నేర్చుకునేవారు. ఖురాన్ ను కేవల జ్ఞాపకంతో నేర్చుకునేవారు, సాధారణంగా అంకితమైన పాఠాల్ని గడిపేవారు. వీరిలో కొందరు ఖురాన్ transcribe చేయడం నేర్చుకున్నారు. ఏమైనా నాటి ముస్లిం స్త్రీ బహుభార్యత్వం, నిర్బంధాల (కి బలైపోయేదని)లో కష్టపడేదని మహమ్మద్ యాసిన్ తన " A Social History of Islamic India " లో రాశారు. నాటి కాలపు గొప్ప అమీరు ఇళ్లు అనేక మంది భార్యలతో (ముస్లిం) మానవ జాతిని పెంచే యంత్రాలు గా మార్చేసేదని కూడా యాసిన్ పేర్కొన్నారు.

హిందూ స్త్రీలు సతి లో మరణాలు పడినా సాధారణంగా ముస్లిం స్త్రీలకన్నా సామాజిక స్వేచ్ఛ ఎక్కువగానే ఉండేది. హిందూ స్త్రీ స్వేచ్ఛగా సంచరిస్తూ సాంఘిక - మత సాంస్కృతిక కార్యకలాపాల్లో వారి పురుషులతో కలిసి విస్తృతంగా పాల్గొనేది. అయితే ఉన్నత కుటుంబాలలో మాత్రం స్త్రీలని ఇంటికి పరిమితం చేయడానికే మొగ్గు చూపేవారు. స్త్రీకి సాంఘిక స్వేచ్ఛ ఉంటే అలవాటు లేని కాలానికి చెందిన మగవారి దృష్టుల నుంచి తమ స్త్రీలని కాపాడుకోడానికి

# Chapter - 23 Culture during the Mughal Empire

## Mughal Painting

ప్రాచీన కాలం నుంచి భారతదేశం లో చిత్రకళ ను రాజాస్థానాల్లో ఆదరించేవారు, అజంతా, ఎల్లోరా గుహలు ఇందుకు నిదర్శనం. ఢిల్లీ సుల్తానులు (మధ్యయుగం లో) చిత్రలేఖనాన్ని ప్రత్యేకంగా ఆదరించినట్లు కనబడదు. కానీ మొగలులు మాత్రం ఈ కళను మిక్కిలి ఆదరించి అనేక నూతన శైలి ఆవిర్భావానికి కారణమయ్యారు.

బాబరు, హుమయూన్ ల కాలంలో చిత్రకళ చిగురులేసి అక్బరు కాలంలో పుష్పించి జహంగీరు కాలంలో పూలు, పక్షుల ఉత్కృష్ట దశకు చేరింది. షాజహాన్ కాలంలో ఆడంబర అలంకారాలు చూపింది. కానీ ఔరంగజేబు పాలన లో ఎండిన మోడయ్యింది. ఏదైనా మొగలుల ఆస్థానం లో ఓ వెలుగు వెలిగిన మొగలు చిత్రకళ విదేశీ-స్వదేశీ రీతుల మేలు కలయిక.

### బాబరు:

'మొగలు శైలి' చిత్రకళ యొక్క మూలాన్ని క్రీ.శ. 1504 లో బాబరు ఆక్రమణ కు ముందే సమర్ఖండ్ కేంద్రంగా ఉన్న కాబూల్లో (Kabul) చూడవచ్చు. కాబూల్ తైమూరిడ్ పాలకులు చిత్రకళ ని ఎంతో ఆదరించారు.

బాబరు చిత్ర కళను పోషించాడు. గొప్ప సౌందర్యారాధకుడు

(ఇలా పోషించి అయినా బాబరు చిత్రలేఖనము గొప్పగా పోషించాడు, బిహ్జాద్ చిత్రకారుల్ని నియమించాడు.

బాబర్ కొలువులో వ్యక్తులంతా గీసిన అల్బర్ నామా ప్రతి (పర్షియన్ కథనం) లోని చిత్రాలు చిత్రలేఖనాల వారి కృషిని వెల్లడిస్తాయి.

హుమయూన్:

ఇతడు పర్షియా లో ఉన్నప్పుడు 'బిహజాద్' అనే చిత్రకారుని శిష్యులతో ఉన్నాడు. అతని శిష్యులందర్నీ ఇతడు ఆదరించాడు.

వారిలో [మీర్ సైయద్ అలీ', 'అబ్దుస్ సమద్' లు ఇతనితో పాటు ఢిల్లీ చేరారు. వీరిద్దరూ భారతీయ సంప్రదాయాలతో కలిసి కృషి చేసి మొగలు శైలి చిత్రకళ కి మూలకేంద్రాన్ని ఏర్పరిచారు.] హుమయూన్ స్వయంగా వీరిద్దరి వద్ద నుంచి చిత్రకళ నేర్చుకున్నాడు, అక్బరు కూడా వీరి వద్దే శిక్షణ (చిత్రకళలో) చేశాడు.

మొగలు శైలి లో ఎన్నో లక్షణాలు హుమయూన్ కాలం లో వేసిన చిత్రాల్లోనే జనించినట్లు తెలుస్తుంది. [ఇతని కాలంలో "తైమూర్ కుటుంబం లోని రాకుమారులు" (క్రీ.శ. 1550) అనే

చిత్రపటం చాలా ముఖ్యమైంది. ఇది వస్త్రం మీద వేయబడిన చాలా పెద్ద చిత్రపటం (1.15 చ. మీ.). ఇంత పరిమాణంలో చిత్రం వేయటం పర్షియన్ చిత్రకారులకు ఉచితం కాదు. దీని పై మంగోలులు గుడారాల్లో వేసుకునే పెద్ద చిత్రాల ప్రభావం ఉందనిపిస్తుంది.

## అక్బరు :

అక్బరు, ఇతర పర్షియన్ గురువుల మొగలాయి నిరంతరగా ఆవిష్కరించబడుతూనే ఉన్నారు. అక్బరు విదేశీ చిత్రకారుల్ని ఆదరించినప్పటికీ పూర్తిగా వారి మీద ఆధారపడటాన్ని ఇష్టపడలేదు. అందువల్ల భారతదేశం నలుమూలల నుండి నైపుణ్యం గల ఆసక్తి గల చిత్రకారుల్ని ఎంచి వారిని పర్షియన్ గురువుల కింద ఉంచాడు. ఈ స్థానిక చిత్రకారులు వారితో పాటు అనేక స్థానిక చిత్రకళా సంప్రదాయాల్ని తీసుకొచ్చారు. అందువలన మొగలాయి చిత్రకళ పర్షియన్ మరియు భారతదేశంలోని వివిధ ప్రాంతాలలోని భారతీయ చిత్రకళా శైలుల యొక్క సమ్మేళనం, అయినప్పటికీ అది ఈ శైలుల నుండి విలక్షణమైనది.

అక్బరు స్వయంగా చిత్రకారుల పనితనాన్ని చూసి వారికి బహుమానాలు, రాజాదరణ ద్వారా ప్రోత్సాహం అందించాడు. అతనికి భారతీయ శిల్పం పైకి రావాలని ఉండేది. అందువలన ఆరంభంలో అతడు చిత్రకారుల్ని గుంపులుగా విభజించాడు. వారి వారి వ్యక్తిగత ప్రతిభల్ని బట్టి తర్వాత చిత్రకారుల ఆసక్తిని బట్టి వారి నమూనాలకి

వారికి నచ్చిన ఒక విషయంలో మాత్రమే ప్రత్యేకంగా
ఇష్టపడేవాడు. దీని ద్వారా కొద్ది కాలం లోనే ఆ రంగంలో మంచి
నైపుణ్యం సాధ్యమౌతుంది. అందువల్ల అక్బరు పాలన లోని
చాలా కాలంలోని చిత్రపటాలు ఏదీ ఒక చిత్రకారుడిది కాదు.
[తాము ప్రత్యేకీకరణ (1) పొందిన రంగాన్ని ఒకే చిత్రం చిత్రలేఖనం లో
అనేక మంది చిత్రకారులు ప్రదర్శించేవారు.] ఇలా మనుషుల్ని,
జంతువుల్ని, వస్తువుల్ని ఒకే చిత్రపటంలో ఉన్నా వేరు వేరు
చిత్రకారులు గీసేవారు / వేసేవారు. ఇందులో మళ్ళీ
ఉప విభజన ఉంది. చిత్రపటంలో ఒక భాగాన్ని
(ఉదా: పై విభాగంలో జంతువు) ఒక వ్యక్తి స్కెచ్ గీస్తే
ఇంకో చిత్రకారుడు రంగులు నింపేవాడు.

అయితే చిత్రకారుల్లో దీని మీద
ఏకాభిప్రాయం లేదు. [సతీష్ చంద్ర A. Rahman (ed.)
History of Indian Science, Technology and Culture
A.D. 1000 - 1800] అక్బరు కాలంలో ప్రత్యేకీకరణకు
చాలా తక్కువ అవకాశం ఉండేది. ఒక చిత్రపటంలో ఒకరు
ఔట్‌లైన్, ఒకరు రంగులు, ఒకరు ముఖం వేసేవారు. ఇందులో
ఔట్‌లైన్ వేసినవాడు అన్నిటి చిత్రపటంలో రంగులు వేయాల్సి
వచ్చేది. అక్బర్ తర్వాత జహాంగీరు ఒక చిత్రపటంలో ఎవరు రంగులు
వేశారో, ఎవరు ఔట్‌లైన్ గీశారో, ఎవరు ముఖం చిత్రించారో
నేను గుర్తించగలనని చెప్పాడు.

అక్బరు

(8) మొగలు శైలి & "మియాన్ తాన్‌సేన్"

అదిత్యనామ & రాక", దస్తాన్ -2- తమీర్ హమ్జా గ్రంథం లోని వివరణా ఉదాహరణచిత్రాలు, ఫతేపూర్ సిక్రీ లోని కుడ్యచిత్రాల్ని గొప్ప ఉదాహరణలుగా చెప్పవచ్చు.

అబుల్ ఫజల్ ప్రకారం అక్బరు ఆస్థానంలో 100 వరకూ మంచి చిత్రకారులుండేవారు, వీరు ఖ్యాతి పొందుట్లు. విదేశీయుల్లో అబ్దుస్ సమద్, సయ్యద్ అలీ లు ముఖ్యులు. దస్వంత్, బసవన్, లాల్, హరిబన్స్, కేశు, ముకుంద భారతీయ చిత్రకారులు.

క్రీ.శ. 1567 లో అక్బరు విస్తృత ఉదాహరణ చిత్రాలలో పర్షియన్ "హమ్జానామా" రూపకల్పనకు ఆదేశమిచ్చాడు.

రాజ చిత్రకళా కేంద్రం : (2)

అక్బరు దర్బారు స్థాపించిన తర్వాత చేపట్టిన తొలి పెద్ద ప్రాజెక్టు 'హమ్జానామా' కు వివరణ ఉదాహరణ చిత్రాల్ని వేయడం. ఇది 1562 లో మొదలయ్యింది.

చిత్రకారులు పని చేసే స్థలాన్ని "తస్వీర్ ఖానా" అనేవారు. ఎస్.పి. వర్మ అనే చరిత్రకారుడు 225 మంది చిత్రకారుల పేర్లు సంపాదించాడు. (Art, Material Culture in the Paintings of Akbar's Court) వీరు బిరుదులు పొందుట్లు, వేరువేరు ప్రాంతాలకు చెందినవారు. హీనకులాల వార్ని కూడా ఆస్థాన చిత్రకారుల్ని చేసాడు.

మేళవింపు స్వభావాన్ని సంతరించుకున్నాయి. పర్షియన్, భారతీయ సంప్రదాయాలు యూరోపియన్ లక్షణాలతో కూడి వీటిలో ఉన్నాయి.

విశిష్ట లక్షణాలు :

రాజ చిత్రకళాసౌందర్యాన్ని స్థాపించిన 15 సం॥ ల కాలం లో మొగలుశైలి గుర్తింపు పొందే స్థాయికి ఎదిగింది. ఆ తర్వాతి దశాబ్దం లో 1590 ప్రాంతంలో మొగలుశైలి విలక్షణతను సంపాదించింది. ఇందులోని విశిష్టతలు

- సహజత్వం, లయ
- రాజుగారి దుస్తులు భారతీయ రూపాన్ని సంతరించుకోవడం
- చిత్రాల్లో నేపథ్యం కింద ఉపబలం గా ఉండే దృశ్యాన్ని వేయడం
- కార్యం, విస్తృత కదలికల్లో అసాధారణమైన లోతు, సత్యత
- విలాసవంతంగా ఆకుల్ని, తేజోవంతంగా మొగ్గల్ని, పువ్వుల్ని చిత్రించటం

అక్బరు కాలం లోని చిత్రపటాలు ఎంత పర్షియన్ - భారతీయ శైలుల సమ్మేళనంగా ఉన్నాయో అంత సహజవాస్తవికతా శైలి నీ కలిగి ఉన్నాయని గమనించాలి. మొగలుల కంటె భారతీయశైలి లో గాని, పర్షియన్ చిత్రకళ లో గాని లేనట్టి రూపాల, కదలికల చిత్రీకరణ అక్బరు నాటి చిత్రపటాల్లో గమనించదగింది. (S.P. Verma in Art & Culture, eds. A.J. Qaiser & S.P. Verma)

బహుశా చిత్రకారులు శాస్త్ర బద్ధమైన పద్ధతిలోని దృశ్యాలనే చిత్రించవలసి ఉండవచ్చు - అంటే కోటల ముట్టడి, నదిని దాటడం, సభ, యుద్ధ దృశ్యం మొ॥ వి. మొత్తం గ్రంథాల కోసం (ఉదా: అక్బరు నామా) ఉదాహరణా చిత్రాలు రూపొందించినప్పుడు కూడా చిత్రకారులు ఈ పద్ధతినే అనుసరించేవారు. చిత్రకారులు "మౌలిక" ఏ సందర్భాల్లో మాత్రమే మౌలిక (8) కూర్పులు చేసేవారు. ఈ నవీన ఆవిష్కరణా ప్రతిభ ఏదో కొద్ది మంది చిత్రకారులకే ఉండేది.

ఈ కాలంలో వివరణా ఉదాహరణా చిత్రాలతో

రూపొందిన గ్రంథాలు హమ్జానామా, అన్వార్ ఇ సుహైలి, తూతీ నామా, తారీఖ్-ఇ-ఖాందాన్-తైమూరియా, బాబర్ నామా, అక్బర్ నామా, తారీఖ్ ఇ అల్ఫీ, రజ్మ్ నామా.

* పర్షియన్ కల్పిత గాథల చిత్రాలతో పాటు భారతీయ మహాభారతం మొ॥ వాటి పర్షియన్ అనువాదాలకు కూడా వివరణా ఉదాహరణా చిత్రాలు గీయించాడు. అద్భుత భారతీయ కథాంశాలూ, సన్నివేశాలూ వాడుకలోకి వచ్చి మొగల్ శైలి/ సంప్రదాయాన్ని పర్షియన్ ప్రభావం నుంచి (9) మరలించాయి. నెమలి రంగు, భారతీయ ఎరుపు వంటి భారతీయ రంగుల వాడకం పెరిగింది.

* అక్బరు వివరణా ఉదాహరణా చిత్రాలతో పాటు (10) మానవ చిత్రరూపాలను కూడా ఆదరించాడు. పోలికల కోసం లోను స్వభావాన్ని కూర్చడమే గాక రాజకుటుంబీకుల

ఆదర్శ్ లో సమాహారంగా మని ప్రదర్శించాడు. Album

* మొగలు శైలి చిత్రకళ కు ప్రథమంగా నిర్దిష్ట రూపాన్నిచ్చింది అక్బర్.

## మొగలు చిత్రకళ పై యూరోపియన్ శైలి ప్రభావం:

అక్బరు కాలంలో పోర్చుగీసు జెసూట్ మతగురువులు పరిచయం చేసిన యూరోపియన్ చిత్రాలు మొగలు చిత్రాల్ని ప్రభావితం చేశాయి. ఫతేపూర్ సిక్రీ ని దర్శించిన జెసూట్ మతగురువులు తొలి యూరోపియన్ ప్రతుల్ని, క్రైస్తవ ఇతివృత్తాలు గల చిత్రపటాల్ని బహుమానంగా ఇచ్చారు. అక్బరు, యువరాజు సలీం, ఇతర ఆస్థాన చిత్రకారులు వాటి లోని నూతనదనం, ఉన్నత టెక్నిక్‌లు చూసి ఆకర్షితులయ్యారు. అక్బరు పాశ్చాత్య చిత్రకారుల ఉత్తమ చిత్రాల్ని కొన్నింటిని సేకరించి వాటిని భారతీయ చిత్రకారులకి నమూనాగా ఆల్బమ్ లాగా ఉంచాడు.

ఆరంభంలో మొగలు చిత్రకారులు యూరోపియన్ చిత్రాల డిజైన్ల్ని, లోతైన రంగుల్ని కాపీ చేసి మొగలు రంగులు దిద్దేవారు. ఫలితంగా మొగలు మొదటి కాలం నాటి శైలి లో మార్పు కన్పించింది. దీన్ని పాశ్చాత్య-భారతీయ శైలి అన్నారు. ఇది

భారత్ దేశమంతా కన్పిస్తుంది, గుజరాత్ లో ఎక్కువగా ఈ
పాశ్చాత్య - భారతీయ శైలి కేంద్రీకృతమవుతుంది .

[పాశ్చాత్య - భారతీయ శైలి యొక్క విలక్షణత
లౌకిక విషయాలకు చెందింది, శైలి (లీనియర్) రేఖాత్మకమైనదే.
రూపాలు బదునుగా[2], పదునైన[3] కోణాలు గల కుదురుగా
ఉండేవి. ముఖాలు సాధారణంగా అర్ధముఖాలుగా[4] ఉండేవి
అయితే రెండు కళ్లూ చూపించబడేవి, వాటిలో ఒకటి
శూన్యం లోకి పొడుచుకొచ్చినట్లు[5] గీసేవారు. సాధారణంగా
ఎరుపు, ఆకుపచ్చ, నీలం, పసుపు, నలుపు రంగులు వాడేవారు.
నేపథ్యంగా ఏకరంగులో[6] ఎరుపు మెచ్చు తరచుగా కన్పిస్తుంది.]

ప్రారంభంలో వెలిసిన సమ్మేళనం లో
భారతీయ శైలులు,[7] యూరోపియన్ టెక్నిక్ ఉన్నాయి.
తర్వాత మొగలు చిత్రకారులు యూరోపియన్ బొమ్మల్ని[8],
దృక్కోణాన్ని వారి సొంత చిత్రాల్లో ప్రవేశపెట్టారు. వీటిలో
పాటు మెత్తనైన నీడలు[9], నమూనాలు, దూరం-[10] దగ్గర దృష్టికోణాలకు
సంబంధించిన టెక్నిక్ లను కూడా ప్రవేశపెట్టారు. ఇంకా తర్వాతి
కాలం లో నగరదృశ్యాలు, భూదృశ్యాలు (landscape[11]) వంటి
వాటిని (అప్పుడప్పుడు యూరోపియన్ స్త్రీ, పురుషుల దూరంగా
ఉండే నేపథ్యం లో ఉంచి మరీ) చిత్రించారు.

[కంపెనీ కాలంలో మొగలు చిత్రకారులు
మరింత ముందుకువెళ్లి నూతన విషయమైన iconography[12]
ఐకనోగ్రఫీ ని అందుకునే యత్నం చేశారు.]

వాస్తవ యూరోపియన్ చిత్రాన్ని సేకరించి ఇవ్వాలని, దారా షికోహ్, ఇంకా ఎందరో మొగలు ప్రముఖులు తమ ఆల్బమ్‌లలో భద్రపర్చుకునేవారు. (A.J. Qaisar, Indian Response to European Technology & Culture)

[మొగలు చిత్రాలకు & యూరోపియన్ చిత్రాలకు ఉన్న సంబంధం కేవలం వాటి అధ్యయనంతో కాక చెప్పటానికి ప్రయత్నించింది. సమకాలీన యూరోపియన్ పెయింటింగ్‌లు పేర్కొన్నట్లు ఇవి నిర్దుష్టంగా శుద్ధ ప్రతులుగా ఉండేవి. అయితే మొగలు చిత్రకారులు యూరోపియన్ చిత్రాల్ని నమూనాగా తీసుకుని ప్రయోగాలు చేస్తూ కొత్త చిత్రాన్ని కూడా సృష్టించారు.]

[యూరో.ప్ర. వీటిల్లో ముఖ్యమైనది మొగలు చిత్రాల్ని యూరోపియన్ ప్రభావంతో [14] త్రీడైమెన్షనల్ (3D) మలచ యత్నించడం. వెలుగు, నీడల ప్రభావం ముఖ్యంగా యుద్ధ దృశ్యాల్లో వినియోగించారు. కాంతి వలయాలు [15] (halos), రెక్కలున్న దేవదూతలు [16], గర్జిస్తున్న మేఘాలు [17] మొ॥వి మొగలు చిత్రాల్లో యూరోపియన్ చిత్రాల ప్రభావం చేతనే.]

[అయితే వీరెవ్వరూ తైల [18] చిత్రాలు మాత్రం ఎందుకనో మొగలులు ఆదరించలేదు. ఈ కాలంలో మొగలులు చిత్రించిన తైలవర్ణపటమేదీ లేదు.]

'ఫోర్-షార్టెనింగ్', 'పర్స్పెక్టివ్' మొ॥ సూత్రాల్ని అనుసరించారు.

## జహాంగీరు:

ఇతని కాలంలో మొగలు చిత్రకళ పరాకాష్ఠకి చేరుకుంది. రాజకుమారుని గా ఉన్నప్పుడే చిత్రకళ పై విపరీతమైన అభిమానం చూపేవాడు. అక్బరు రాజచిత్రకళాకేంద్రం కాక తను సొంతంగా చిత్రకళాకేంద్రాన్ని పెట్టుకున్నాడు. ఇతనికి వేట దృశ్యాలు, పక్షులు, జంతువులు, పూలు (గీయడం) వంటి వాటి చిత్రాలు చాలా (1) ఇష్టం. ఇతడు కూడా మానవ (portraiture) చిత్రరచనల్ని ఆదరించటం (2) కొనసాగించాడు.

### కొత్త రీతుల పరిచయం:

జహాంగీరు పాలనా కాలంలో గ్రంథాలకి (1605-27) ఉదాహరణా చిత్రాలు (manuscripts) గీయడం ప్రాధాన్యత తగ్గింది. ప్రత్యేక చిత్రాలకి (individual pictures) (3) ప్రాధాన్యం పెరిగింది.

జహాంగీరు చక్రవర్తి అయిన తర్వాత తను వ్యక్తిగతంగా పాల్గొనడం ద్వారా రాజచిత్రకళాకేంద్ర నాయకుని గా క్రియాశీలకంగా పనిచేసి ఉండవచ్చు. చిత్రకళా నిపుణుల్ని చక్రవర్తే ఎంపిక చేసేవాడు, ఫలితంగా తనకు ఇష్టమైన రీతుల్ని, శైలుల్ని చిత్రాల్లో ప్రవేశపెట్టినాడు - అని ఈ అభిప్రాయాన్ని "Mughal and Rajput Paintings" గ్రంథంలో మిలో క్లీవ్‌లాండ్ బీచ్ అభిప్రాయపడ్డారు.

జహాంగీరు కాలంలో మొగలు చిత్రకళలో చోటు చేసుకున్న (4) మార్పులు:

• జహాంగీరు చిత్రాలు ఒక విధమైన అధికారిక శైలి ని (formalist style) నియత
అంటే పునీ వాస్తవికం చేయడం, మరియు సమకాలీన
వాస్తవాన్ని యథాతథంగా చిత్రించటం అనే రెండిటిని దాన్ని
ఉద్ఘాటం చేసినట్లు ఉన్నట్టుంది.

• ఈ కాలం లోని చిత్రపటాల్లో విశాలమైన/వెడల్పైన
మార్జిన్లు ఉంటాయి. ఇవి పూలతీగలతో, మానవ ముఖాలతో
లేదా మొక్కల చిత్రాలతో నిండిన డిజైనులతో మిక్కిలి
శోభాయమానంగా అలంకరింపబడేవి.

ప్రకృతి చిత్రం లో సూక్ష్మత్వం :

(5) జహాంగీరు మంచి ప్రకృతి పరిశీలకుడు. ఎప్పుడైనా అతను ఏదయినా కొత్త పక్షినో, జంతువునో చూడగానే అతని చిత్రకారులు దాన్ని వెంటనే చిత్రించేవారు. నాటి పక్షుల, జంతువుల బొమ్మలు ఎంతో వాస్తవికంగా ఉంటాయి. మన్సూర్ వేసిన చారలగుర్రం (Zebra) చిత్రం లో జీవకళ ఉట్టిపడుతూఉంటుంది.

జహాంగీరు అద్భుత గుణగ్రహణ శాలి. అనేక చిత్రపటాల సేకర్త. మంచి చిత్రకళా విమర్శకుడు. (6) గుప్తరూప చిత్రలేఖనాన్ని అభ్యసించిన వ్యక్తిగా ఆయన భారతీయ, విదేశీ కళా సంప్రదాయాలకు చెందిన ఉత్తమ నమూనాలను నిరంతరం ప్రభుత్వ చిత్రశాలల్లో చేరుస్తూ ఉండేవాడు. మినియేచర్ చిత్రాలు

జహాంగీర్ పాలనా కాలంలో

మహ్మద నాదిర్, మహ్మద మురద్, అకారిజా, ఉస్తాద మన్సూర్ లు, హిందువులలో బిషన్ దాస్, కేశవమనోహర్, మాధవ్ వంటి చిత్రకారులు సుప్రసిద్ధులు. వీరేగాక ఫరూక్ బేగ్, గోవర్ధన్, దౌలత్ లు కూడా ముఖ్యులే. హిరట్ నుండి జహాంగీరు ఆస్థానానికి వచ్చిన అబ్దుల్ హసన్ కూడా ఎన్నదగిన వాడే.

జహాంగీరు స్వయంగా గొప్ప చిత్రకారుడు, చిత్రకళా విమర్శకుడు, మంచి అనుభవశాలి. నా ముందుకెవరైనా చిత్రపటం తెస్తే అందులో ఏ ముఖం ఎవరు వేశారో, వస్తుతః ముఖం వేసిన చిత్రకారుడెవరో, కనులు-కనుబొమలు పెట్టిన చిత్రకారుడెవరో కూడా నేను చెప్పగలనని ఆత్మవిశ్వాసంతో జహాంగీర్ అన్న మాటలు అతిశయోక్తులు కావు.

జహాంగీర్ కు మినియేచర్ చిత్రాల మీద ఆసక్తి అతని తల్లి (రాజపుత్ర స్త్రీ) ద్వారా ఏర్పడింది.

జహాంగీర్ కాలంలో సంప్రదాయ చిత్రలేఖనం అత్యుత్తమ అభివృద్ధి గల విజ్ఞానం, అతని ఆస్థాన చిత్రకారులు క్రైస్తవంలో కూడిన అతని

ఉద్యమం వల్ల ఇతర కాలంలో మొగలు చిత్రాల
పర్షియన్ ప్రభావం నుంచి విడివడ్డాయి పూర్తి (7) భారతీయ
స్వభావాన్ని పొందింది.

1) సమాజత్వ లోపం < ఇతి / చిత్ర లోకు

పాలకులను : 2) ఆర్థిక మాంద్యం — 1, 2, 3, 4

3) జీవకళ తగ్గి 4) కానసాంగత్యలు

పాలకులు కూడా ఔరంగజేబ్ స్వయంగా
చిత్రకారుడు. స్వతహాగా వాస్తు, కట్టడాల పట్ల ఆసక్తి
అధికం గాన చిత్రాలపై దృష్టి కేంద్రీకరించలేకపోయాడు.
అయినప్పటికీ ఇతర కాలంలో మహమ్మద్ కాదిర్,
మీర్ హాసన్, అనుపచిత్ర, బిలాలమియా మొ॥
చిత్రకారులు తమ చిత్రాలలో రాజాస్థానాన్ని, కళా
సౌందర్యాన్ని చిత్రించారు.

అయితే జహాంగీరు కాలంలో సాధించ
బడిన కళాప్రగతిని ఇతర కాలంలో ముందుకు
తీసుకెళ్లలేకపోయారు.

పైగా పాలకులను కు జహాంగీరువలె
ఈ రంగంలో ఆదరాభిమానాలు, సౌందర్యారాధనాదులు లేవు.
ఫలితంగా సమాజత్వం లేదు ఆలోచనల్లో కూడా
చిత్రలేఖనం లోనూ లోపించింది. ఆనాటి దృశ్యాలు
విశ్వవ్యాప్తాయి. బంగారంలో చిత్రించడం అధికమై
జీవకళ తగ్గిపోయింది.

ఇలాంటి కాలంలో ఆధునిక చిత్రకారుల సంఖ్య తగ్గింది. చిత్రాల నాణ్యం తగ్గిపోయింది. కాని ఇతని పెద్దకొడుకు దారాషుకోవ్ కు మొఘల్ చిత్రకళ మీద ఆసక్తి మెండు, అతడు చిత్ర కళను ఆదరించాడు. మొగలు చిత్రకళ పతనానికి ప్రథమ చిహ్నాలు ఇతని కాలం లోనే మొదలయ్యాయనవచ్చు.

షాజహాను కాలంలో మానవ చిత్తరువులు, ఆల్బముల తయారీ, గ్రంథాల్లో వివరణ ఉదాహరణ చిత్రాలు వేయటం, మొఘల్ శైలి కొనసాగాయి. మనోహరమైన ప్రకృతి దృశ్యాలు, స్త్రీల (రాణి ఏకాంతం వంటివి) చిత్తరువుల్ని వేయటం ఈ కాలంలో మొదలైంది. అంతేగాక ఇతని కాల చిత్రాల్లో జంతువుల్ని సూపర్ ఇంపోజ్ చేయటాన్ని (super imposition of animals) మరియు విషయాలు చెప్పే దృశ్యాల్ని ఇతివృత్తాలుగా తీసుకోవటం కన్పిస్తుంది.

ఔరంగజేబు :

ఇతడు చిత్రకళ విగ్రహారాధనని స్ఫూర్తిస్తుందని ఇది ఇస్లాం వ్యతిరేకమని అలాంటి చిత్ర ఆదరించలేదు. అయితే చిత్రాలు వేయటం

పూర్తిగా లభించలేదు. లభ్యమైన వాటిలో [ఇవి రాజ ప్రముఖులకి చెందినవి] ఇవి అనాగరికులైన కొద్దివి.

ఔరంగజేబు కాలంలో రాజ ప్రముఖుల, వారి సంబంధీకుల మానవ చిత్తరువులు లేవుగా లేవు. అందుకే దండయాత్రలప్పుడు ఔరంగజేబు చిత్తరువులే అన్ని దొరకడం ఆసక్తిదాయకం. వీటిలో మునుపటి జీవకళ లేదు, అధికారిక పరిధి. అయినా చిత్రకారుల వైవిధ్యం మాత్రం స్పష్టంగా కనబడుతుంది. (Rajasthan State Archives, Bikaner)

ఏమైనా చక్రవర్తి స్వయంగా ఆదరించకపోవటంతో చిత్రకారులు ప్రాంతీయ రాజాస్థానాలకి వలస పోయారు. మొగలు చిత్రకళ పతనాన దశకి చేరింది.

తర్వాత మహమ్మద్ షా (1719-48) కాలంలో చిత్రకళ తిరిగి రాజాదరణ పొందింది. అందుకే వీటిలో విలాసాన్ని ప్రేమించే దృష్టిలో లేదు. అదీగాక అప్పటికే మొగలు చిత్రకారులు ప్రాంతీయ రాజాస్థానాలకి వలస పోవడం మొదలైపోయింది. మొగలుల నష్టం ప్రాంతీయ చిత్రశైలులకి లాభం అయింది.

## మొగలు శైలి చిత్రకళా లక్షణాలు:

1) సనాతన ముస్లిం మత ఆచారాల కారణంగా మహమ్మదు ప్రవక్త ను గాని, ఇతర జీవుల ఘటనల్ని గాని చిత్రించ లేదు. మొగలు శైలి తో పరిశీలించదగిన విధంగా మత చిత్రాల్ని నివర్తించారు.

2) మొగలు శైలి లోని మానవ చిత్రరూపాలు (portraiture) ఊహాత్మక చిత్రాలు కావు, అవి వాస్తవ వ్యక్తులు. ఈ కార్యాన్ని నిర్వహించడం కోసం చిత్రకారులకు నిశిత పరిశీలన, మంచి సహనం - ఓర్పు, విపరీతమైన అభ్యాసం అవసరమౌతాయి.

3) మొగలు శైలిలో కొట్టొచ్చినట్లు కనబడేది వాస్తవికత. చిత్రాల్లోని పూలు, జంతువులు వాస్తవ జీవితం నుండి తీసుకున్నవే, ముఖ్యంగా "జహాంగీరు" కాలంలో ఈ లక్షణం ఉన్నతమైంది.

4) ఈ చిత్రాల్లో వర్ణాల్ని జాగ్రత్తగా ఎంచి మంచి అభిరుచితో వేసేవారు. సాధారణంగా వాడే వర్ణాలు బంగారం, నీలం, ఆకుపచ్చ, వెండి లాంటి తెలుపు. వీటిని అనేక షేడులలో లేక మేళనాలతో వేసేవారు.

5) మొగలు శైలి మినియేచర్ చిత్రరూపాల ప్రత్యేకత ఏమిటంటే అసలు చిత్రాన్ని ఎత్తుగా వేసి దాన్ని కళాత్మకమైన పత్రదళములతో శోభాయమానమైన అంచులతో (borders) అలంకరించడం.

6) మొగలు చిత్రకారులు ప్రథమమైన సామర్థ్యం చెడకుండానే సౌందర్యాత్మకత దెబ్బతినకుండానే ప్రతి వివరాలనూ కూర్చటంలో నేర్పరులు. అందువలనే వీరు వేటదృశ్యాలు మొ॥ వి సరైన (పర్స్పెక్టివ్) దృష్టికోణంలో చిత్రించారు.

7) మానవ రూప చిత్రాలలో మొగలుశైలి ప్రశంసనీయమైన ప్రగతి సాధించింది. సరియైన రంగులు వాడటం లోనూ, ఖచ్చితమైన కొలతలలోనూ, అలంకార వివరణాలలోనూ, వాస్తవ లక్షణాలను / పోలికలను చిత్రించడంలోనూ మొగలు చిత్రకారుడు ప్రసిద్ధి చెందాడు. ముఖం, తల, చేతులు, వేళ్లను అద్భుతమైన పోలికలతో ప్రాణమూర్తిగా చిత్రించేవాడు. రంగుల కూర్పు విషయంలో మొగలు చిత్రకారుని వైశిష్ట్యం అనన్యసాధ్యమైంది.

మొగలు చిత్రకళ ఎదుర్కొన్న పతనం తప్పనిసరి అనిపిస్తుంది. ఎందుకంటే మొగలుశైలి పూర్తిగా సామ్రాజ్యంలో రాజాస్థానం చేతనే పెంచబడిన కళ, అందువల్ల దీన్ని తన ప్రోత్సాహిత నివాసం నుంచి వేరుపర్చడం సహజంగానే దాని పతనానికి దారి తీసింది.

మొగలు చిత్రకళ లోని ఇతర లోపాలు:

1) మొగలు చిత్రాల్లో సామాన్య ప్రజల్ని చిత్రించలేదు. చిత్రకారులు చక్రవర్తుల ఆస్థానాల్లో ఉన్న అభిరుచుల, ఆస్థాన ఉద్యోగుల్ని గురించి చిత్రించారే గాని

సామాన్య జీవితాలకు సంబంధించిన ఇతివృత్తాల్ని
స్వీకరించలేదు. ఈ చిత్రలేఖనం భారతీయ వాతావరణాన్ని
వాతావరణాన్ని లేదా విశిష్టతనైనప్పటికీ భారతీయ
భావచిత్రణలను గాని, భారతీయుల దైనందిన జీవితాన్ని
గాని ఏది ప్రతిబింబింపచేయలేదు. మామిడి, మర్రి,
వంటి చెట్లు హంస, సింహం, నెమలి మొ॥ భారతీయ
ప్రత్యేక అంశాలను, భారతీయ స్త్రీలను, ఆభరణాలను
చిత్రించినా చిత్రించారు, కానీ ప్రజాజీవనాన్ని
మాత్రం ప్రతిబింబింప చేయలేదు.

2) మొగలు చిత్రాలు పరిమాణం లో చిన్నవిగా ఉండేవి
కాని వీటిని సూక్ష్మరూప చిత్రలేఖనాలంటారు. ఈ
కాలానికి ఎవి ప్రాచీన బౌద్ధ భిత్తి చిత్రాల
(Frescoes) వలెనూ, పరిమాణాన్ని
సంతరించుకోలేకపోయాయి.

3) మొగలు శైలి చిత్రాలలో యుద్ధాలు, వేట, దర్బారులు,
పక్షులు, పూలు, మొక్కలు, మొ॥ వి లేదా జంతువుల,
పురాణ దృశ్యాలు, మానవ చిత్తరువులు మొ॥ వే
ఉండేవి గాని మతపర చిత్రాలుగాని, స్త్రీల
జీవితానికి చెందిన వాస్తవ చిత్రాలుగానీ వీరి
చిత్రాల్లో చోటుచేసుకోలేదు.

4) మొగలు ఆస్థానం లో మందాలతనం మొ॥ వాటికి
ప్రాధాన్యం ఉండటం వలన మొగలు చిత్రకారులు మనిషిని
నగ్నంగా చిత్రించటం, సరైన శరీరనిర్మాణం (anatomy)
ప్రదర్శించగలగటం, కాళ్ళు-చేతులకి కండ కి మధ్య
సరైన నిష్పత్తి ని చూపటం మొ॥ వి చేయలేక
పోయారు.

5) వీరు సరైన భావాల భావాభివ్యక్తిని, మానవ
భావావేశాల ప్రదర్శించటం లో సాధించిన వైశిష్ట్య
కదలికలు, క్రియాశీలత్వం చూపటం లో సాధించలేక
పోయారు.

6) మొగలు చిత్రకారులు పర్స్పెక్టివ్ కళ లో ఎప్పుడూ
పూర్తి పరిపక్వత చూపలేకపోయారు. దూరంగా
ఉన్న వాటిని హారిజాంటల్ గా చూపాల్సి ఉండగా
వీరు తరచుగా నిలువుగా (vertical) చూపేవారు.

7) జంతువుల, పక్షుల మొగలు చిత్రకారులు చాలా
సూక్ష్మాలంలో అధ్యయనం చేసినప్పటికీ వారు
ప్రకృతి ని స్వతంత్రంగా అధ్యయనం చేయడం పట్ల
ఏలాగా ఆసక్తి చూపలేదు. ⊛ ఏమైనప్పటికీ

Satish Chandra

* యూరోపియన్ చిత్రాల ప్రభావం వల్ల మునుపటి విహంగవీక్షణ దృష్టికోణం (దీని ద్వారా ఒకే చిత్రంలో భిన్న స్థలాల్లో ఉన్న కార్యాన్ని చూపగలరు) వర్తులాకార ప్రభావం వల్ల స్థానభ్రంశం పొందింది.

* మొగలు చిత్రాల్లో చెట్లు, పక్షులు, కొలనులు, గుట్టలు మొ॥ తరచుగా ఎన్నో వేట, యుద్ధ దృశ్యాల కు నేపథ్యం గా అలరించేవి. వీటిలో ఒక ప్రత్యేకత ఏమిటంటే చెట్ల రంగులు (tonal) మరియు గుండ్రని (rounded effect) భావాన్ని కలిగించేవి.

# Vaishnav Bhakti

Intro

16, 17 శతాబ్దాలలో ఉత్తర భారతం అంతా వైష్ణవ భక్తి సముద్రంలా ప్రవహించింది. అంతకు ముందు శతాబ్దాలలో దక్షిణ భారతంలో జరిగిన భక్తి ఉద్యమం కన్నా ఇది చాలా భావావేశపూరితమైంది. వల్లభాచార్యుని శిష్యులు, హిత హరివంశ, హరిదాస స్వామి, శ్రీ భట్ట మరియు తులసీదాస్ మొ॥ వారు ఉత్తరభారతం లో వైష్ణవభక్తి ని ప్రవహింప చేశారు.

(1) వల్లభాచార్యుని కొడుకు విఠలనాథ పుష్టిమార్గాన్ని (వల్లభాచార్యుడు స్థాపించిన అనుగ్రహం లేదా కరుణ మతము - భగవంతుని కరుణ చే బలపడి భక్తిమార్గం ప్రవేశించిన వారే అభివృద్ధి సాధించగలరని వల్లభాచార్యుడు బోధించినందువల్ల ఈ మార్గాన్ని "పుష్టి మార్గము" అంటారు.) పూర్తిగా వ్యవస్థీకరించి అభివృద్ధి చేశాడు.

వల్లభుడు కృష్ణుని మానసికంగా సేవించడం పై ప్రాధాన్యతనివ్వగా విఠలుడు దేవాలయ విగ్రహాన్ని రోజుకు ఎనిమిది సార్లు గాత్ర, సంగీత వాయిద్యాల

లలో, మంచి పద్యాన్ని ఫలహారాలతో పూజించడాన్ని కూడా చేర్చాడు. ఇతడు రాధ పట్ల ఎటువంటి భక్తి గల్గి ఉన్నాడు. విఠలుని దృష్టిలో రాధ యొక్క కరుణ ద్వారా మాత్రమే కృష్ణుడు పూజ, ధ్యానం చేయగలుగుతున్నారు.

వల్లభాచార్యుని నలుగురు శిష్యులు - కుంభన్ దాస్, సూరదాస్, పరమానందదాసు, కృష్ణదాసు - ఇంకా తన నలుగురు శిష్యులు - గోవిందస్వామి, ఛీత స్వామి, చతుర్భుజ దాసు, నందదాసు అను విఠలుడు రాధా-కృష్ణుల ప్రణయ సంబంధ పాటలు కూర్చడానికి, పాడడానికి నియమించాడు. ఈ ఎనిమిది ప్రముఖ కవులను కలిపి "అష్ట ఛాప" అనగా ఎనిమిది నాణేలు చేసే అచ్చులుగా వీరు పద్యాలనే నాణేల తయారు చేసేవారిగా పోల్చి చెప్పారు.

విఠలుడు ఎన్ని ప్రాంతాల్లో పర్యటించి అనేక మంది శిష్యుల్ని పొందాడు. వీరిలో 252 మంది ముఖ్యమైనవారు. ఇతడు చివరికి గోకులంలో స్థిరపడ్డాడు. ఇతని ఏడుగురు కొడుకులు వారి వారి ప్రాంత కేంద్రాల్లో, రాజస్థాన్, గుజరాత్ మరియు ఉత్తరంగా మధుర పరిసర ప్రాంతాల్లోనూ ఏర్పాటు చేసి తమ మత ప్రబోధనలు వ్యాప్తి చేశారు.

ఈ విఠలుడు ప్రోత్స చేసిన మతం లో మిక్కిలి ప్రసిద్ధుడు సూరదాస్. ఇతని సూర "సూర - సారావళి" ప్రఖ్యాతి గాంచింది. కృష్ణుడు తన స్నేహితులు, స్నేహితురాళ్ళ తో ఆటలాడే టప్పుడు చూపే అద్భుత సన్నివేశాలు వర్ణించటం లో ఇతని కి ఎంతో ఆనందం.

హిత హరివంశుడు "రాధ - వల్లభ" మతాన్ని స్థాపించాడు. ఈ మతం వారు రాధ ని కృష్ణుని కంటే ఉన్నత స్థానం లో ఉంచారు. వీరు కృష్ణుని రాధ సేవకుని గా ఆమె సామ్రాజ్యాని కి కార్యదర్శి గా మాత్రమే చెబుతారు.

హరిదాస స్వామి మరో వైష్ణవ భక్తి మత స్థాపకుడు. ప్రముఖ గాయకుడు తాన్సేన కు ఆధ్యాత్మిక మార్గదర్శి ఇతడే. భక్తమాల హరిదాసస్వామి ని అతని సుమధుర సంగీతం కారణం గా ఒక విలక్షణ గంధర్వుని గా చిత్రించింది.

తులసీదాసు రామ భక్తి ని ప్రచారం చేశాడు. ఇతడు ఏ మతాన్ని గాని, ఏదో పెద్ద దేవాలయాన్ని గాని స్థాపించలేదు. హిందీ మాట్లాడే ప్రాంతాలలోని ప్రజల్ని ఇతని "రామ చరిత మానసం" మరే ఇతర గ్రంథం లేదా మత సంస్కర్త కన్నా విపరీతం గా ప్రభావితం చేసింది.

ఒరిస్సాలో శక్తి ఆరాధన ప్రబలంగా ఉన్న తూర్పు భాగాల్లో కూడా వైష్ణవ భక్తి ప్రాముఖ్యత పెరిగింది. సంప్రదాయం ప్రకారం ఒరిస్సాలో వైష్ణవాన్ని ప్రచారం చేసినవాడు 'గోపీకావల్లభుడు'. (6) 16 వ శతాబ్దం చివరి కాలంలో ఒరిస్సాలో ఉన్న రాజధరుడు వైష్ణవ మతాన్ని పుచ్చుకున్నాడు. ఇతడు రోజంతా కృష్ణుని కీర్తనలు పాడేందుకు గాయకులను నియమించాడు.

(7) కామరూప, కూచ్ బీహారులలో శంకరదేవ వైష్ణవ భక్తి ని పరిచయం చేశాడు. కొంతమంది గిరిజనులు కూడా ఈ వైష్ణవ ఉద్యమం పట్ల ఆకర్షితులయ్యారు. ఇతని శిష్యుల్లో మాధవదేవ ప్రముఖుడు. శంకర దేవ, మాధవదేవలు స్థాపించిన మతం "మహాపురుషీయాలు" గా ప్రసిద్ధి చెందింది.

వైష్ణవ భక్తి బెంగాలు కూడా ఉంది. అయితే చైతన్యుని కాలంలో ఇంతో ప్రగతి సాధించలేదు. బెంగాల్లో చైతన్యోద్యమాన్ని ప్రఖ్యాతి చెందించిన ఘనత (8) ప్రేమానంద అతని శిష్యుడు రసికానందులకు దక్కుతుంది.

కర్ణాటకలో దా(9)సకవులు వైష్ణవ భక్తి ని ప్రోత్సహించారు. దాసకవుల్లో అగ్రగణ్యుడైన పురందర దాసు హరి నామస్మరణ గొప్పదన్ని చాటాడు. కనకదాసు మరో గొప్ప దాస కవి. ~~ఈ~~

దాసులు ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి కాలినడకన ప్రయాణం చేస్తూ, కీర్తనలు పాడుతూ ప్రజల్లో అంకితమైన భక్తి భావం నింపుకున్న జీవితం గడపమని బోధించేవారు.

[(10) విజయనగర పాలకులైన రాయలందరూ వైష్ణవ భక్తిని గొప్పగా ఆదరించారు.]

(11) భక్తి సూత్రం మీరాబాయి ని

విశిష్ట కవయిత్రిగా ప్రేమ చిహ్నంగా కృష్ణుని తో అనుబంధానికి మారుపేరుగా మిగిలారు. ఆమె తన "పదావళి" లో తనను కన్యగా చిత్రించుకున్నది, కృష్ణుని పై ఆమెకున్న అపారమైన భక్తి ఆమెను భౌతిక ప్రపంచం నుంచి పూర్తిగా వేరుపర్చినట్లు కనిపిస్తుంది. [ఆమె విగ్రహారాధనను, ప్రత్యేక ఉపవాసాలను ప్రబోధించింది.]

[(12) గౌడియ వైష్ణవం, (13) చైతన్య ఉద్యమం (నవ్య వైష్ణవ ఉద్యమం) చైతన్యుని బోధనల నుంచి ప్రేరణ పొందిన ఈ వైష్ణవ శాఖలు అస్సాం, బెంగాలు, ఒరిస్సా లలో నైతిక, మత సాంస్కృతిక ప్రజా ఉద్యమాన్ని చేపట్టాయి

సంస్కరణోద్యమాలు. మార్పులు.] సాంఘికంగా కులవ్యవస్థ కోరల్లో శూద్రులు,
అంటరానివారు నలిగి పడుతున్నారు. జయదేవుని గీతగోవిందం
అప్పుడు భాషలకి స్ఫూర్తి భక్తి శృంగారమయమైపోయింది.
ఇటువంటి సాంఘిక, మత సనాతనత్వం, నైతిక పతనాల మధ్య
చైతన్య ఉద్యమం ఉదయించి మంచి వైపుకు మళ్లించింది.
చైతన్యుడు సంఘసంస్కర్త కాకపోయినా కులవ్యవస్థని
ఖండించిన బ్రాహ్మణుడు. అందువల్ల ఆ బడుగువర్గాల
వారంతా చైతన్య ఉద్యమంలో చేరారు. అయితే
పండితులు దీని ఎలాంటిది [illegible] తీవ్రంగా విమర్శించారు.

IGNOU

# Chapter 20 AKBAR

## Abul Fazl, Thinker and Historian

షేక్ ముబారక్ నాగోరి రెండవ కొడుకు

అబుల్ ఫజుల్. గుర్రాలకి ముద్ర వేసే విధానానికి మొదలైన వజీరు గా ఎదిగాడు. తన తండ్రి ద్వారా ఉదార భావాల్ని అలవర్చుకున్నాడు.

అబుల్ తన అంకితసేవ, కాలానుగుణంగా ప్రవర్తించగల నేర్పు, మరియు చేయగల నేర్పు, అక్బరు మనఃస్థితిని అర్థం చేసుకోవడం, పొగడ్తల ద్వారా త్వరలోనే అక్బరుకి మంచి సన్నిహితుడయ్యాడు.

[ఇతడు అన్ని మతాలనూ వ్యతిరేకించి పలు విమర్శలకు గురయ్యాడు. సంస్కరణలకి నడుం కట్టాడు. అందువల్లన సనాతనులు అతన్ని మతభ్రష్టుడని, సత్యాన్ని వక్రీకరించేవాడని, నమ్మకస్థుల్ని మోసం చేసేవాడని వర్ణించారు. అతన్ని ఇస్లాం ను నమ్మనివాడిగా చిత్రించారు. కొందరతన్ని హిందువన్నారు. కొందరు ఇంకాస్త ముందుకెళ్ళి నాస్తికుడన్నారు. కొందరు మాత్రం అతడు అద్వైతాన్ని నమ్మిన సూఫీలకి చెందినవాడని వారి వలె ప్రవక్త చట్టాలకి ఉన్నతంగా ప్రవర్తించాడని అన్నారు.]

[అబుల్ అక్బరు పరమభక్తుడవటాన ఇతడొక బానిసనే వాదన సరికాదు. అబుల్‌ఫజుల్

పరిపాలనం సాగుతుంది. అక్బరు ఇతరమతాలపైన
ఆసక్తిగా కలవాడు. అబుల్ నిప్పు రాజేయుట
వలనే దాన్ని అగ్నిం పుష్టి నిరంతరం రగిలించాడని
చెప్పవచ్చు. అక్బరు ది అబుల్ లో అనుకూల
మనస్తత్వం, తన లాంటి భావాలే ~~అబుల్~~ అందుకన్న
స్థిరంగా ఉన్న భావాలు కన్పించాయి. అతడు అబుల్
లో చర్చలు జరపడం అన్ని మతాల చర్చలు ఆధారంగా
జరిపేవాడు. ఫలితంగా చక్రవర్తి, అబుల్
పరస్పరం ప్రభావితం చెందడం జరిగింది. వారిద్దరూ
అనేక సందేహాల దశలు దాటి ప్రగతి చెంది చివరకి
"దీన్-ఇ-ఇలాహీ" మతాన్ని ఏర్పరచాడు అక్బరు. ఈ
మతానికి ముందు అక్బరు నిలువగా అతని తర్వాత అబుల్
ఉన్నాడు. హిజ్రా తర్వాత వేయి సంవత్సరాల కి
మతసంస్కర్త వస్తాడన్న సంప్రదాయాన్ని నమ్మి అది
అక్బరే అన్నాడు అబుల్ ఫజల్.

[అబుల్ రాసిన "అక్బరునామా"
అక్బరు వాల చరిత్ర కు ప్రముఖ ఆధారం. ఇది 3
సంపుటాలు.

1) అక్బరు పూర్వీకులు బాబరు, హుమాయూన్ ల
సమా మొదటి సంపుటం వివరిస్తుంది.
Adam నుంచి అక్బరు పాలన 17 వ సం॥ వరకు

2) అక్బరు 46 వ సం॥ వరకు పాలనా కాలం గురించి విస్తృతంగా వివరాలిస్తుంది.

3) మూడవ సంపుటము : "ఆయిన్ అక్బరీ" అని పేరు.

ఆచరణాత్మకంగా ఇది ప్రత్యేక గ్రంధమనే చెప్పవచ్చు. ఇది మొదటి రెండింటితో పాటే సమకాలీనంగానే రాశాడు. (1595 A.D. ప్రాంతంలో ముగించాడు)

'ఆయిన్-అక్బరీ' లో 'మొగలు సామ్రాజ్యాన్ని (16 వ శతాబ్దం లోని) అనేక కోణాల నుంచి చూపాడు – ప్రభుత్వ అనేక శాఖలు, సామ్రాజ్య భౌతిక - మానవ వనరులు, రెవెన్యూ వ్యవస్థ మొ॥వి. ఇందులోని విషయాలు ఒక ప్రాంతీయ రెవెన్యూ నుంచి అరటి పండు వెల దాకా – సైన్య వ్యవస్థీకరణ నుంచి ప్రముఖుల చరిత్రలు - విధుల నుంచి రివ్వాల్తి కడ్డ ఆకారం దాకా అన్నీ కనిపిస్తాయి. వీటి వాస్తవికతను, విలక్షణ చారిత్రక విలువను ఎవరూ కాదనలేరు.

"ఇటీవలి కాలం వరకూ యూరోపు నందు గూడా ఇటువంటి ప్రామాణికమైన రచన ను చూడడం కష్టం"

అని 'ఆయిన్ అక్బరీ' ను వి.ఎ.స్మిత్ పొగిడాడు. అతనే ఇంకా

"అబుల్ ఫజల్ తన విస్తారమైన రచనలో చూపిన పరిశ్రమ, నైపుణ్యాలకు – గాను అర్హుడు

తరాల వారి ప్రశంస కు పాత్రుడౌతాడు"

అని కూడా చెప్పాడు. అయిన్ అక్బరీ లో అబుల్ ఫజల్ జీవిత చరిత్ర, అక్బరు ఉల్లాస వాక్యాలు ఉన్నాయి.

అబుల్ ఫజల్ చరిత్ర పరిధిని విస్తృతంగా చూశాడు. చరిత్ర ని కాల క్రమాగత దృష్ట్యా చూసి రాజకీయ, సైనిక, ఆర్థిక, సాంస్కృతిక పరిస్థితుల గురించి వివరించాడు. అయిన్ అక్బరీ కేవలం వర్ణనలు, గణాంకాలే కాదు; పాలనా వ్యవస్థ, మొగలుల రాజ్య విధానం దీని ద్వారా తెలుస్తాయి. దీని ద్వారా మొగలు ఉద్యోగిస్వామ్యం, మొగలు సామ్రాజ్య ఉన్నతం, అక్బరు తన భూభాగాన్ని మధ్యయుగ జాతి రాజ్యం గా మార్చడానికి తోడ్పడిన కీలక వర్గం పునాదిలో పాత్రని తెలుసుకోవచ్చు.

చరిత్ర రచనలో ఇతడు ఉన్నత భావాలు చూపాడు. హేతుబద్ధమైన, తార్కిక దృక్పథాన్ని చూపాడు. సమకాలిక లేఖకులు చరిత్రని పునర్నిర్మిస్తూ మత మౌఢ్యాలకి ప్రాతిపదికగా, సంప్రదాయ-మూఢనమ్మకాలకి, అనవసర ఊహాలకి బదులు హేతువుని ఆశ్రయించాడు. అతనికి భారత చరిత్ర హిందూ-ముస్లిం మధ్య ఘర్షణ కాదు, అది జాతీయులకి ప్రాంతీయులకి; లౌకికవాదులకి - మతవాదులకి స్థిరత్వానికి - పతనానికి మధ్య ఘర్షణ గా భావించాడు. ఈ కోణం నుంచి చూస్తే అబుల్ ఫజల్ సమకాలీన చరిత్రకారులలో తిరుగులేనివాడి గా కనిపిస్తాడు.

కొంతమంది ఆయిన్ లని విస్తృతమైన పేలవంగా ఉండే వివరాలు, వర్ణనలు వాస్తవాలుగా గాక అలంకారయుక్త వర్ణనతో ఉంటాయి. మరికొందరు ఆయిన్ లని రెండూ సంస్కృతి విషయాలన్ని అక్బరునామా గ్రంథం లాంటి సంగ్రహించి కాల్పనికకల్పనలకి పాల్పడ్డారు. ఏదేమయినా ఆయిన్ అబుల్ ఫజుల్ సమకాలీన మొగలు సామ్రాజ్యాన్ని నిశితంగా పరిశీలించాడని తెల్పుతుంది.

అక్బరునామాలో అక్బరు పూర్వీకులతో పాటు అక్బరు సింహాసనానికి వచ్చిన నాటి నుంచి క్రీ.శ. 1602 వరకూ అంటే అబుల్ ఫజుల్ ను రాకుమారుడు సలీం (తర్వాత జహాంగీరు) ప్రోద్బలంతో హత్య చేసేవరకూ వివరాలు రాయబడ్డాయి. ఇది సంపూర్ణంగా, కాలక్రమ రీత్యా కచ్చితంగా ఉండడమే గాక ఇది ఉదార భావాలు గల ప్రతిభావంతుని పాలనాన్ని తెల్పుతుంది.

ఒక చరిత్రకారుని గా అబుల్ ఫజుల్ ప్రామాణికత పై పండితుల్లో భిన్నాభిప్రాయాలున్నాయి. అబుల్ ఫజుల్ పై బాకాలు ఊదడం, వాస్తవాల్ని అణచడం, నిజాయితీ లేకపోవడం వంటి ఆరోపణలు చేశారు. కొందరైతే ఇతన్ని సల్లీ (sully) క్లారెండాన (Clarendon) వంటి వారితో పోల్చదగిన కాని రాదన్నారు, వారిద్దరూ తమ సమకాలీన చరిత్రను

# Chapter : 20 Akbar

## Mansab System

మొగలు సామ్రాజ్యానికి వెన్నెముక లాంటి సైనిక వ్యవస్థను విలక్షణ పద్ధతిలో శాస్త్రీయంగా వ్యవస్థీకరించిన విధానమే "మనసబదారీ విధానము".

కారణాలు — అక్బరు కాలం లో ఖుల్లో మొగలు, ఉజ్బెగ్ అధికారుల నుంచి అనేక తిరుగుబాట్లు ఎదుర్కొవలసి వచ్చింది. తన అధికారాన్ని స్థాపించాలంటే మార్గదర్శకత్వం (నిర్దేశకత్వం) (direction) నియంత్రణలను పూర్తిగా వశగతం చేసుకోవడం, సైనికాధికారులను లొంగదీసుకోవడం, అవిధేయులని నిర్మూలించే విధంగా మరియు శక్తివంతమైన క్రమశిక్షణాయుతమైన బలగం లా తీర్చిదిద్దే విధంగా సైన్యాన్ని పునర్వ్యవస్థీకరించడం అవసరమని అక్బరు గ్రహించాడు. దీని కోసం అతడు తీసుకున్న చర్య ఫలితమే "మనసబదారీ విధానం".

పరిణామం — మన్సబులుగా సంఖ్యాపరమైన విభజన కి చెంఘిజ్ ఖాన్ ను మూలం గా చెబుతారు. ఇతని సైన్యం లో 10 నుంచి 10,000 ల మధ్య విభాగాలుండేవి. ఈ మంగోలు విధాన ప్రభావంతో సుల్తానత్ కాలం లో యుజ్ బషి (100) హజారా (1000) హోదాలుండేవి. అయితే ఇవి సిద్ధాంతీకరణం చెయ్యబడలేదు. వీరిలో అందర్నీ టుమన్ (10,000) అనేవారు. కాని ఇది కేవలం అత్యున్నత హోదాని సూచించేందుకు వాడేవారు.

శిబిరాల్లో వారి నియంత్రణలో ఉండేవి పెద్ద పెద్ద దళాలు మాత్రమే ఉండేవి. లోడీల కింద, సూర వంశీయుల కింద 20,000 ; 10,000 ; 5,000 హోదాలుండేవి. ఇక్కడ కూడా మనకు వీరి వాస్తవ నియంత్రణలో ఉన్న సైనికుల సంఖ్య తెలీదు. ఏది ఏమైనా ప్రభుత్వ సర్వీసు ను 10 నుంచి 5,000 వరకు నిర్దిష్టంగా "అధికారక్రమంగా" (hierarchy) అధికారక్రమ స్థాయిలుగా వ్యవస్థీకరించిన ఘనత మాత్రం అక్బరుకే దక్కుతుంది.

అర్థం

"మన్సబ్" అనే పదాన్ని 'మన్సిబ' అనే అరబిక్ పదం నుంచి తీసుకున్నారు. దీని అర్థం ఒక పదవి, ఒక కార్యాలయం, హోదా, స్థాయి. అందువల్ల "మన్సబ్దారు" అంటే ఒక హోదాని కలిగిన వాడు, ఒక అధికారి. ఈ మన్సబ్దార్లని అధికారక్రమంలో ఉంచి సామ్రాజ్య సైనిక మరియు పౌర సర్వీసు ను ఏర్పరిచే "మన్సబ్దారీ విధానం / వ్యవస్థ" అయ్యింది.

నిర్మాణం

అక్బరు మన్సబ్దారీ విధానాన్ని దాదాపు క్రీ.శ. 1577 లో ప్రవేశపెట్టినట్లు తెలుస్తుంది. అబుల్ ఫజల్ ప్రకారం 66 స్థాయిలలో 10 నుంచి 10,000 మంది దాకా సైనికుల నియంత్రణలో మన్సబ్దార్లు ఏర్పాటయ్యారు/చేయబడ్డారు. అయితే అతడు 33 స్థాయిలనే పేర్కొన్నాడు.

'మన్సబ్' అనేది 3 విషయాల్ని తెల్పుతుంది.

అవి

1) మన్సబ్దారు కు అధికార క్రమానుగత శ్రేణి లో ఉండే స్థానాన్ని నిర్ణయిస్తుంది.

2) మన్సబ్దారు జీతాల్ని నిర్ణయిస్తుంది.

3) గుర్రాలు, పరికరాలు మొ॥ వి నిర్దిష్ట సంఖ్యలో నిర్వహించాల్సిన బాధ్యతని మన్సబ్దారు కు కల్పిస్తుంది.

అక్బర్ పాలనాంతానికి అత్యున్నత స్థాయి 12,000 లకు పెరిగింది. మొదట్లో 5000, దాని పై స్థాయిల్ని రాజు రక్తసంబంధీకులకే పరిమితమయ్యాయి. తర్వాత మిర్జా [illegible], అజీజ్ కోకా, మాన్‌సింగ్ లు 7,000 స్థాయి పొందారు.

మన్సబ్దార్ల కు జీతాల్ని ధనరూపంలో నిర్ణయించినా వారికి 'జాగీర్లు' ఇచ్చేవారు. వాని నుంచి అంచనా ఆదాయం (జమ), వాస్తవ ఆదాయం (హాసిల్) లలో హాసిల్ తక్కువగా ఉండటం చేత మన్సబ్దార్లు నిర్వహించాల్సిన సైనికుల సంఖ్య కి తక్కువగా ఉన్న వారి సంఖ్య తక్కువ గా ఉండేది. ఈ స్థితి ని తొలగించటానికి అక్బరు "దాగ్ విధానాన్ని" ప్రవేశపెట్టాడు. దీని ద్వారా మన్సబ్దార్ యొక్క (పూర్తి సైనికుల) గుర్తింపు వివరాలను గుర్రాల సంఖ్య, నాణ్యత ని పరియోదికాల గా తనిఖీ చేసేవారు. గుర్రం కుడి తొడ మీద (ప్ర)భుత్వ దాగ్ ఎడమతొడ మీద మన్సబ్దార్ దాగ్ వేయబడేవి. ఈ తనిఖీ పదాది

ఓ పకసారి లేదా మూడేళ్ళకొకసారి చేసేవారు. నిర్ణయించిన సంఖ్య చూపలేనివారిని శిక్షించేవారు. పదాతిదళం కూడా దీని ద్వారానే నిర్ణయించేవారు.

ఈ సంస్కరణలు తీసుకున్న పూర్తి ఫలితం సాధించలేకపోయాడు. దాంతో అక్బరు తన 40 వ పాలనా సంవత్సరం క్రీ.శ. 1595-96 లో రెండు శ్రేణుల విధానాన్ని ప్రవేశపెట్టాడు, అవే జాట్, సవర్లు.

జాట్, సవర్ ల అర్థాలపై చరిత్రకారుల్లో భిన్నాభిప్రాయాలున్నాయి. అయితే అధికమంది ఆమోదం కింది విధంగా ఉంది.

జాట్: ఇది మన్సబ్దారు వ్యక్తిగత హోదాన్ని (తలాంబ-ఖిస్సు) మరియు వ్యవస్థ లో అతని హోదాని తెల్పుతుంది.

సవర్: ఇది, గుర్రాల సంఖ్యని, గుర్రపు రౌతుల సంఖ్య ని (మన్సబ్దారు తప్పనిసరి గా నిర్వహించాల్సిన) మరియు దీన్ని బట్టే అతని దర్జా & అతనికి రావాల్సిన భత్యాన్ని (తబినన్) సూచిస్తుంది.

ఈ విధంగా రెండు శ్రేణుల్ని / రెండు శ్రేణుల్ని ప్రవేశపెట్టడం అన్నది ప్రతి మన్సబ్దారీ స్థాయి లో మూడు తరగతుల్ని సృష్టించబడటానికి కారణం అయ్యింది.

1595-96 లో మున్సబ్దార్లు 3 తరగతులు చేయబడ్డారు.

1) సవారులు (సవర్) జాట్ సంఖ్యకి సమంగా ఉండడం - మొదటి తరగతి.

2) జాట్ సంఖ్యకి సగం గాని సగం కంటే ఎక్కువ గా గాని సవార్లు కలిగి ఉండడం — రెండవ తరగతి.

3) జాట్ సంఖ్యలో సగానికి తక్కువగా సవార్ల సంఖ్య ఉంటే — మూడవ తరగతి.

జాట్ వ్యక్తిగత హోదాకి సంబంధించింది, దీనికి సవర్ తో సంబంధం లేదు. ఉదాహరణకు 3000 జాట్ 3000 సవర్ ఉన్న మున్సబ్దారు కన్నా 4000 జాట్ 2000 సవర్ ఉన్న మున్సబ్దారు ఉన్నత హోదా కలిగి ఉంటాడు.

పైగా జాట్ మున్సబ్దారు నిర్వహించాల్సిన గుర్రాలు, ఏనుగులు, బరువులు మోసే జంతువులు, ఎడ్ల సంఖ్యని కూడా సూచిస్తుంది. ఉదాహరణకు 5000 మున్సబ్దారు 340 గుర్రాలు, 100 ఏనుగులు, 140 ఒంటెలు, 100 గాడిదలు, 160 ఎడ్లు నిర్వహించాలి. ~~అయితే~~ 400 లోపు తక్కువ స్థాయి మున్సబ్దార్లు దీనుండి మినహాయించబడ్డారు.

మున్సబ్దారీ విధానం హోదాను, జీతాన్ని (సామ్రాజ్యాధికారుల) నిర్ణయించడానికి అనువైన విధానం. ~~అయితే~~ ఉన్నత హోదాల మున్సబ్దారును సర్వీసుల్లో ఉన్నతపదవి లో నియమించనవసరం లేదు. ఉదాహరణకు 7000 సైనికుల రాజా మాన్‌సింగ్

This is wrong

మన్సబ్‌దారీ వ్యవస్థ పర్షియన్లనుంచి వారికి కేటాయించిన జాగీర్లలో భూమిశిస్తు మదింపు, పనులు రెవెన్యూ శాఖ వారి అధికారులు చేసేవారు కాని మన్సబ్‌దార్లు ఏజెంట్లు కాదు. పైగా ఈ ప్రాంతాల్లో కేంద్ర ప్రభుత్వం నిర్ణయించిన భూమిశిస్తు ను మించి ఎక్కువ పన్నులు చెల్లించడానికి వీలులేదు.

కొంతమంది మన్సబ్‌దార్లు తాము నియమించిన దళాలు గాక కేంద్రం నియమించిన దళాలను (కేంద్రమే ప్రత్యక్షంగా) అనగా "దఖిలి" (సహాయక సైన్యం) ని నిర్వహించేవారు. ఇంకొందరు మన్సబ్‌దార్లు "అహాదీలు" (gentlemen troopers) అనే వ్యక్తిగతంగా నియమింపబడిన సైనికుల దళాలకు నాయకత్వం వహించేవారు.

సాధారణంగా సవర్ జాట్ సంఖ్యకు తక్కువగానో లేదా సమానంగానో ఉంటుంది గాని జాట్‌కి మించి ఉండదు. అయితే ఈ నియమానికి మినహాయింపు కూడా చాలా అరుదుగా జరిగేది. క్లిష్ట పరిస్థితుల్లో సమయానుకూలంగా ప్రాథమిక మన్సబ్ నిర్ణయానికి భంగం కలుగకుండా అదనంగా ఒక హోదా - "మష్రుత్" ఇచ్చేవారు. ఈ ప్రకారం జాట్ లో మార్పు లేకుండా సవర్ ను అదే ప్రభుత్వ ఉత్తర్వు మీద [illegible]

నియమింపబడిన వారికి (ఉండేది) ఇవ్వబడేది.

## మున్సబ్‌దార్ల నియామకం, పదోన్నతులు, బదిలీలు :

మున్సబ్‌దార్ల నియామకం, పదోన్నతులు, బదిలీలు, డిస్మిసలు చక్రవర్తి ఇష్టానుసారం గా ఉండేవి. ఒక మున్సబ్‌దారు ఉన్నత స్థాయి పొందడానికి అనేక దశలు దాటుతూ పోవాల్సిన అవసరం ఏమీ లేదు.

అభ్యర్థుల పేర్లని మీర్‌భక్షి చక్రవర్తికి సమర్పించగా అతడు వారిని ప్రత్యక్షంగా నియమిస్తాడు. అయితే ప్రావిన్సుల గవర్నర్లు, ప్రముఖుల సిఫారసులకి విలువ ఉండేది. దివాను, బక్షి, ఇతర అధికారుల చక్రం లా సాగిన విస్తృత పరిశీలన తర్వాత అది చక్రవర్తి ఆమోదం కోసం చేరేది. వకారు చక్రవర్తి ఆమోదం ముద్ర లా ఫర్మాను విడుదలయ్యేది. పదోన్నతుల విషయంలో కూడా ఇదే విధానం అమలయ్యేది.

మున్సబు ఇవ్వటం చక్రవర్తి గౌరవ ప్రాప్తి. అతడెవరికైనా మున్సబుగా నియమించవచ్చు. చైనాలో వలె రాతపరీక్షలేవీ లేవు. ఏ వ్యక్తి సాధారణ అర్హతలుండేవి. నాటి నియామకాల్ని చూస్తే వ్యక్తి సమర్థతలు అర్హత వాటన్నిటి ప్రాధాన్యత పొందినట్లు తెలుస్తుంది.

అంతకు ముందే సర్వీసుల్లో ఉన్నవారి కొడుకులు,
సంబంధీకులు ఎక్కువగా ఆదరింపబడేవారు — ఈ వర్గాన్ని
" ఖానాజాద " అనేవారు.

ఇతర రాజ్యాల్లో ఉన్నత పదవుల్లో ఉన్నవారికి కూడా
ప్రాధాన్యతనిచ్చేవారు. ఈ విధంగా ఉజ్బెక్, సఫావి రాజ్యం నుంచి
వచ్చేవారు. (దక్కన్ నుండి) వీరిలో ఇరానీ, తురానీ, ఇరాక్
మరియు ఖురాసాని మొ॥ వారుండేవారు.

సామంతరాజుల వర్గం మరొ ప్రాధాన్యత గల వర్గం.
దీని వల్ల బాగా లాభపడిన వారు రాజపుత్రులు.

పదోన్నతులు సాధారణంగా ప్రతిభ, చేసిన పని,
కాలం ని బట్టి ఇచ్చేవారు.

మన్సబ్దార్ల జీత భత్యాలు, చెల్లింపు:

మన్సబ్దార్లకు జీతాన్ని ధన రూపంలో
నిర్ణయించినా చాలా మందికి 'జాగీర్లు' నే ఇచ్చేవారు.
అయితే వీరి జాగీరులు పెద్ద కాలం ఉండకుండా తరచుగా
బదిలీలు చేసేవారు.

స్మిత్, మోర్లాండ్ వంటి చరిత్రకారులు
మన్సబ్దార్లకు సంవత్సరమంతా గాక 7 నుంచి 9 నెలల
జీతం మాత్రమే ఇచ్చేవారని భావించారు. అయితే సమకాలీన
రచనల వల్ల వారికి పూర్తి 12 నెలలు జీతం ఇచ్చేవారని
తెలుస్తుంది. అయితే ప్రభుత్వం జీతం నుంచి
అప్పుగా ఇచ్చిన ధనం, యుద్ధ పశువుల ఖర్చు

మన్సబ్దార్ల జీతాల్లోంచి మినహాయింపులు ఉండేది. దస్కేవల నుంచి ఆర్థిక మినహాయింపులు వసూలు చేసేవారు, వీరు జీతంలో నాలుగు వంతు ఇబ్రేయాలి-చౌదాయి. ఖురక్ దప్తో (జంతువుల దానా) ని చక్రవర్తి కి చెందిన జంతువుల కోసం వసూలు చేసేవారు. నగదు పొందే వారికి (ప్రతి) రూపాయిలో రెండు దామ్లు మినహాయించేవారు. అనేక జరిమానాలు వసూలు చేసేవారు. ఈ విధంగా మన్సబ్దార్ల జీతాన్ని కోతలు విధించి యుక్తం చేసేవారు. సామ్రాజ్యంలో వచ్చే మొత్తం ఆదాయంలో 80% కేవలం 1,571 మన్సబ్దార్లే అందించేవారు.

సవార్ జీతాన్ని ఆయా గుర్రాల సంఖ్య, నాణ్యత బట్టి నిర్ణయించేవారు.

రాజపుత్రులకి తక్కువ జీతాలుండటం రాజపుత్రేతర మన్సబ్దార్లు కూడా వారిని నియమించుకునేందుకు ప్రోత్సహించేది, అందుకే వివరంగా చెప్తుంది. మొగలు, రాజపుత్ర మన్సబ్దార్లు తమ జాతి సైనికుల్ని మాత్రమే నియమించుకునేందుకు అనుమతి ఇవ్వబడినా ఇతర మన్సబ్దార్లు మాత్రం మిశ్రమ దళాన్ని నిర్వహించాల్సి ఉండేది.

దహా-బిస్తి లేదా పది-ఇరవై విధానం ఆధారంగా అక్బరు కాలంలో సవార్ జీతం రూ.240/- అని మోర్లాండ్ అంచనా వేశాడు. మన్సబ్దారు సవార్ల అందరి జీతాల మొత్తంలో 5% ని తనవద్ద ఉంచుకోవచ్చు.

అందువల్ల మన్సబదారుల జీతం

'జాగీరు' అనగా జాట్ జీతాలకి, అలాగే సవరల అందరి జీతాల మొత్తానికి సమానమైన విలువ గలిగినది.

జాట్ శ్రేణి జీతాలు 'తరగతి' ని బట్టి నిర్ణయించబడేవి. వీటిని 'దామ్' లలో (రూపాయిల్లో కాదు) నిర్ణయించేవారు - ఈ విధానాన్ని రెండోది జామాదామి (Jamadami) అనేవారు.

ఒక 1000 శ్రేణి మన్సబదారు మొదటి తరగతిలో అయితే 8,200 p.m. మూడవ తరగతిలో అయితే 8,000 p.m. జీతం వచ్చేది. అంటే జాట్, సవర స్థాయిలలోనే అయినా ( ) ఒక మన్సబదారు పెద్ద దళాన్ని నిర్వహిస్తే అతని జాట్ జీతం ఎక్కువ వచ్చేది. జాగీర్ల నుండి శిస్తు వసూలు ఖర్చు మన్సబదార్లే భరించాలి. ఈ ఖర్చు, ప్రభుత్వం తీసుకొనే మినహాయింపులు ఇలా తగ్గించినను మన్సబదార్ల జీతం ఎంతో ఘనంగానే ఉండేది.

imp

## అక్బరు వారసులు చేసిన మార్పులు :

1) అక్బరు కాలంలో మున్సబదార్ల హోదా అనుమతించిన అత్యధిక స్థాయిగా 10,000 ఉండి ఆ తర్వాత అది 12,000 లకు మాత్రమే పెంచబడింది. అయితే జహాంగీర్, షాజహాన్, ఔరంగజేబుల కాలంలో అది 40,000 దాకా పెంచబడింది. అనంతర మొగలుల కాలంలో ఈ గరిష్ఠ పరిమితి 50,000 కి పెరిగింది.

2) అక్బరు కాలంలో ఒక సవారు వేతనానికి రూ.240/- జీతం ఉండగా జహాంగీరు దాన్ని రూ.200 గా మార్చివేశాడు.

3) అక్బరు కాలంలో "దాగ విధానం" చాలా కఠినంగా అమలు జరుపబడేది. కాని జహాంగీరు కాలం లో ఈ వ్యవస్థలో అవకతవకలు చోటుచేసుకున్నాయి.

4) అక్బరు మున్సబదార్లకి జీతంగా జాగీర్లను ఇవ్వడానికి అంతగా ఇష్టపడలేదు. ధన రూపంలో చెల్లింపులకే ఇష్టపడ్డాడు. అందువల్ల అతని కాలంలో ఎక్కువ మందికి ధనం చెల్లించేందుకు కృషి చేశాడు. కాని జహాంగీరు, ఆ తర్వాత వారి కాలంలో జాగీర్లు ఇవ్వడం సాధారణమైన, అనివార్యమైన విషయం అయింది. పైగా వీరు జాగీర్లు ఇవ్వడాన్ని ఇష్టపడ్డారు, ఎందుకంటే రెవెన్యూ వసూళ్ల బాధ్యత మున్సబదార్ల పైకి తోసివేయవచ్చు.

5) జహాంగీరు కాలంలో ఎంపిక చేసిన మన్సబదార్లు వారి జాట్ హోదాను పెంచకుండానే ఎక్కువ దళాన్ని నిర్వహించడానికి అనుమతి ఇవ్వబడింది. దీన్ని

"దు-అస్పా సిహ్ అస్పా పద్ధతి" అంటారు. దీని కింద మొత్తం సవర్ సంఖ్యని గాని లేదా రెండింటిలో గాని కొంతమందికి గాని ఈ విధానాన్ని వర్తింపచేస్తారు. ఉదాహరణకు 3000 జాట్ 3000 సవర్ ఉన్న మన్సబ్దారు కు 3000 సవర్ దు అస్పా సిహ్ అస్పా (రెండు లేదా మూడు గుర్రాలు) ఉన్నట్లయితే అతడు 6000 లేదా 9000 గుర్రాలు నిర్వహించాలి. అలాగా ఇతనికే 3000 సవర్ లో కేవలం 1000 కే దు అస్పా సిహ్ అస్పా ఉన్నట్లయితే అతడు 2000 లేదా 3000 అదనంగా అంటే మొత్తం

2000 + 2000 = 4000 లేదా 3000 + 2000 = 5000

(1000 × 2) + 2000     (1000 × 3) + 2000

గుర్రాలు నిర్వహించాల్సి ఉంటుంది. సాధారణంగా మొత్తం ఏ మన్సబ్దారు కూ అతని జాట్ స్థాయి మించిన సవర్ స్థాయి ఇచ్చేవారు కాదు.

6) షాజహాను కాలంలో దీన్ని మరో విధంగా మార్పు చేశాడు. అబ్దుల్ హమీద్ లాహోరి తన "బాదషానామా" లో షాజహాను కాలంలో ఒక మన్సబ్దారు తన జాగీరు ఉన్న ప్రాంతంలోనే నియమించబడితే తన సవర్ శ్రేణి లో $\frac{1}{3}$ వ వంతు మంది గుర్రాల్ని తనిఖీ చేయించాలి, బయట ప్రాంతంలో నియమించబడితే $\frac{1}{4}$ వ వంతు తనిఖీ చేయించాలి బాల్ఖ్ లేదా బదక్షాండ్ లలో నియమించబడితే

ఆ మన్సబుదారు $\frac{1}{5}$ వ వంతు మంది గుర్రాల్ని నిర్వహించాలి అని తెల్పాడు.

~~కేవలం మన్సబదార్ల సంఖ్య పెరుగుతూ ఉండడంతో మరోవైపు రాజ్య ఆర్థిక వనరులు అనేక కారణాల వల్ల తగ్గుతూ ఉండడంతో ఈ పై మార్పులు కూడా సరిపోలేదు. జాగీర్లని పెద్ద మొత్తంలో తగ్గిస్తే మన్సబదార్ల లో అసంతృప్తి కలుగుతుంది, ఇది ఏ చక్రవర్తి అంగీకరించరు. అందువల్ల మన్సబదారు లేదా సవార్ ర్యాంక్ ననుసరించి నిర్వహించాల్సిన దళాల సంఖ్యని మరో కొత్త పద్ధతిలో మరింత తగ్గించారు.~~

బ)

7) <u>మన్సబదార్ల జాగీర్ల నెలల లెక్క ప్రవేశపెట్టారు</u> –

10, 8, 6 (అవసరమైతే ఇంకా తక్కువగా కూడా) నెలలకి, అదే విధంగా ఈ జాగీర్ల ఆదాయంతో వారు నిర్వహించాల్సిన దళాల్ని కూడా తగ్గించడం జరిగింది. ~~ఉదాహరణకి~~ 3000 జాట్ 3000 సవార్ ఉన్న మన్సబుదారు పై $\frac{1}{3}$ వ వంతు సూత్రం ప్రకారం 1000 గుర్రాలతో సవార్లను నిర్వహించాలి, మరియు ~~అసలు~~ సూత్రం ప్రకారం 2200 గుర్రాల్ని నిర్వహించాలి. కానీ జాగీర్ 10 నెలల స్కేలు మీద ఉంటే కేవలం 1800 గుర్రాల్ని; అదే 5 నెలల స్కేలైతే కేవలం 1000 గుర్రాల్ని నిర్వహించాలి. సాధారణంగా 5 నెలలకి తగ్గి 10 నెలలకి మించి ఇవ్వడం జరిగేది కాదు.

ఔరంగజేబు కాలంలో ఎక్కువ మంది మరాఠాల్ని మన్సబుదార్లు గా చేర్చుకున్నప్పుడు వారికి సాధారణంగా 5 నెలలు లేదా అంతకన్నా తక్కువ జాగీర్లని ఇచ్చేవారు. ఈ

విధంగా అధికార ప్రమాణపత్రాలలో వారికి ఉన్నత స్థానం ఇచ్చినా వారి నియంత్రణలో ఉండే వాస్తవ గుర్రాల సవార్ల సంఖ్య మాత్రం వారి శ్రేణి సూచించిన దానికన్నా చాలా తక్కువగా ఉండేది.

సమర్థమైన అశ్వికదళ నిర్వహణకు విడిగాను లేదా లాయం గుర్రాలు సులభంగా దొరకడమన్నది చాలా అవసరం. అందువల్ల పాలకుల కాలంలో విడిగాను గుర్రాల సంఖ్యలో తీవ్రంగా తగ్గింపు వచ్చిందన్నది మొగలు అశ్వికదళ సామర్థ్యాన్ని దెబ్బతీసి ఉండవచ్చు.

ఈ పరిస్థితి రాను రాను మరింతగా దిగజారింది.

"మొగలు సైన్యం యొక్క వాస్తవ బలగం దాని మొత్తం అధికారుల నామమాత్ర బలగంలో కేవలం $\frac{1}{10}$ వ వంతు మాత్రమే"

— జదునాథ్ సర్కార్.

ఔరంగజేబు వారసుల కాలంలో ఈ జాట్, సవార్ శ్రేణులు కేవలం గౌరవార్థంగా మారిపోయాయి. 7000 మున్సబుదారు కనీసం 7 గుర్రాల్ని కూడా నిర్వహించాల్సిన అవసరం లేదు.

ఇది ప్రతిభ ని ఆదరించే విధానం అవుతుంది.

8) సంకర తెగల నాయకుల్ని లక్షణాలున్న మన్సబ్దార్లని పైవాళ్ళు ఎప్పటిలాగానే తమ తెగలు, మతాల ప్రాతిపదిక పై చేసుకోవచ్చు, అదే సమయంలో వారికి వారి అస్తిత్వానికి కేంద్ర ప్రభుత్వం పై ఆధారపడి ఉన్నామన్న విషయం (తెలియాలి) తెలియచెప్పి కేంద్రం లో విస్తారంగా అనుకూలంగా వ్యవహరించేట్లు చేస్తుంది.

9) మన్సబ్దారీ విధానం లో సామంతులు ఉండే పైవాళ్ళని కేంద్రం పూర్తిగా వినియోగించుకునేది. అయితే మొగలు చక్రవర్తి ఈ భూస్వాముల ఉద్భవం [illegible] పైన మాత్రమే ఆధారపడాల్సిన అవసరం లేదు, ఎందుకంటే మన్సబ్దారీ విధానం జాగీర్దారీ విధానానికి (కేంద్ర సామ్రాజ్య ప్రభుత్వ ప్రత్యక్ష పాలన ఉన్న ప్రాంతాలలో) సహకారం చెప్పింది.

10) ఈ విధానం కింద ఏ పదవీ వారసత్వం కాదు.

11) ప్రతి మన్సబ్దారు ప్రత్యక్షంగా చక్రవర్తి చేతనే నియమించబడేవాడు; అతని పదోన్నతి, [illegible], బదిలీలు మొదలైనవి చక్రవర్తి పట్ల చూపే విధేయత - ప్రతిభ - ప్రగతి ల మీద ఆధారపడి ఉంటాయి. ప్రతి మన్సబ్దారు వ్యక్తిగతంగా చక్రవర్తి కి బాధ్యులై వ్యవహరిస్తాడు. ఈ కారణంగానే మన్సబ్దారుల్లో చక్రవర్తి పట్ల అవిధేయత కలగడం, తిరుగుబాట్లు చేయడం వంటివి నిరోధించబడ్డాయి. ఇది నిజానికి మన్సబ్దారీ విధానం సాధించిన

గొప్ప విజయం.

12) అక్బరు వారసుల్లోనూ యోధులను, ఇతర సామ్రాజ్యాల పాలకులను సామ్రాజ్యంలో చేరమని ఆహ్వానించి దేశ రాజకీయ విస్తృతకు వారి సేవల్ని అందించమన్నాడు.

## మన్సబ్‌దారీ విధాన ప్రాముఖ్యత:

మన్సబ్‌దారీ విధానం మొత్తం మీద భారతీయ చేతనను శాశ్వతంగా ప్రభావితం చేసింది. దాని రెండు శతాబ్దాల అమలు కాలంలో కేంద్ర ప్రభుత్వ అధికారాల్ని ఆచరణలో పెట్టి, దాని ఆధిపత్యం మరింతో సామ్రాజ్య ఉద్యోగిస్వామ్యాన్ని మొత్తం దేశానికి ఆచరణాత్మకంగా అందుబాటు చేసింది. ఈ విధంగా భారతదేశ ఉద్యోగిస్వామ్య ఏర్పాటు చేసినందుకు అందుకే వలెనే మన్సబ్‌దారీ విధానం బ్రిటీష్ కాలంలో ఆంగ్లేయులు వారి ఉద్యోగిస్వామ్యాన్ని సులభంగా ఏర్పాటు చేసుకునేందుకు దోహదమైంది.

భవిష్యత్తులో ప్రత్యేకమైన మార్పులున్నాయి ఇందులో. ఇందులోని అధికారులు దాదాపుగా ప్రధానంగా విదేశీయులు. అబుల్ ఫజల్ ఇచ్చిన జాబితాని పరిశీలిస్తే 70% మంది అధికార స్థాయిలోని వారు విదేశీయులు. మిగిలిన 30% మందిలో సగం భారతీయ ముస్లింలు కాగా మిగిలిన వారు హిందువులు వీరి రాజపుత్రులు. ఈ విదేశీయుల్లో చాలా మెల్లగా మన దేశంలో స్థిరపడి మన సంస్కృతికి దోహదం చేశారు.

## మన్సబ్దార్ల లోని వివిధ వర్గాలు :

సిద్ధాంత రీత్యా మన్సబ్దారీ విధానం అందరికీ అర్హమైనది. అయితే ఆచరణలో మాత్రం వారసత్వం ముఖ్యపాత్ర వహించేది.

ఖానాజాదలకు అనగా మన్సబదారుల స్వీయవారసులకు ప్రథమ ప్రాధాన్యమున్నట్లు కన్పిస్తుంది. ఔరంగజేబు కాలంలో 1000 అంతకు పైన శ్రేణి గలిగిన మొత్తం 575 మన్సబ్దార్లలో ఖానాజాదలు దాదాపు 272 మంది, అంటే ఉజ్జాయింపుగా 47%.

ఖానాజాదలుగా చాలా మంది జమీందార్లు మన్సబ్దార్లుగా నియమించబడేవారు. క్రీ.శ. 1707 లో మొత్తం 575 మంది మన్సబ్దార్లలో 81 మంది జమీందార్లు ఉన్నారు.

మొగలులు పర్షియన్, చాగతాయ్, ఉజ్బెక్కులు, అలాగే దక్షిణీలను కూడా మన్సబదారీ కి ఆహ్వానించేవారు. కొన్ని జాతుల వారు బాగా స్థిరీకరించబడ్డారు. తురానీలు (మధ్యఆసియా), ఇరానీలు, ఆఫ్ఘన్లు, భారతీయ ముస్లింలు (షేక్జాదాలు), రాజపుత్రులు, మరాఠాలు మరియు దక్కనీలు.

చివరి రెండు జాతుల వారిని ఔరంగజేబు సైనిక కారణాల రీత్యా అధికంగా చేర్చుకునేవాడు.

* మనసబుదారీ పదవి వారసత్వమైనది కాదు. దీనికి ఎటువంటి పింఛను సదుపాయాలూ లేవు. అందువల్ల దీనికి ఇచ్చే జాగీర్లు కూడా వారసత్వంగా సంక్రమించవు. కేవలం వాటి ఆదాయాలు మాత్రమే జీతాలుగా మనసబుదార్లకు ఇచ్చేవారు.

* రాజపుత్రులు, మొగలులు తప్ప మిగిలిన వారంతా తప్పనిసరిగా మిశ్ర జాతుల పెళ్ళిళ్ళని నిర్వహించాడు. మిశ్రవివాహం జాతి, మత విభేదాల్ని అధిగమిస్తుందని అక్బరు భావించాడు. రాజపుత్రులు, మొగలులు పూర్తిగా తమ జాతులలోనే పెళ్ళి ఏర్పాటుచేయడానికి మొగ్గు చూపినా అక్బరు మాత్రం వారిని కూడా మిశ్ర వివాహాలకై ప్రోత్సహించాడు.

# The Jagir System

(Read Jagirdari crisis also)

[జాగీరు విధానం అనగా రాజ్యానికి రావాల్సిన అన్ని శిస్తులను వసూలు చేసే హక్కు ను ప్రదానించడం.] (Grant of jagir implied the right of collecting all the payments due to the state)

సిద్ధాంతపరంగా రాజ్యం లోని మొత్తం భూమిశిస్తు చక్రవర్తికే చెల్లుతుంది. అయితే ఈ వాస్తవాల్లో పాలక వర్గం లోని ప్రముఖులు, ఉద్యోగులు నిర్దిష్ట ప్రాంతాల ఆదాయం/ భూమిశిస్తు ను [illegible] బదులుగా ఈ ఆదాయాన్ని వారిలో పంచుకునేవారు. ఆదాయాన్నిచ్చే ఈ భూముల్ని 'జాగీర్లు' ని వాటి ఆదాయాన్ని పొందేవారిని 'జాగీరుదార్లు' ని వ్యవహరిస్తారు. రాజ్యానికి వారు అందించే సేవలకు ఇవి వారికి ప్రతిఫలంగా ఇవ్వబడుతున్నాయి.

మొదలు సామ్రాజ్య అధికారులంతా మన్సబదార్లు గా నియమితులై నిర్దిష్ట దళాల్ని పోషించాల్సి ఉండేది. ఈ అధికారులకు వారి హోదా, వారి దళాల్ని బట్టి ఇవ్వాల్సిన జీతాలు (తలాబ [?]) రాజ్య ఖజానా నుంచి ధన రూపంలో ఇవ్వవచ్చు.

అయితే మధ్యయుగ ప్రాంతాల- [illegible]

సమాజ నిర్మాణంలో జాగీరు వ్యవస్థ లేకుండా పాలేరుతనం
ఉండడం వల్ల అక్బరుకు జాగీరులివ్వడం కష్టం లేకపోయినా జాగీరువ్యవస్థని
తప్పించ లేకపోయాడు. ముస్లిం దార్లు కొన్ని కారణాల వల్ల
జాగీర్ల పై ఆధారపడే వారు. ధనరూపంలో ఇచ్చే జీతాలు సాధారణంగా
సమయానికి చేరవు, కొన్నిసార్లు చాలా ఆలస్యం చేయాల్సి
వస్తుంది. పైగా భూమిని నియంత్రించడం అనేది సింధియా
వాళ్ళలో ముడిపడిన అంశం. మొగలు చక్రవర్తులు ముస్లిం
ని వారికి భూమిలో ఉన్న ఆస్తుల సంబంధాన్ని కాదనలేరు.

స్థానిక ప్రజలు సామంతులు, భూస్వాములు
నాయకుల్లో ఉన్నపుడు (జమీందార్లు) పైగా ఈ జమీందార్లకి
సైన్యాలు తో దగ్గరి వర్గ, కుల సంబంధాలు ఉన్నపుడు వారి
వద్ద నుంచి భూమిశిస్తు వసూలు చేయడం చాలా కష్టంతో
కూడుకున్న పని. ప్రముఖులకి జాగీర్లను జీతాల కింద
ఇవ్వడం ద్వారా రాజ్యానికి రావాల్సిన భూమిశిస్తును వసూలు
చేయడంలో వారి సొంత లాభం మేళవింపబడి తప్పనిసరిగా
చేస్తారు. దీని ద్వారా స్థానిక తిరుగుబాట్ల సమస్య ఉన్న
రాజ్యం ప్రత్యక్షంగా అవిధేయ రైతులతో వ్యవహరించడంకన్నా
దీన్ని నిర్వహించటం కష్టం కాదు. భూమి పై నియంత్రణ
అన్నది సింధియా వాళ్ళని, చెల్లింపులు భద్రతని కలిగిస్తుంది.

"రాజసేవ దాని ఫలితమంతా జాగీరు లా
కలిగి ఉంది, జాగీరు లేని ఉద్యోగి అంటే
ఉద్యోగం లో లేకపోవడం లాంటిదే"

ప్రతి ఒక రాజు ప్రముఖుడిగా లేదా కోటలలో ప్రాధాన్య గమనించవచ్చు.

అందువలన రాజ్యం మన్సబ్దార్ల జీతాలకి సమానమైన ఆదాయాలిచ్చే భూమిని వారికి జాగీరుగా ఇచ్చేది. జాగీర్ నిర్వాహకులు ఇచ్చేవాళ్ళని సంపాదించేందుకు మొత్తం పన్నుల ద్వారా వచ్చే నగదు వార్షిక ఆదాయాన్ని అన్ని పాలనా విభాగాలకు చివరికి గ్రామాలలో సహా అంచనా వేసేవారు.

క్రీ.శ. 1646 లో మొత్తం మన్సబ్దార్లు అంటే జాగీర్దారులకి [illegible] గలవారు 8000 కంటే ఎక్కువ లేరు. అందులో రాకుమారులు, బేగ్‌లు, ఘనులు కొద్దిమంది. ఇతర సంస్థానాలు మరాఠి, ఇరాని, ఆఫ్ఘన్ వంటి వలసదార్లు. కొద్దిసంఖ్యలో స్థానిక హిందువులు, ఇతర కులాలు ఉండేవి. మన్సబ్ వారసత్వం కాదు అయితే అది సాధారణంగా మంచి హోదాగల మన్సబ్దార్ల కొడుకులు, సంబంధీకులకి ఇవ్వబడేది. దీంతో తరతరాల పాటు మన్సబ్ లూ జాగీర్లలో నివసించే "ఖాంజాదాలు" అనే వర్గం ఏర్పడింది.

మన్సబ్దార్లు వ్యక్తిగతంగా చక్రవర్తి మీద ఆధారపడి ఉండేవారు. అనేక చర్యల ద్వారా వారిమీద చక్రవర్తి నియంత్రణ బలపర్చబడింది. "జాగీరు" స్థిరం [illegible] మైంది. అంతేకాక జాగీరు కింద ఇవ్వబడేది భూమి కాదు, కేవలం ఆ ప్రాంత ఆదాయం మాత్రమే. మన్సబ్దారు ఆ అదే జాగీరు/భూమి జాగీరుగా ప్రతి సంవత్సరం కావాలని లేదు. ఇది కావాలని చేసిన జాగ్రత్త చర్య. దీని ద్వారా మన్సబ్దారుకు స్థానికంగా బలం ఏర్పడటం జరగదు.

అయితే తరచూ బదిలీలు చేయడం జాగీర్దార్ల లో అభద్రత వ్యవస్థ లో అస్థిరత కి దారి తీసి చివరికి రైతుల అణిచివేతకి కారణమైంది.

తీసుకునేది.

ఒక జాగీర్దారు తన ఏజెంట్ల మీద నిఘా ఉంచాల్సి ఉండేది, ఎందుకంటే వారు చేసే తప్పులకి అతనే బాధ్యత వహించాల్సి ఉండేది. ఇదేగాక వారి లావాదేవీలవల్ల ఆదాయం తగ్గే ప్రమాదం కూడా ఉంది. ఎందుకంటే వారి మొత్తం జీతానికి సమానంగా జాగీరు ఆదాయం మొత్తం ఉండేది, కాని అందులో $\frac{1}{10}$ వ వంతు పాలనా నిర్వహణకే ఖర్చయ్యేది.

జాగీరు ఇచ్చేటప్పుడు దాని మొత్తం అంచనా వేసిన ఆదాయాన్ని బట్టి ఇచ్చేవారు, ప్రకృతి వైపరీత్యాల వల్ల కలిగే నష్టాన్ని లేదా పంట దిగుబడి లో తగ్గుదలని పరిగణించే వారు కాదు. వాస్తవ ఆదాయంతో సంబంధం లేకుండా జాగీర్దారు ను తన జీతానికి సరిగా మినహా చేసుకోనిచ్చేవారు కాదు. జబ్తీ విధానంలో దశాంశ సగటు మీద పంట నిర్ణయించినా మొత్తం పంట నష్టపోయినప్పుడు, రైతు పన్ను చెల్లించనక్కరలేదు. పాక్షిక పంట నష్టం అయితే రైతుకు తగిన [illegible] సౌకర్యాలు ఇవ్వబడేది. అందువల్ల పంట ఉత్పత్తిలో ఏ తగ్గుదల జరిగినా జాగీర్దారు తీవ్రంగా నష్టపోయేవాడు.

కేంద్ర ప్రభుత్వం పాలనలో ఏ లోపాలు కనిపించినా ఆ జాగీరు వెంటనే రద్దు చేసేది. అందుకోసం పాలన లోని వివరాలని క్రమమైన వార్తాహరులు, గూఢచారులు నివేదికల ద్వారా ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ ఉండేది. పాలనా వైఫల్యం కారణంగా జాగీర్లని ప్రభుత్వం తీసుకున్న సందర్భాలు ఎన్నో ఉన్నాయి. సాధారణ రెవెన్యూ రికార్డులు, రిజిస్టర్లు

జాగీరు విధానంలోని లోపాలు :

1) ప్రభుత్వం అనుసరించిన విధానాల ద్వారా భూమిశిస్తు వసూలు ఆ జాగీర్దార్లు పాల్పడటం వలన జమిందార్లు, నాయకుల లా రైతులు తిరుగుబాట్లు చేయడానికి, ఇష్టం వచ్చినట్లు ఏకంగా స్వతంత్ర స్థానిక రాజ్యాల ఏర్పాటు చేయడానికి ప్రయత్నాలు జరిగాయి.

2) పాలనా స్థాయిలో ఇది రాజ ప్రముఖుల మధ్య అసంతృప్తి పెరగడానికి, ముఠాతత్వం ప్రబలడానికి కారణమై "జాగీర్దారీ వ్యవస్థ సంక్షోభం" రావడానికి దారి తీసింది.

3) కాగితం మీద చూపించిన ఆదాయం జాగీరు ద్వారా జాగీర్దార్లు రాబట్టలేకపోయారు. ఫలితంగా వారు వారికి నిర్దేశించిన కోటా లో సైన్యం నిర్వహించలేకపోయేవారు.

4) జాగీర్లు చాలకపోవడం మరో సమస్య. గోల్కొండ, బీజాపూర్ ఆక్రమించినప్పుడు ఉత్తమ, సులభంగా నిర్వహించదగిన భూభాగాల్ని "ఖలీసా" భూములుగా చేశారు. రాజకీయ కారణాల వల్ల పలుకుబడి దక్కని, మరాఠా ప్రముఖులకు మన్సబులు, జాగీర్లు ఇవ్వాల్సి వచ్చింది. దాంతో పాత జాగీర్దార్ల / మన్సబ్దార్ల జీతాలు, జీవనం & జాగీర్ల తీవ్ర కొరత పడ్డాయి.

5) జాగీర్దార్లుగా ఉన్నవారు కేంద్రం ముఖ్యంగా చిన్న జాగీర్దార్లు గుమాస్తాలు, అధికారుల లంచం డిమాండ్ల ఒత్తిడి లో నలిగి పోయేవారు. అధికారులకి లంచాలు ఇవ్వక పోతే వారిని పేద ప్రాంతాలకి బదిలీ చేసేవారు.

జాగీర్దారీ వ్యవస్థ సంక్షోభం ~~~~ ప్రముఖులు (mobility) లేదా మన్సబ్దార్ల ను తీవ్ర ఒత్తిడి కి గురిచేసింది. పాకశాను కాగితం మీద ఉన్న జాగీరు ఆదాయాలకి, వాస్తవంగా వస్తున్న దానికి మధ్య ఖాళీని పూరించేందుకు జాగీరు ఒక మన్సబ్దారు నిర్వహించాల్సిన గుర్రాల, సవర్ల సంఖ్యను తగ్గించారు. అయినప్పటికీ జాగీర్ల కొరత సమస్య అనన్తరం ఔరంగజేబు పాలనా కాలం లో మరింత జటిలం అయ్యింది.

— o — o — o — o — o — o —

అక్బరు కాలంలో మొత్తం భూభాగాన్ని స్థూలంగా 'ఖలిసా', 'జాగీరు' గా విభజించేవారు. ఖలీసా ఆదాయం ప్రత్యక్షంగా సామ్రాజ్య ఖజానాకి చేరేది. జాగీరులను జాగీర్దార్ల కి వారి హోదాని బట్టి ఇచ్చే జీతాల కి ధనరూపం కి (నక్ద్) బదులుగా జాగీరు నిచ్చేవారు. కొంతమంది మన్సబ్దార్ల కి ధనరూప జీతం అందేది, వారిని 'నక్ది' లనేవారు. కొంతమంది కి ధనం, జాగీరు రెండూ కూడా ఇచ్చేవారు. వారి హోదాని బట్టి వారికి భూమిని కేటాయించేవారు. అంచనా వేసిన ఆదాయాన్ని 'జమ' అని దామ్ (వెండి రూపాయి లో $\frac{1}{40}$ వ వంతు విలువ గల చిన్న రాగి నాణెం) లలో లెక్కించేవారు గాన 'జమదామి' అని పిలిచేవారు. జమ లో భూమిశిస్తు, రోడ్ల రవాణాశిస్తు, రేవు సుంకాలు మరియు ఇతర పన్నులు (సైర్ జిహాత్) ఉండేవి. రెవెన్యూ అధికారులు వాడిన మరో పదం 'హాసిల'

అంటే ఖజానా వసూలైన మొత్తం. "పైబడి" భూములన్నా
మన్సబుదార్లకి కేటాయించవలసి ఉన్న ప్రాంతాలు.
(ఆదాయం మాత్రమే)

అక్బరు కాలంలో 31వ పాలనా వత్సరంలో
ఢిల్లీ, ఆగ్రా, అలహాబాదుల ఖాలిసా ప్రాంతాల జమ
మొత్తం రాష్ట్ర ఆదాయాలలో 5% ఉండేది. జహంగీరు కాలంలో
$\frac{9}{10}$ వంతుల భూభాగం జాగీరు కింద $\frac{1}{10}$ వ వంతు ఖాలిసాగా
ఉండేది. జాగీరు - ఖాలిసా నిష్పత్తి మారుతూ ఉండేది.
షాజహాను కాలంలో ఖాలిసా మొదట్లో $\frac{1}{11}$ వ వంతు ఉండి
తరువాత పాలనాంతంలో $\frac{1}{7}$ వ వంతు అయ్యింది. ఔరంగజేబు
కాలంలో ఖాలిసా నుంచి వచ్చే జమ మొత్తం లో
$\frac{1}{5}$ వ వంతు అయ్యింది. అయితే ఆయన కాలంలో
మన్సబుదార్ల సంఖ్య పెరగడంతో జాగీరు అవసరాలు పెరిగి ఖాలిసా
మీద ఒత్తిడి అధికమయ్యింది.

[జాగీర్దార్లని ఆయా జాగీర్ల నుంచి
తరచూ బదిలీలు చేయడం వలన అది వారికి దీర్ఘకాలిక
అభివృద్ధి చర్యలు చేపట్టడానికి, ఆ ప్రాంతాల వృద్ధి గురించి
ఆలోచించడానికి అవకాశమిచ్చేది కాదు. దాంతో తామున్న
తక్కువ కాలంలో ఎంత ఎక్కువ దండుకోవచ్చు అనే ఆలోచనే
వారికి మిగిలాయి.]

## జాగీర్ల లో రకాలు:

1) జీతాలకు బదులుగా ఇచ్చేవి — జాగీర తంఖా

2) అధిక షరతుల మీద ఇవ్వబడే జాగీర్లు — మష్రుత్ జాగీర్లు

3) ప్రభుత్వ సేవ, వాటిదార్లతో సంబంధం లేకుండా స్వతంత్రంగా (బహుమతులుగా) ఇవ్వబడేవి — ఇనాము జాగీర్లు

4) జమిందార్లకు వారి సొంత ప్రాంతాలనే ఇవ్వబడే జాగీర్లు — వతన్ జాగీర్లు.

జహాంగీరు కాలంలో అందరు ముస్లిం ప్రముఖులకు వతన్ జాగీర్ల వంటివి ఇచ్చారు, వీటిని — ఆల్ తంఘా అంటారు.

తంఖా జాగీర్లు మూడు-నాలుగేళ్లకొకసారి బదిలీ అయ్యేవి. వతన్ జాగీర్లు మాత్రం వారసత్వమైనవి, బదిలీ చేయరానివి. అధిక సార్లు వతన్ జాగీర్లను అంతకాలం పాటు ఖలిసాగా మార్చేవారు, ఉదాహరణకు ఔరంగజేబు 1679 లో జోధ్‌పూర్ విషయంలో చేసిన తీరు. ఒక జమిందారు లేదా గిరిజన తెగ నాయకుడిని మన్సబుదారు చేసినప్పుడు అతని జీతం అతని వతన్ జాగీరు ఆదాయం కంటే ఎక్కువగా ఉంటే అతనికి వేరే ప్రాంతంలో జాగీర తంఖా కూడా ఇచ్చేవారు. మర్వార్ లో వతన్ జాగీరు గల మహారాజా జస్వంత్ సింగ్ కు హిస్సార్ లో జాగీర తంఖా ఉండేది.

## జాగీరుల నిర్వహణ:

జాగీర్దారులు ప్రభుత్వం అనుమతించిన ఆదాయాన్ని

# Jagir System short



Intro → Meaning of Jagir

- మన్సబుదార్ల జీతానికి సరిపడా__ ఆదాయం అంచనా గ్రామం లో సహా...
- జాగీరంటే ఇవ్వబడేది ఆదాయం మాత్రమే భూమి కాదు...
  జాగీరు లౌకికమైంది
- జాగీరు లో తరచూ మార్పులు
- కేంద్రం విధించిన పరిమితి కి లోబడి.. అమీన్ ను పర్యవేక్షకుడిగా
- జాగీరు న్యాయ & పోలీసు అధికారాలు
- వర్తమానంలో జాగీర్దారు అధికారాలు విస్తారంగా..
- జాగీర్దారు విధులు
- రైతు రక్షణ కి చర్యలు
- పాలనా లోపాలు : జాగీరు రద్దు
- జాగీర్ల రకాలు
- జాగీర్ల కొరత → సంక్షోభం.
-

| | Topic పల్లవి. [illegible] | Page no |
|---|---|---|
| S | The Khalji Revolution | 1 |
| | Culture during Mughal Empire | |
| | Persian Lit | 5 |
| | Conditions of Peasants | 13 |

Chapter - 15    13th Century    

## The Khalji Revolution

ఖిల్జీలు తురుష్కుల్లోని 64 శాఖలలో ఒక శాఖ. అయితే వీరు క్రీ.శ. 4 వ శతాబ్దంలో ఆఫ్ఘనిస్తాను ప్రాంతానికి వలస వెళ్లి ఉండటం చేత ఆఫ్ఘన్ల సాంఘిక-సాంస్కృతిక అలవాట్లు కొన్ని అలవడ్డాయి. అందువల్ల భారత దేశంలోని తురుష్కులు వీరిని ఆఫ్ఘన్లని పొరపాటుపడ్డారు.

ఖిల్జీలు మహమ్మద్ ఘోరీ సైన్యంలో భారీగా చేరి భారత ఆక్రమణలో తోడ్పడ్డారు. వారి సేవల్ని గుర్తించి బెంగాలు గవర్నరుగా భక్తియార్ ఖిల్జీని ఘోరీ నియమించాడు. 13 వ శతాబ్ద ఆరంభంలో కాబూల్ పై మంగోలుల దాడుల కారణంగా ఖిల్జీలు పెద్ద ఎత్తున భారత్ కు వలస వచ్చి ఇక్కడ ముస్లిం జనాభాను పెంచారు.

భారతదేశంలోని ముస్లిం సామ్రాజ్య ప్రజావర్గం గా ఖిల్జీలు ఉండేవారు. వీరి నాయకులు క్రిందిస్థాయి పౌర, సైనిక ఉద్యోగాలు మాత్రం చేసేవారు. వీరికి టర్కిస్థానలోని, ఆఫ్ఘన్ లో గాని ఏ రాజకీయాధికారం లేదు. అలాగే ఢిల్లీ లోని పాలక వర్గంలో భాగంగా కూడా వీరు గుర్తింపబడలేదు.

ఢిల్లీ సుల్తానత్ ను స్థాపించిన "మామ్లూక్ తురుష్కులు" ముస్లిం రాజకీయాల్లో జాత్యహంకారాన్ని ప్రవేశ పెట్టారు. ఇది ఇస్లాం మత వ్యతిరేకమైనా కేవలం వారి స్వార్థం కోసం చేసిన పని. ఐబక్, ఇల్టుట్మిష్, బాల్బన్ లు

తమ జాతికి చెందిన తురుష్క బానిస అధికారులతో బహ

ప్రముఖుల వర్గాన్ని కూడా తయారు చేసుకున్నారు. [దీన్ని సుల్తాన

పదవే గాక మొత్తం ప్రభుత్వ పాలనలోని ఉద్యోగాలన్నీ కూడా ఉత్తమ

తురుష్కులకే పరిమితం చేశాడు బాల్బన్.]

[ఈ జాతి దురహంకారం పాలక వర్గంలో

వివాదాలకు కారణమైంది. వైరవర్గాలు ఉన్న వర్గం రజ్జుబాటి

సమష్టిగా పరిణమించింది.] రాజధాని తరచూగా ఆస్థాన కుట్రలు,

రాజకీయ హత్యలు, తిరుగుబాట్లు, సింహాసన బలవంతపు విషయాలకి

దారి తీయడం - రక్త స్నానాలు చేయడం - చివరకు సుల్తాన్లు కూడా

వీటికి బలి కావాల్సి వచ్చింది. [ఈ వివాదాల వల్ల రాజకీయ మార్పుల వల్ల

సుల్తానత్ కు వెన్నెముక అయిన ముస్లిం ప్రముఖుల వర్గానికి

దెబ్బ తగిలింది. ఎందరో సైనికాధికారులు, పాలకులు,

పండితులు హత్యగావించబడి రాజ్యం వారి సేవల్ని కోల్పోయింది.]

ఇది నానాటికీ మత మార్పిడుల వల్ల,

విదేశీ వలసల వల్ల పెరుగుతున్న ముస్లిం సామ్రాజ్య పరిధి

నిరుత్సాహపరిచింది. (సమర్థులైన యువత నిరుద్యోగులైతే తిరుగుబాట్లు

తో మామలూక్ తురుష్క ప్రముఖవర్గం పై కోపం పెరుగుతుంది.)

(ఇట్టి నిరాదరణకి గురైన ఖిల్జీలకి చెందిన

ఫిరోజ్ తన శక్తియుక్తుల చేత సమాన గవర్నరయ్యాడు.

తర్వాత కైకుబాద్, సుల్తాన అయ్యాక సైనిక మంత్రిగా

నియమించాడు.)

## ఆఫ్ఘనిస్థానంలో ఉన్న పూర్వతన తురుష్క సర్దారులు

మాలిక్ ఐతెమూర (కచన్) , మాలిక్ సుర్ఖా లు మొదలైన ఆమీర్-ఎ-హాజిబ్, బర్బక్ లుగా ఉంటూ సర్వాధికారం చెలాయిస్తున్నారు. (ఖిల్జీ తెగున ఫిరోజ్ పైకి రావడం గిట్టని <u>వీరు</u> ఫిరోజ్ ను , మొత్తం తురుష్కేతర అధికారులందరినీ అడ్డుతొలగించుకొని తురుష్క సర్వాధిపత్యాన్ని నిలబెట్టాలనుకున్నారు.)

(ఈ వైరి వర్గాల మధ్య ఘర్షణలో ఖిల్జీ ఫిరోజ్ గెలిచాడు.) కచన్ ను హతమార్చారు (ఆ తర్వాత ఖిల్జీ ఇతన్ని చంపాడు). బాలుడైన కైయుమర్స్ కు సంరక్షకుడిగా కొంతకాలం ఉండి మెల్లిగా కైకుబాద ను, కైయుమర్స్ ను అడ్డుతొలగించుకొని కైకుబాద కట్టించిన కిలొఖరి భవంతిలో (జలాలుద్దీన్ ఫిరోజ్ ఖిల్జీ గా సింహాసనానికి వచ్చాడు, క్రీ.శ. 1290 లో.)

(ఈ సింహాసన మార్పు మామూలు (ప్ర)భుత్వ మార్పు కాదు. దీనికి గల ప్రాముఖ్యం చేత ఈ విప్లవం ఎంతటి ఫలితాన్ని సాధిస్తుందో అంటూ మార్పు ను ఇది సూచించటం చేత దీన్ని "ఖిల్జీ విప్లవం" అన్నారు.)

(ఇంతవరకు ఢిల్లీ సుల్తానత్ కు ఎంపిక వారసత్వం, సర్దారుల ఎంపిక, ప్రజల మద్దతుతో రావడం ద్వారా జరిగింది. కాని ఈ ఖిల్జీ విప్లవం ద్వారా మొదటి సారిగా సైనిక తిరుగుబాటు / సైనిక కుట్ర ద్వారా సుల్తాన అధికారం లోకి వచ్చాడు. అందువల్ల సైనిక శక్తి ద్వారానే అధికారం నిలబెట్టుకోవాలని వీరు యత్నించారు.)

నిరాదరణకు గురైన ముస్లిం ప్రజానీకమంతా (masses) మొత్తం మీద జలాలుద్దీన్ కు సహకారం, మద్దతు అందించారు. అయితే ఊగారిన ప్రజల కి ప్రతినిధి వంటివాడు సింహాసనం కోరడం పట్ల ఢిల్లీ లోని ప్రముఖుల వర్గం అను అమీర్లు, టర్కులు అలవాటుపడటానికి కొంత కాలం పట్టింది.

అందువల్ల జలాలుద్దీన్ ఖిల్జీ సింహాసనం కి రావటం అనేది కేవలం వంశం లో వచ్చిన మార్పు కాదు, అది భారత ముస్లిం రాజకీయాల్లో విప్లవం వంటిది. పాలక వర్గం దాదాపు శతాబ్దకాలం పాటు చెలాయించిన జాత్యహంకార విధానానికి ఇది చరమ గీతం పాడింది. అధికారాన్ని తమ సొత్తు చేసుకున్న తురుష్క సర్దారులకి ఇది చావుదెబ్బ. ఈ కోణం నుంచి చూస్తే ఖిల్జీ వంశ స్థాపన తో భారత దేశంలో ముస్లిం పాలన ఆరంభమైందని చెప్పవచ్చు, అంతకు ముందున్న కాలాన్ని తురుష్క పాలనగా చెప్పవచ్చు.

# Chapter - 23 Culture during the Mughal Empire

## Persian Literature (including historical works)

భారత దేశమేలిన తైమూరిడ్ పాలకులు పర్షియన్ సంస్కృతిని ఎంతగానో ప్రేమించేవారు, భారతదేశానికి వారి రాక పర్షియన్ సాహిత్యంలో వైభవోపేతమైన కాలాన్ని ఏర్పర్చింది.

16, 17 శతాబ్దాల్లో ఇరాన్ నుంచి భారత్ కు పర్షియన్ పండితులు వలస రావడం ఇండో-పర్షియన్ సాహిత్య వృద్ధికి ఎంతగానో దోహదం చేసింది.

బాబరుతో కొందరు పర్షియన్ పండితులు భారతకు వచ్చారు. అయితే హుమాయూన్ భారత చక్రవర్తిగా సూర్ పాలనాంతం తర్వాత తిరిగి వచ్చినప్పుడు పర్షియన్ కవులు, సాహిత్యవేత్తలు మొగలు ఆస్థానాలకు కొల్లలుగా వచ్చారు. హుమాయున్, అక్బరు, జహంగీరు, షాజహాన్ల ఆస్థానాల్లోని ఇరానీ కవులు సాంస్కృతిక సమ్మేళనాన్ని సాధించారు. ఈ సమ్మేళనం ఫలితంగా ఒక నూతన పర్షియన్ కవిత్వంగా "సబక్-ఇ-హింది" (భారతీయశైలి) ఆవిర్భవించింది. ఫైజీ, షైజి, ఉర్ఫీ, నజీరి, కలీం మొదలైన వారు ప్రతిబింబించారు.

ఈ కవుల్లో చాలా మంది పర్షియాలో

పుట్టారు, కానీ వారి కవిత్వం మాత్రం తప్పనిసరిగా భారతదేశంలో పుట్టింది. ఈ కవిత్వం భారతీయ వాతావరణం యొక్క విలక్షణాలని ప్రతిబింబిస్తుంది.

ఈ కాలంలోని పర్షియన్ సాహిత్యాన్ని అనువాదాలు, కవిత్వం, చరిత్ర గ్రంథాలు, లేఖలు, జీవిత చరిత్రలు, ఇతర గద్య రచనలు గా పేర్కొన వచ్చు.

(1) అనువాదాలు:

అనువాదం విషయంలో అక్బరు "అనువాద విభాగాన్ని" స్థాపించడం ద్వారా గొప్ప మేలు చేశాడు. ఈ డిపార్ట్‌మెంటుకు సంస్కృత, అరబిక్, యూరోపియన్ సాహిత్య సమాచారాన్ని పర్షియన్ లోకి అనువదించే విధి ని అప్పగించాడు.

సంస్కృతంలోని మహాభారతం, రామాయణం, లీలావతి, అథర్వణవేదం, రాజతరంగిణి పర్షియన్ లోకి అనువదించబడ్డ వాటిలో ముఖ్యమైనవి.

మహాభారత అనువాదము నాకీబ్ ఖాన్, బదౌని, సుల్తాన్ హాజి థానేశ్వరి, ఫైజి, అబుల్ ఫజల్ ల ఉమ్మడి కృషి. ఇది "రజ్మ్‌నామా" RAZMNAMA

గా పిలవ బడింది. ఇది అనుభవజ్ఞులైన ప్రాయసకాండ్రు చేత ప్రతులుగా రాయబడింది, ఆస్థాన చిత్రకారుల చేత దృశ్యాలుగా గీయబడింది.

హాజీ ఇబ్రహీం సరహిందీ అథర్వవేదాన్ని బదౌని ప్రారంభించగా అతను ముగించాడు.

'లీలావతి'ని ఫైజీ, 'రాజతరంగిణి'ని మౌలానా షా మహమ్మద షహాబాదీలు అనువదించారు.

దారా రాకుమారుడు ఉపనిషత్తుల అనువాదాన్ని తనకు తోడుగా ఎన్నో మంది బ్రాహ్మణులతో నియమించాడు. దారా ఉపనిషత్తులతో పాటు భగవద్గీత, రామాయణాన్ని కూడా అనువదించాడు. ఈ సాంప్రదాయక గ్రంథాలు పర్షియన్ లో లభించడం చేత ముస్లిములకు భారతీయ సాంస్కృతిక యొక్క లోతులు తెలుసుకోవటానికి అవకాశం ఏర్పడింది. తద్వారా ఈ విషయాల్లో పండితులైన వారు హిందూమతం, హిందువుల పట్ల ఆరోగ్యకరమైన గౌరవాన్ని ప్రదర్శించే అవకాశం ఏర్పడింది.

అరబిక్, గ్రీకు, టర్కీ రచనలు కూడా పర్షియన్ లోకి అనువదించబడ్డాయి. బాబరు టర్కీభాష లో రాసిన తన స్వీయచరిత్ర ను అబ్దుర్ రహీం ఖాన్-ఇ-ఖానన్ అనువదించాడు. బదౌని

'తారిఖ్-ఇ-రషీది' లో రెండు భాగాల్ని అనువదించాడు. 'బైబిలు' కూడా పర్షియన్ లోకి అనువదించబడింది.

## సాహిత్యం :

పర్షియన్ సాహిత్యానికి అక్బరు కాలం లో వైభవోపేతమైన కాలం. హుమయూన్ తోటే స్వయంగా గొప్ప సాహిత్యం రాసినప్పటికీ అక్బరు కాలానికి కొత్త ఘనతను దక్కించుకుంది.

అక్బరు కాలంలో ఫైజీ, ఘజలీ, ఉర్ఫీలు రుబాయీలను, కసీదాలను, మస్నవీలు, ఘజల్లను ఉత్తమ శైలిలో వెలువరించారు. అబుల్ ఫజల్ తన 'అయినీ అక్బరీ' నందు అక్బరు ఆస్థానంలో మొత్తం 59 మంది కవులున్నట్లు రాశాడు.

బదౌని ప్రకారం ఉర్ఫీ పద్యాలు అందరికీ నచ్చేవి, ఫైజీ అంత ప్రజాదరణ గల కవి కాడు. జహాంగీరు, నూర్జహాన్ కూడా సాహిత్యం రాయడంలో ప్రవేశమున్నవారు, పైగా కవుల పాండిత్యాన్ని ప్రోత్సహించారు. షాజహాను సాహిత్యం పట్ల ఆసక్తి లేదు. ఔరంగజేబు కుమార్తె జేబున్నీసా కూడా సాహిత్యం రాసేది.

నాటి పర్షియన్ సాహిత్యానికి ప్రధాన వస్తువు ప్రణయం. చాలా మంది కవులు ప్రణయాన్ని వ్యక్త పరిచేందుకు కాల్పనికమైన వాక్యాలనే వాడేవారు. పర్షియన్ సాహిత్యం ఆది సమయంలో తాత్విక సాహిత్యాన్ని కూడా కథాకథన

తీరా వర్ణనాత్మక, గేయ శైలులలో అందించింది.

## చరిత్ర రచనలు:

మొఘలాయిలు చరిత్ర రచనకు ప్రత్యేక శ్రద్ధ కనబరిచారు. అబుల్ ఫజల్ "అక్బరునామా", "అయిన్ అక్బరీ" లను వ్రాశాడు. అక్బరునామాలోని భాష చాలా అలంకారయుక్తంగా ఉండి చదువరులకు విసుగు కలిగిస్తుంది. అయితే ఇది నాటి ప్రభుత్వ వ్యవస్థీకరణ, ఆర్థిక, సాంఘికాల గురించి విశదంగా వివరిస్తుంది. సమకాలీన ఆసియా, ఐరోపాలలో మరెక్కడా ఇంత భారీ రచన చేయబడలేదు. అయితే అబుల్ ఫజల్ తన పోషకుణ్ని పొగిడేందుకే ప్రధానంగా ఈ రచన చేశాడన్న విమర్శ ఉంది. ఇది ఆనాటి యూరపు సాహిత్య శైలిలో ఇతర గ్రంథాల వలెనే రాయబడింది. పైగా అబుల్ ఫజల్ తన పోషకుని లోపాలు, వైఫల్యాలను కూడా రాశాడు.

జహాంగీరు కాలంలో "ఇక్బాల్ నామా" ను ముతమద్ ఖాన్; "మాసిర్ జహాంగీరి" ను కమగర్ ఖాన్ మరియు "తారిఖ్ ఇ ఫిరిష్తా" ను మహమ్మద్ కాసిం ఫిరిష్టా రచించారు.

షాజహాను కాలంలో ముఖ్య రచన "పాదుషానామా" ను అబ్దుల్ హమీద్ లాహోరి రాశాడు. ఔరంగజేబు కాలంలో "ముంతఖబ్ ఉల్ లుబాబ్" ను ఖాఫీ ఖాన్, "ఫుతుహాత్-ఇ-ఆలంగిరి" ను ఈశ్వరదాస్ నాగరేలు రచించారు.

## లేఖలు, జీవిత చరిత్రలు :

చక్రవర్తి విదేశీ ప్రముఖులకి పంపిన సందేశాలను అబుల్ ఫజల్ "ఇన్షా" గా సంకలనం చేశాడు. ఇతని "రుకాత్" ప్రైవేటు, వ్యక్తిగత లేఖల సంకలనం. ఇతని రచనల్ని ఇండో-పర్షియన్ సాహిత్యానికి ప్రాతినిధ్యం వహించే అలంకారాలతో, పాండిత్యంతో, అదే ఇతర ఆడంబరాల తో నిండి ~~ఉంటాయి~~.

అనధికారిక రచనలలో బదాయి యొక్క "ముంతఖబ్-ఉత్-తవారిఖ్" రచయిత యొక్క వర్ణనా విధి లో పరిపూర్ణతని, శ్రద్ధని వాటితో పాటే మెళకువ యొక్క అతని సామర్థ్యాన్ని, ప్రామాణికతను నిరూపిస్తుంది.

ఇండో-పర్షియన్ సాహిత్యానికి హిందువులు చేసిన సేవలు చాలా ఆసక్తిదాయకమైనవి. అవి ఉత్తమ స్థాయి నందుకోవడమే గాక మౌలికమైన గద్య, పద్యాలతో పోటీ పడుతుంటాయి. రాజా టోడర్ మల్ (Raja Todar Mal) భాగవత పురాణాన్ని పర్షియన్ లోకి అనువదించాడు. అమరనాథ చతుర్వేదాలను పర్షియన్ లోకి "ఖయలాత్-ఇ-వాయుదా" గా సంగ్రహించాడు.

సాహిత్యపరంగా పర్షియన్ లో ఉన్నత ప్రమాణాలు సాధించిన తొలి హిందువు చంద్రభాన్, ఇతని పోషకుడు దారా షుకోవ్. చంద్రభాన్ యొక్క "ఘజల్స్ దివాన్", Quatrains "రుబాయియత్" లు అతని విస్తృత పాండిత్యాన్ని, కవిత్వ

గొప్పదనాన్ని, హిందూ-ముస్లిం ఆలోచనల మేళవింపునూ చూపిస్తాయి.

మొగలుల కాలంలో వెలువడిన పర్షియన్ సాహిత్యం ప్రాంతీయ సాహిత్యాలు ముఖ్యంగా ముస్లింలు నివసిస్తున్న ప్రాంతీయ సాహిత్యాలు రూపొందడం పై ఎంతో ప్రభావం చూపింది. ఒక భాషగా ఉర్దూ ఆవిర్భవించటం పర్షియన్ వృద్ధి వలనే. పర్షియన్ సంప్రదాయంలో రూపొందిన మరొక్క భాషగా పంజాబీ, పుష్టు / పుష్తు / పుష్తూ, సింధీ, బలూచీ, మరియు కాశ్మీరీలను చెప్పవచ్చు. ఇవన్నీ పర్షియన్ లిపినే వాడుతాయి. పర్షియన్ సాహిత్యం ఈ ప్రాంతీయ భాషలన్నింటికీ భాషా సంపత్తిని అందించటమే గాక వాటి రచయితలకి ప్రక్రియలను, వారి సాహిత్యరచనలకి ఇతివృత్తాన్ని అందించింది.

ఈ కాలంలో పర్షియన్ సాహిత్య, చారిత్రక రచనలే గాక ఎన్నో పర్షియన్ భాషా నిఘంటువులు కూడా వెలువడ్డాయి.

* అక్బరు కాలంలో పర్షియన్ సాహిత్యం ఉత్కృష్ట దశకు చేరుకొంది.

ఈ యుగంలో గొప్ప చరిత్రకారుడైన అబుల్ ఫజల్ మంచి పండితుడు, శైలీకారుడు. ఇతను ఏర్పరచిన ప్రత్యేకమైన గద్యశైలి ని తర్వాత అనేక తరాల వారు అనుకరించబడింది.

# Condition of Peasants



మొఘలుల కాలములో భారతీయ రైతులు
గడ్డిదైన మరియు పెరుగుతూ పోయిన హింస వలన
దౌర్భాగ్యమైన జీవితాలను గడిపిరి. ఈ కాలంలో
రైతుల మధ్య ఆర్థిక వ్యత్యాసములు బాగా వృద్ధినొందెను
ఆ నాటి మోతుబరి రైతులు కూలి పని వారిని
పెట్టుకుని పండించిన పంటలను అమ్ముకొనేవారు.
అయితే చిన్న లేదా సన్నకారు రైతులు తమ
సొంత జీవనమునకు కూడా చాలీచాలనంత
ఆహార ధాన్యాలను మాత్రమే పండించుకొనగల్గేవారు.
రైతుల్లోని ~~రైతులు~~ పేర్వారు ~~భూభాగాల్లో~~
~~ఈ~~ తేడాతోగాక ఉన్నతకులాల రైతులకి భూములేని
కూలీలుగా వ్యవసాయభూముల్లో పనిచేస్తు రైతుల
వ్యవసాయులకి ~~ఊరితం~~ గా ఉండే బడుగు వర్గాల వారికి
భేదాలు మరింత తీవ్రంగా ఉండేవి.

రైతులు పేర్వారు భూభాగాల్లో (కమతాల్లో)
వ్యవసాయం చేసేవారు. పొలంలో కూలిపనివారు
చేసిన చాకిరీతో సంబంధం లేకుండా పండిన
పంట మీద పూర్తి హక్కులు భూస్వామికే ఉండేవి.
(ఖీసమ్)
కోతకోసేవారు తమ యజమాని అయిన
వ్యవసాయదారుని (కిర్సాన్) ఆజ్ఞానుసారంగా
పొలంలో పని చేసేవారు. (కిర్సాన్) (కమతాలు పేర్వారు
గా ఉండడం అనేది పంట మీద ఆధారపడి ఉంది

ఆధారపడటాన్ని సూచిస్తుంది గాని ఆ కమతాల్ని శాశ్వతంగా కలిగి ఉండాల్సి అవసరాన్ని సూచించదు. ఒకసారి పంట కోత పూర్తవగానే సాగుదారుడు ఆ భూమిలో ఏ మాత్రం ముడిపడి ఉండేవాడు కాడు. సాగుదార్లు తమ కమతాల్ని మార్చుకోవటానికి ఎంత సులభంగా చెప్పేవారంటే 'పాయికాష్త్' అనే మొత్తం పర్గణాల్లో తమ సొంత గ్రామాల్లో గాక ఇతర గ్రామాల్లోనే సాగుచేసేవారు.

తమ వద్ద గల వనరులు- ఎడ్లు, దున్నలు, ధనం ఆధారంగా రైతులు పెద్ద తరాబుల్ని పొలాల్ని సాగుచేసేవారు. పెద్ద కమతాలు గ్రామాధ్యక్షులైన ముకద్దమ, పటేల్ లను, గ్రామాధిపుల్లో గల కలాంతరన్ వంటి వారికి ఉండేవి. ముకద్దమ్ కు సాధారణంగా మొత్తం గ్రామ సాగు విస్తీర్ణంలో 2½ % భూమి, శిస్తు మినహాయింపులో ఉండేది. ఉన్నత రైతులకు సాధారణ సామాన్య రైతులతో పోలిస్తే మినహాయింపు రేటులో శిస్తు మదింపు చేసేవారు. ఇది రైతుల్లో ఆర్థిక వ్యత్యాసాన్ని తీవ్రం చేసింది.

చిన్న రైతులయిన "రెజా రియా"
Reza Riaya

ఆ రైతుల్లో అధికసంఖ్యాకులు, వీరిని కొందరు
ప్రాంతాల్లో పెద్దరైతులుగా పిలుస్తారు. రాయలసీమలో 'మోతుబరులు'
మహారాష్ట్రలో 'కునబీలు' అనేవారు. ముకద్దములకు,
పటేలులకు, కొల్లకట్టు ఖుదకాష్తులకు, ఘరుహాలాలకు,
మిరాసదార్లకు ఇచ్చిన మినహాయింపుల లాగానే
భారమంతా వీరి పైనే పడటంతో వీరు ప్రభుత్వానికి
నరయేస్తు వారు. శిస్తు వసూలుకు గ్రామం యూనిట్
కాబట్టి ప్రభుత్వం గ్రామ పెద్దలపై శిస్తు వసూలుకు ఆధారపడేది.
వీరు తాము నిర్ణయించిన రేట్లకు శిస్తు మొత్తాల వద్ద నుండి
వసూలు చేసి ఒకటిగా చేర్చేవారు. ఈ మొత్తం నుండి ప్రభుత్వానికి
శిస్తు కట్టేవారు. ఈ మొత్తాన్ని నియంత్రించే పెద్దలు
సాంప్రదాయంగా తాము న్యాయబద్ధంగా చెల్లించాల్సిన శిస్తును
ఎగవేసేవారు. మిగిలిన వాటిలో సింహభాగం ఇలాంటి చిన్న
రైతులు గ్రామపెద్దల దోపిడీ కి బలవ్వడాన్ని చెప్తుంది.

గ్రామంలో 20 నుంచి 25% ప్రజలు
నీచ కులాలకు చెందిన వారు. వీరు భూమిని కలిగి ఉండటానికి,
లేదా దాన్ని సొంతంగా సాగు చేసుకోవడానికి వీలులేదు. గ్రామ
సేవకులుగా (ఉదా: బలుతాదార్లు) మాత్రం వీరిలో కొందరికి
చిన్న చిన్న ఈనాములుండేవి. వీళ్ళని కోత సమయాలప్పుడు
పొలాల్లో పనికి పిలిచేవారు. బన్నాలు వేయించుకోవడం మొదలు
బలవంతపు చాకిరి (బేగార్) వీళ్ళ చేత చేయించు
కునేవారు.

# Mediaval India (4)

| Topic పల్లవి. ఆకులాటి | Page no: |
|---|---|
| సూఫీల సాంఘిక పాత్ర | 1 |
| సూఫీలు - ఉపదేశాలు | 6 |
| సూఫీలు - మత మార్పిడులు | 7 |
| సూఫీ ఖనకాహ్‌లలో భౌతిక జీవితం | 10 |
| భారతీయ సమాజంపై సూఫీ తత్త్వ ప్రభావం | 12 |
| సూఫీ ఉద్యమం - మత సామరస్యం | 13 |
| సూఫీ ఉద్యమం - భక్తి ఉద్యమం | 19 |
| సూఫీ ఉద్యమం పై విమర్శ | 25 |
| చరిత్ర రచన - జియావుద్దీన్ బరానీ | 29 |
| పర్షియన్ సాహిత్యం - అమీర్ ఖుస్రో | 37 |
| పర్షియన్ లో చారిత్రక రచనలు | 43 |
| పర్షియన్ లో సూఫీ సాహిత్యం | 45 |
| మిశ్రమ సంస్కృతి యొక్క పరిణామం | 49 |
| లింగాయతులు | 61 |
| Bhaki Schools in the South (13, 14 Cen) | |
| శ్రీ వైష్ణవులు రామానుజుడు - విశిష్టాద్వైతం | 67 |
| నింబార్క మతం - ద్వైతాద్వైతం | 73 |
| మధ్వాచార్యుని మతం - ద్వైతం | 75 |
| ~~భక్తి ఉద్యమ [illegible]~~ Read Satish Chandra's version | 79 |
| Sufism in Pantheistic phase | 91 |

8.8.03 

# సూఫీల సామాజిక పాత్ర

సూఫీలు నాటి సమాజంలో ఎప్పుడెప్పుడు నాటి రాజకీయాలలోనూ ప్రముఖ పాత్ర వహించారు.

## సూఫీలు - రాజ్యం :-

తొలి చిష్టీలు, షాయెకబిర (బీజాపూర రాజ్యం) చిష్టీలు తప్ప మిగిలిన అన్ని సిలసిలాల చిష్టీలు, తదనంతర చిష్టీలతో సహా దాదాపుగా రాజ వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడం, రాజ దర్బారు స్వీకరించడం చేసినవారే!

చిష్టి సూఫీలు ఆయా సుల్తానుల విధానాల పట్ల అయిష్టాల వెల్లడించిన, వ్యతిరేకించిన సందర్భాలు కూడా ఉన్నాయి. ఉదాహరణకు మహ్మద్ బిన తుగ్లక్ విధానాలు.

చిష్టీలు కాక తక్కిన సిలసిలాల సూఫీలు రాజ్య యంత్రాంగంలో ఒకలా భాగం కావడం ద్వారా సేవ చేయగా తొలి చిష్టీలు మాత్రం పరోక్షంగా సేవ చేశారు. ఆయా తరగతులు, మతాలకు చెందిన రాజ్య ప్రజల మధ్య చక్కని సామరస్య భావాలతో వాతావరణాన్ని ఏర్పరచి విభిన్న జాతుల వారు ప్రశాంతంగా జీవించేందుకు దోహద పడ్డారు.

తొలి చిష్టీలుగాని, గొప్ప చిష్టి గురువులు గాని మొత్తంగా సూఫీలు ఎప్పుడూ కూడా నాడు ఉనికిలో ఉన్న రాజకీయ వ్యవస్థని గాని తరగతుల నిర్మాణాన్ని

గాని ప్రశ్నించలేదు. రైతుల నుంచి భూమిశిస్తు వసూలు చేయడంలో దయతో వ్యవహరించమని మాత్రమే వారు చెప్పేవారు.

తమ విశ్వాస/మత ప్రజలను (తమమతస్థులైన సామాన్య ప్రజల) రాజ్య సంపద పొందడం నుంచి, ఉన్నత కార్యనిర్వాహకాల్లో పాల్గొనటం నుంచి వారిని నిరోధించలేదు.

బహుశా ఈ విశిష్టమైన పరిమితుల వల్లనే ఒకప్పుడు కఠోరంగా విస్తృతంగా ఉన్న చిష్టీ సిల్‌సిలా పద్ధతి కాలంలో రాజాశ్రయాన్ని అంగీకరించటం, రాజ్య వ్యవహారాల్లో పాల్గొనటం మొ|| వీరి చాలా సాఫీగా జరిగిపోయాయి.

సుహ్రావర్దీలు రాజకీయాల్లో చురుకుగా పాల్గొన్నారు. ముల్తాన్ లోని బహావుద్దీన్ జకారియా ప్రత్యేక పాలకుడు ఖుబాచా నుంచి పూర్తి మద్దతు, ఉన్న కూడా లెక్కచెయ్యక బహిరంగంగానే ఢిల్లీ సుల్తాన్ ఇల్తుత్మిష్ తో చేరి అతన్ని ముల్తాన్ పై దాడికి ప్రోత్సహించాడు.

తొలి తుగ్లక్ సుల్తానులు మతవర్గాల వారి మద్దతును వారి అధికారాన్ని స్థిరపరుచుకోడానికి, సమర్థ-గట్టి రాజ్యాన్ని స్థాపించడానికి గాను కోరుకున్నారు. అందువల్లే సుహ్రావర్దీలు చెల్లిస్తూ రాజకీయాల్లో

చిష్టీ గురువులు సమస్యంతటా ప్రభుత్వ సర్వీసుల్ని, రాజ్యాన్ని వ్యతిరేకించాలన్నట్లు తప్పించారు. రాజ్య వ్యవహారాలకి సంబంధించిన ఆర్థిక సహాయాలు కేవలం ఆధ్యాత్మిక అధికారాన్ని ఒప్పుకొంటూ / ఇతరులకి మార్మిక మార్గాన్ని దరిద్రులకి సాయం చెయ్యటానికి నియమించబడ్డ వారికి మాత్రమే వర్తిస్తాయి. సాధారణ శిష్యుల్ని ప్రభుత్వ సేవ నుంచి కఠినంగా వెలి వేయలేదు. నాసిరుద్దీన్ చిరాగ్ రాజోద్యోగం అప్పుడు సరిగా ధ్యానానికి, ఆధ్యాత్మికతకు ప్రతిబంధకం కాదని / తప్పించాల్సిన పని లేదని చెప్పాడు. అయితే చిష్టీ గురువులు వ్యవసాయం, హస్తకళలకి మరింత ప్రాధాన్యతని ఇచ్చారు.

దీన్ని బట్టి చిష్టీలు చెప్పిందేమంటే, రాజ్యం, పాలక వర్గం నుంచి కొంత దూరంగా ఉంటూ, రాజ్యం ఉదారంగా వ్యవహరించటానికి కావాల్సిన పరిస్థితుల్ని సృష్టించటానికి కృషి చేయాలి. అంటే ఇద్దరికీ వారి ఆసక్తుల్లో ప్రాథమిక భేదం లేదు, వారు అవలంబించే మార్గాల్లో మాత్రమే తేడాలున్నాయి. రాజ్యం సరిగా పనిచేస్తేనే సూఫీలు తమ మార్మికతా మార్గాన్ని ఆ శాంతియుత వాతావరణంలో ప్రచారం చేసుకోగలుగుతారు. అలాగే సూఫీలు సామరస్యత కోసం చేసిన కృషి రాజ్యాన్ని సుస్థిరం చేయటానికి ముస్లిం సమాజాన్ని స్థిరపర్చటానికి దోహదం చేసింది.

## సూఫీలు – ఉలేమాలు :

అల్-ఘజాలి సనాతనమైన ఉలేమాలకి సూఫీల మధ్య వైరం తగ్గించే యత్నం చేసినప్పటికీ అది కొనసాగుతూనే ఉంది. సుల్తానుల కాలం లో ఈ వైరం కొనసాగుతూనే ఉంది. సనాతన సూఫీలైన సుహ్రావర్ది, కదిరి మొ॥ సిల్సిలాలు ఉలేమాల కి అనుగుణంగా ప్రవర్తించినా ఈ వైరం పోలేదు. ఉలేమాలు ముఖ్యంగా చిష్తీ సూఫీల పై వారి ఆచారాల పై వ్యతిరేకత కలిగి ఉన్నారు. చిష్తీల 'సమ' ను వ్యతిరేకించారు. చిష్తీల గుర్ మేల సన్నిహిత్య రీతిని ఆక్షేపించారు.

చిష్తీ సూఫీలైన షేక్ నాసిరుద్దీన్ చిరాగ్, గేసు దరాజ్ మొ॥ వారు చిష్తీ క్రమంలోకి సనాతన భావాలు తేవడం ద్వారా చిష్తీ సంప్రదాయాల పై ఉలేమాలకున్న ద్వేషాన్ని తగ్గించే యత్నం చేశారు. చిష్తీలు రాజ్య వ్యవహారాలకు వర్జించటం, రాజ్య గ్రాంట్లు తిరస్కరించటం చేసినట్లు తెలుస్తుంది. పైగా ఉలేమాల కి చింతనలు వంటి సిద్ధాంతాల

ధోరణులు అలవర్చుకోవడం కూడా చేశారు.

## సూఫీలు - మత మార్పిడులు :

సుల్తానుల కాలంలోని సూఫీలు ప్రధానంగా భారతదేశంలో ఇస్లాం ప్రచారకులుగా తెలుస్తారు. మధ్యయుగం లోని పలు సంప్రదాయాలు, గాథలు, రచనలు కూడా సూఫీలు మంచి మిషనరీలు / మత ప్రచారకులని చెప్తుంటాయి. షేక్ మొయినుద్దీన్ చిష్తీ మరణానంతరం పౌరాణిక రచనలు అతను ముస్లిం మతంలోనికి అనేక మందిని మార్చినట్లుగా చెప్తుంటాయి. అలాగే 13 వ శతాబ్దం చివర్లో, 14 వ శతాబ్దం మొదట్లో దక్షిణానికి వచ్చిన తొలి చిష్తీలని ఈ తర్వాతి గాథలు ముస్లిం మత ప్రచారకులుగా వర్ణించాయి. వారు ముస్లిమేతరులపై జిహాద్ (పవిత్ర యుద్ధం) లు కూడా చేసినట్లు రాశారు.

సుహ్రావర్ది సిలసిలా లో పలువురు ఉత్సాహవంతులైన ఎవాంజెలిస్టులు ఉన్నారు. మీర్ సయ్యద్ అలీ హమదాని మరియు అతని అనుచరులు 14 వ శతాబ్దంలో కాశ్మీరులో మత మార్పిడుల కోసం ఎంతో కృషి చేశారు. ఈ కృషి అంతగా ఫలించినట్లు [illegible] [illegible].

ఇక్కడ గమనించాల్సిన ముఖ్య విషయం ఏమిటంటే ముస్లిమేతరుల్ని ముస్లింలుగా మార్చడం

అసలది (అవి) సూఫీ సిలసిలాల వారికి వారి కార్యకలాపాల్లో భాగం కాదు. ఉదాహరణకు షేక్ బహావుద్దీన్ జక్రియా ఎవాంజెలిస్ట్ కాదు, మత మార్పిడులలో లేదా ఉత్సాహంగా పాల్గొనలేదు. అతని, అతని శిష్యుల్లోని వారసుల యొక్క ధోరణి ముస్లిమేతరుల పై సహనాన్ని కలిగి ఉండటమే. షేక్ నిజాముద్దీన్ ఔలియా కూడా చాలా మంది హిందువులు ఇస్లాం ను ఒక వాస్తవమైన మతంగా పరిగణిస్తారని అంటే దాన్ని స్వీకరించకుండానే అంగీకరిస్తారని తన శిష్యులకు తెల్పాడు. అద్వారా ఔలియా ప్రతి మతానికి దాని సొంత మార్గం, నమ్మకం, సొంత ప్రార్థనా విధానాలు ఉంటాయని వాటిని గౌరవించాలని తెల్పాడు. దక్కను చేరిన చిష్తీ సూఫీలు హిందువులను చేరుకోవడానికి వారి ప్రాంతీయ భాషలను నేర్చు.

ఏదైనప్పటికీ, ముస్లిమేతరులు ముఖ్యంగా కింది తరగతుల వారు ఈ సూఫీల పట్ల ఆకర్షితులైన మాట నిజమే. ముఖ్యంగా వారి సమాధులైన దర్గాల దగ్గర నేటి కింది భక్తుల్లో వీరూ చేరారు. ఆ దర్గాల దగ్గర ముస్లిం సంప్రదాయాలలో ప్రభావితులై మెల్లగా వీరు ఇస్లామికీకరణ చెందారు. (Islamization) అదేలా, ఈ ఇస్లామికీకరణ చెందిన వారి వారసులు చాలామంది

తమ పూర్వీకుల్ని ఎవరో ఒక మధ్యయుగం నాటి సూఫీ గురువు ఇస్లాం లోకి మార్చినట్లుగా చెప్పుకుంటారు. ఈ విధంగా చెప్పుకోవడం ద్వారా దర్గాతో వారికున్న దీర్ఘకాల సంబంధం, సూఫీలను అద్వారా ఇస్లాంలోనూ వారికున్న దీర్ఘకాలికత కి బలం చేకూరుతుంది.

సుహ్రావర్దీలు మాత్రం మతమార్పిడి చేయటంలో బాగా పాల్గొన్నారు. బెంగాలు లోని షేక్ జలాలుద్దీన్ బలవంతపు మతమార్పిడి చేయించటంలో కూడా వెనుకాడలేదు. ఇతడు పండువా సమీపంలోని దేవతల్లా వద్ద ఉండే దేవాలయాన్ని కూల్చి ఖానా ను నిర్మించాడు.

చిష్టీలు మాత్రం పేదలకు నిస్వార్థంగా సేవ చేయడం ద్వారా, తమ ఉత్తమ వ్యక్తిత్వాల ద్వారా పరోక్షంగా మతమార్పిడి కి కారణమయ్యారు.

## సూఫీ ఖానకాహ్‌లలో భౌతిక జీవితము:

సూఫీల ఖానకాలు సిల్‌సిలాల్ని బట్టి మార్పులతో కన్పిస్తాయి. కొన్ని రాజ సమూహాలతో చాలా సౌభాగ్యవంతంగా ఉండేవి. సూఫీలు రాజులతో సంబంధాలు పెట్టుకొని బహుమతి వారిలో కొందరు ఉన్నత భోగభాగ్యాల్ని వర్ధిల్లగా మారిపోవటం కూడా జరిగింది.

ఉదాహరణ చిశ్తీ సూఫీల వంటి వారు మాత్రం రాజస్థానం నుంచి భౌతిక తరగతులనుంచి వేరు చేయబడి అందర్నీ సమానంగా చూసే సూత్రాల ప్రశాంత ఖానకాలలో నివసించేవారు. ఉదాహరణ చిశ్తీలు సుల్తానుల నుండి భూముల దానం భౌతిక, రాజకీయ నిర్మాణాన్ని అంగీకరించారు. వారికి మరో ప్రత్యామ్నాయం చూపేటికి లేక పోయేదు.

చిశ్తీలు వారి సొంత ఖానకాలలో మాత్రం ఎట్టి తరగతుల క్రమ విభజనని పాటించేవారు కాదు. ఖానకాలో చదువుతూ ఉండేవారు, అతిథులూ సమంగా సమానత్వాన్ని అనుభవించేవారు. ఇటువంటి ఖానకాలు వారి శిష్యుల నుండి రాజ దానాలపై గాక ఫుతూహ్ ల మీద (unsolicited charity) ఆధారపడేవి.

చిశ్తీ ఖానకాహ్‌లు సమాజంలోని అన్ని మతాల వారికీ అన్ని తరగతుల వారికీ తెరువబడేవి. కలందర్లు, జోగులు తరచుగా ఈ ఖానకాలను దర్శించేవారు.

ఆర్థిక వీరికి సౌకర్యాలు కల్పించబడేవి.

ఖనకాలు పలు విధాలుగా సమాజ ఆర్థిక జీవితాలకి తోడ్పడేవి. వీటిలో కొన్ని బీద భూముల్ని సాగు చేసేవి. మరికొన్ని మతపరమైన, ప్రజోపయోగమైన భవనాలు కట్టడం, తోటలు పెంచడం మొ॥ పనులు చేసేవి. ఖనకాహ్‌లన్నీ వ్యవస్థలు నగరీకరణాలో ఎంతో తోడ్పడ్డాయి. ప్రతి సంవత్సరం చేసే ఉర్సు పండుగలు (ఆధ్యాత్మిక గురువుల మరణాన్ని జ్ఞాపకం చేసుకునే పండుగ) వ్యాపారాలకి, వర్తకాలకి, స్థానిక హస్తకళల ఉత్పత్తులకి మంచి ప్రోత్సాహాన్ని అందించేవి.

## భారతీయ సమాజం పై సూఫీ తత్వ ప్రభావము

1) సూఫీ గురువులు నిరంతరాయంగా, శాంతియుత పద్ధతుల్లో మత మార్పిడ్లు చేయటం ద్వారా హిందూ ముస్లింల సఖ్యత పెంచారు.

2) ముస్లిములలో సాంఘిక, సాంస్కృతిక నైతిక విలువల విషయాల్లో సూఫీల పాత్ర ఎనలేనిది.

3) ఇస్లాం మరియు ముస్లిముల యొక్క భారతీయీకరణకు కావాల్సిన శక్తుల్ని సూఫీలు కదిలించారు.

4) సూఫీలు ముస్లిం యువత యొక్క నైతిక వ్యక్తిత్వాన్ని నైతిక ప్రమాణాల్ని ఏర్పరచటం ద్వారా తీర్చిదిద్దారు. తద్వారా ఈ యువకులు తమ జీవితాల పట్ల ఆరోగ్యకరమైన హేతు దృక్పధాన్ని అలవర్చుకునేందుకు దోహదం చేశారు.

5) సూఫీలు సమాజ విద్యా ప్రగతికి ఎంతో కృషి చేశారు. వారి ఖానకాహ్‌లు జ్ఞానానికి కేంద్రాలయ్యాయి.

6) సూఫీల మత బోధనలు, చర్చలు మొ॥ వినేవారి తెలివి, ఆధ్యాత్మికతల వృద్ధికి తోడ్పడేవి. కొన్ని ఖానకాలలో విద్యార్థులకు మత విద్య ని కూడా బోధించేవారు. కొంత మంది సూఫీ గురువులు తామే ఉపాధ్యాయులుగా కూడా ఉండేవారు.

7) సూఫీతత్వం సాధించిన గొప్ప సాంస్కృతిక ఫలితం గా పరమత సహనాన్ని, మత సామరస్యాన్ని చెప్పవచ్చు.

## సూఫీ ఉద్యమము - మత సామరస్యం

1) చిష్టి సాధువులు గాత్ర, వాయిద్య సంగీతాలు రెండింటిలో గొప్ప ఆధ్యాత్మిక విలువ కలవిగా భావించేవారు. అందువల్ల వారు గాయకులను, వాయిద్యకారులను హిందూ ముస్లింల భేదం లేకుండా ఆహ్వానించేవారు. తమ ధ్యాన కాలాలలో వీరు చాల ఆధ్యాత్మిక పాటలు, కీర్తనలు పాడించి అక్కడి శ్రోతలకు ఆధ్యాత్మిక పారవశ్యం కలిగించేవారు. ఈ గానసభలకు "సమ" అని పేరు. వీటికి ఇస్లాం స్వీకరించే ఉద్దేశం ఏ మాత్రం లేని వేలమంది హిందువులు కూడా హాజరై విని ఆనందించేవారు. ఈ మతాతీత సంగీత పారవశ్యం సహజంగానే పరమత సహనాన్ని ప్రోత్సహించింది.

2) చిష్టి గురువు బాబా ఫరీద్ తన కవితాత్మక అభివ్యక్తి, గొప్ప ఉపన్యాస ప్రతిభ చేత చిష్టి సూఫీ ప్రచారం చేయడంలో హిందూ ముస్లింల ఇద్దరినీ ఆకర్షించాడు. ఇతడు హిందవీలో భక్తి సంకీర్తనలు భజనలు రాస్తూ తిరిగేవాడు. హిందూ పేద ప్రజలతో మమేకమయ్యేవాడు. ఇటువంటి బోధనలు అన్ని వర్గాలకూ హిందూ, ముస్లిం భేదం లేకుండా చేరేవి.

3) సూఫీ సాధువుల మరణానంతరం వారి సమాధులు దర్గాలుగా ప్రసిద్ధి చెందాయి. ఇవి ముస్లింలకే గాక హిందువులకు కూడా దర్శనీయ స్థలాలయ్యాయి.

4) హిందువుల మత, సాంఘిక జీవితం మీద సూఫీతత్త్వం చూపించిన ప్రత్యక్ష ప్రభావం పెద్దగా లేకపోయినా హిందువులకు ముస్లింలకు మధ్య సత్సంబంధాలకు కావల్సిన ఆరోగ్యకర ప్రభావాన్ని మాత్రం సూఫీతత్త్వం కలిగించింది. చిష్టీ సూఫీలు హిందువులలా కింది తరగతి వారిలా కలిసిపోయి జీవించేవారు. ఇష్టపూర్వకంగా పెద్దసంఖ్యలో మతమార్పిడులు జరగకపోయినా ఈ సామరస్యం కొనసాగింది.

X

ఉన్నత వర్గాల హిందువులు చాలాకాలం ఈ సూఫీ గురువులకు దూరంగా ఉండేవారు. కేవలం అక్బరు కాలంలోనే పర్షియన్ నేర్చుకున్న హిందువులు చిష్టీ సూఫీ తత్త్వం వేదాంతాల్ని అద్వైతం లా దగ్గరి పోలికలు ఉండటాన్ని చూసి ఆకర్షితులయ్యారు.

5) అక్బరు దీన్ ఇలాహీ భావన, లౌకిక దృష్టి, మత సహనాల వల్ల వారు హిందూ సంప్రదాయాల్లో సూఫీ సిద్ధాంతాన్ని ప్రచారం చేయగలిగారు. ఈ చర్యల వల్ల హిందువులు

చాలా మంది సూఫీ తత్త్వం పట్ల ఆసక్తులయ్యారు. ఒక కొత్త సూఫీ సాధువుల వర్గం ఏర్పడింది. వీరు మత విశ్వాసాలలో హిందువులైనా, అయితే వారి మార్మిక భావనలను మాత్రం పర్షియన్, ఉర్దూ భాషలలో వ్యక్తం చేసేవారు. ఇది మత సామరస్యానికి బాటలు పరిచింది.

6) సూఫీ సిద్ధాంతమైన "సుల్హ్-ఇ-కుల్" లేదా సార్వత్రిక సోదర భావం / విశ్వ సౌభ్రాతృత్వం గొప్ప మానవతా భావన కలది. ఇది అన్ని మత అడ్డుగోడల్ని దాటి హిందూ-ముస్లింల మధ్య సామరస్య భావనని వృద్ధి చేయడానికి తోడ్పడింది.

7) సూఫీ గురువులు, భక్తి ఉద్యమకారులు సాధారణంగా సామాన్య ప్రజానీకం చేత - హిందువులు, ముస్లింల చేత ఒకేలా ఆరాధించబడేవారు. హిందూ సాధువుల్ని ముస్లింలు ; ముస్లిం సాధువుల్ని హిందువులు గౌరవించడం, పూజించడం మధ్యయుగ భారతీయ సాంఘిక జీవనంలో భాగమయ్యింది. ఇది మత సామరస్యానికి ప్రత్యక్ష ఋజువు.

8) ఈ కాలంలో కొందరు హిందూ పండితులు తమ వారసత్వ మతాన్ని త్యజించకుండానే సూఫీ సాహిత్యం పట్ల మంచి ఆసక్తిని పెంచుకుని తమ మార్మికత్వ అనుభవాల్ని ముస్లిం (గురువులతో / భక్తులతో) పంచుకునేవారు. ఇది ఇరు

మూలాల వారి సాంఘిక-సాంస్కృతిక నాయకత్వం యొక్క గొప్పదనాన్ని ఆ ద్వారా సాధించబడిన పరమత సహనాన్ని తెల్పుతుంది.

9) సూఫీ ఉద్యమం రెండు మతాల మధ్య సాంఘిక-సాంస్కృతిక గుణాలు సమ్మేళనం చెందేందుకు దోహదం చేసింది. ఒక విధంగా చూస్తే పరమత సహనం వల్లే ఈ సమ్మేళనం జరిగిందనిపిస్తుంది. అలాగే ఈ సమ్మేళనం వలన పరమత సహనం మరింత బలపడిందని తెలుస్తుంది.

10) సూఫీ గురువుల ముఖ్య ఆశయం ముస్లిముల సంక్షేమ లక్ష్యమే అయినప్పటికీ వారి రక్షణ, శ్రద్ధలు హిందువులను పరిహరించలేదు. మొయినుద్దీన్ శిష్యుడు హమీదుద్దీన్ నగౌరి హిందువుల సమ్మతాలకి ఎంతగా విలువ ఇచ్చాడంటే అతడు శాకాహారిగా మారిపోయాడు. అంతేగాక తన శిష్యులని కూడా మాంసాహారం వదిలేయాల్సిందిగా కోరేవాడు.

11) చిష్టి సాధువులు హిందూ, జైన యోగులతో స్వేచ్ఛగా కలిసిపోయి వారితో అనేక విషయాల మీద ముఖ్యంగా యోగాభ్యాసాలు గురించి విస్తృతంగా చర్చించేవారు. వీరు ఇష్టపూర్వక మత మార్పిడులను ఆహ్వానించినప్పటికీ బోధనల ద్వారా మతవ్యాప్తం

మారుతుందనడం పై నమ్మకం కలిగి లేరు. బౌద్ధ సాధువులు హిందు మతం యొక్క గొప్పదనం, శక్తి గురించి బాగా తెలిసిన వాళ్ళు.

"ఓ! మీరు హిందువుల విగ్రహారాధనని అపహాస్యం / ఎగతాళి చేస్తారు, అయితే దగ్గర నుంచి పూజ / ప్రార్థన ఎలా చేయబడుతుందో కూడా నేర్చుకోండి"

— అని ఒక బౌద్ధ మాంత్రికుడు అందరికి చెప్పగలిగాడు.

ఒకసారి నిజాముద్దీన ఔలియా తన శిష్యుడు అమీర్ ఖుస్రో తో కలిసి డాబా మీద తిరుగుతుండగా ఒక హిందూ సమూహం పూజ చేయడాన్ని చూసి చలించిపోయాడు. వారి భక్తి కి ఆకర్షితుడై ఇలా చెప్పాడు.

"ప్రతి మతానికి దాని సొంత మార్గం, విశ్వాసం, మరియు దాని సొంత ప్రార్థనా విధానం ఉంటాయి"

12) ఋషుల కున్న ఇటువంటి పరమత సహన స్వభావమే ముస్లిమేతరులు అధిక సంఖ్యలో ఉండే గంగా లోయలో వారు విజయం సాధించడానికి దోహదపడింది. సూఫీల విజయం అంటే ఈ (రెండింటి) పరమత సహనం సాధించిన విజయమే అనవచ్చు.

విభిన్న మతాల మధ్య సూఫీతత్త్వం సహనాన్ని ప్రబోధించింది. వారి ఖనకాహ్‌లలో మత విశ్వాసాలతో/నమ్మకాలతో పనిలేకుండా అందర్నీ ఆహ్వానించేవారు. అందరి పట్ల విధేయత చూపేవారు. హిందూ, జైన యోగులతో కలిసి పోయేవారు. వారి సంభాషణల్లో, గానసభలైన 'సమా' లలో హిందవి భాషను వాడేవారు. ఇవన్నీ హిందూ-ముస్లిం మతాల మధ్య సంబంధాల్ని బాగా ప్రోత్సహించాయి.

అంతేగాక భక్తి ఉద్యమంలాంటి కాఠిన్యాన్ని తొలగించేందుకు తోడ్పడింది. భక్తి యోధులు, సనాతన మత గురువులు ఇస్లాంకు చెప్పే భాష్యంలో మార్పు తెచ్చి ఉభయమత సమాజానికి దోహదం చేసింది సూఫీ ఉద్యమం.

# సూఫీ ఉద్యమం - భక్తి ఉద్యమం

సూఫీ, భక్తి ఉద్యమాల మధ్య పరస్పర ప్రభావం వాటి మధ్య ఉన్న సామ్యాలను బట్టి అర్థమౌతుంది. ఏకేశ్వరోపాసన (1) మీద ప్రాధాన్యతని ఉంచటం, ఆధ్యాత్మిక గురువు (2) (పీర లేదా గురువు) మార్గదర్శి పాత్ర పై నమ్మకం ఉంచటం, భగవంతునితో (3) మార్మిక విలీనత పొందటం, మొ॥ వి రెండు ఉద్యమాలకూ ఉన్నాయి.

పైగా రెండు ఉద్యమాల సాధువులు తమ తమ మతాల్లోని సనాతన (4) ఆచారాల పట్ల విమర్శనాత్మక ధోరణి ప్రదర్శించారు.

~~ఉద్యమమంతటిలో~~ వర్తించే సామ్యాలున్నగాలే గాక ప్రాంతీయంగా కలిగిన ప్రభావం కూడా చెప్పుకోదగిందే! కాశ్మీరు లోని సూఫీలు రిషి సిల్‌సిలా (5) గా ఏర్పడటానికి భక్తి ఉద్యమం ఎంతో ప్రోత్సాహం ఇచ్చింది. 14 వ శతాబ్దానికి చెందిన ప్రఖ్యాత స్త్రీ భక్తి కవయిత్రి లాల్ దేద్ యొక్క non-conformist భావాలు ఈ రిషి సిల్‌సిలా ను స్థాపించిన షేక్ నూరుద్దీన్ వలి మీద ప్రగాఢ ప్రభావాన్ని కలిగించాయి.

సుల్తానత్ కాలంలో చిష్టీ సూఫీలు (1)

ప.సా. [illegible] /కు నాథపంథీ యోగులకు మధ్య గల

పరస్పర సమాగమాలకు పునాదులు వేసింది. 

ముస్లిమేతర వాతావరణంలో ఉన్నత గల చిష్తీల శక్తియుక్తులు సమ్మోహనం శక్తిని విడుదల చేసి సంస్కరణల మేలుకొల్పు సాధించారు. అలా చిష్తీలు ఎందరో హిందువులు మాట్లాడే భాష ఉర్దూ పద్యాల్ని కూడా రచించారు. చాలా హిందూ కవులు మార్మికంగా రచనల్ని ప్రాంతీయ (6) భాషల్లో రాయడానికి స్ఫూర్తి పొందారు. ఈ విషయంలో భక్తి ఉద్యమకారులు వీరికి ప్రేరణ నందించి ఉండవచ్చు.

14వ శతాబ్దం ద్వితీయార్థంలో రాసిన "చందా" రచన చాందాయన్ లో ముల్లా దావూద్

ప.సం. మార్మికతను హిందూ (4) పదాలకు, లౌకికతలతో మేళవించాడు. తర్వాత కాలంలో రాయబడిన సూఫీ కవిత సాహిత్యం ఇస్లాం లోని లౌకికమైన సూత్రాల్ని, సూఫీ పదజాలాన్ని, నాడు సమాజంలో ఉన్న ప్రజాదరణ పొందిన ప్రత్యేక - సామెతల్ని రంగరించి రాయబడింది. అందువల్లనే ఇవి మతపరమైన పల్లెల్లో వైరం మత కలహాలలో చెల్లుబాటై నిలిచాయి.

చిష్తీల 'సమా' లు సంగీత సంప్రదాయాలు వైరం సామరస్యం చెందడానికి దోహదం చేశాయి. "ఖవ్వాలీ", అమీర్ ఖుస్రో లో ప్రారంభమైనా

ఉత్సవాల్లో పెద్ద మొత్తంలో అలవర్చుకున్నారు.

వీరందరూ స్వతంత్రంగానే సూఫీ లు కూడా కొత్తగా తమ సిలసిలా నందు చేరిన వారికి గుండు గీయించే సంప్రదాయాన్ని కొనసాగించారు. ఇలాంటివే ఇన్ని నాటు ముస్లిం దేశాలలోని సూఫీ సిలసిలాలకు కేవలం పరిచయం కూడా లేని సంప్రదాయాల్లో భక్తి ఉద్యమ [7] ప్రభావంలో భారతీయ సూఫీలు కొనసాగించటం కన్పిస్తుంది.

సూఫీ గురువులు స్థానిక సందర్భాల నుంచి, స్థానిక శిష్యుల నుంచి అభినందనలను దేశీయ సంప్రదాయాలు-ఆచారాల ప్రకారమే అందుకునేవారు. దాంతో క్రమంగా ఇవి వారి వ్యవస్థలో అంతర్భాగమయ్యాయి.

* భక్తి ఉద్యమకారుల వలెనే సూఫీ సాధువులు కూడా వారి బోధనా పద్ధతులలో కొంతలో కొంత చాలా భేదాలు [8] కలిగి ఉండేవారు.

* భక్తి ఉద్యమ తత్త్వం, సూఫీ ఉద్యమ తత్త్వం రెండూ కూడా వేదాంత తత్త్వం అయిన అద్వైతం [9] మీదనే ఆధార పడి ఉన్నట్లుగా తోస్తాయి. సంపూర్ణ ఏకేశ్వరోపాసన రెండూ చెప్తాయి. (సృష్టికర్త అయిన) భగవంతుడు, (సృష్టించబడిన) ఆత్మ రెండూ ఒకే సంపూర్ణ వాస్తవం అని రెండు ఉద్యమాలూ నమ్మాయి.

* భక్తి ఉద్యమ కారులకైనా సూఫీ గురువులకైనా రెండూ చిష్టీ సూఫీల మరో ముఖ్యంగా సంగీతం (గాత్ర - వాయిద్య రెండూ) ఆధ్యాత్మిక పారవశ్యానికి మార్గం, భగవంతుని చేరేందుకు ఆరాధన సాధనం.

* భగవంతుడు! ప్రేమ రూపి [11] ఆధ్యాత్మికవాదులు రెండూ చెప్పారు.

* భక్తి సంప్రదాయవాదులు చిష్టీ సూఫీలు కూడా ప్రాపంచిక విషయాల్ని వదిలేశారు. ప్రపంచంలోని భౌతిక విషయాలపై దృష్టి పెట్టలేదు.

"తర్క్ ఇ దునియా" అంటే సన్యాస దృక్పథం జీవితం పట్ల విముఖులు కావటం, లేదా ప్రపంచ సంబంధాల్ని తెంచుకోవటమన్న అభిప్రాయం కాదు. అయితే సమకాలీన మార్మిక రచనలు దీన్ని తిరస్కరించాయి. మార్మికులు వదిలేసింది [12] ప్రపంచాన్ని కాదు. జీవితం పట్ల, జీవిత సమస్యల పట్ల భౌతిక దృష్టి ని మాత్రమే వారు ద్వేషించారు, వ్యతిరేకించారు. ఓ వ్యక్తి ఎంతగా భౌతిక విషయాల్లో మునిగి పోతాడో అతను ఆధ్యాత్మిక ఆకాంక్షల నుంచి అంతగా అంత దూరమై పోతాడు.

— K. A. Nizami

## సూఫీ ఉద్యమం పై విమర్శ:

సూఫీ ఉద్యమంలోని లోపాల్ని విస్మరించలేడు.

1) మతగురువు మీద విపరీత గౌరవాన్ని ప్రాధాన్యాన్ని ఇవ్వటం వల్లగా వారి భక్తుల్ని విగ్రహారాధన వైపు మళ్ళించింది. ముఖ్యంగా చాలా మత గురువుల మరణానంతరం అతని సమాధి గొప్ప పుణ్యక్షేత్రంగా మారి పోయింది.

2) గురువుని విధేయత చూపడమనే అంశం బానిస భావాలు పెరగడానికి కారణం అయింది. అందువల్లనే కొందరు సంచార సాధువులు, కలందర్లు ఖానకావారలని తీవ్రంగా వ్యతిరేకించారు.

3) సూఫీలు పుస్తకాలను అధికంగా చదవడం లేదా పాటుగా తత్వశాస్త్రాన్ని కూడా వ్యతిరేకించారు. సనాతన ఉలేమాలు, సూఫీలు తత్వవేత్తలలా సామాన్య శాస్త్రవేత్తలని కూడా చేర్చారు.

నిజాముద్దీన్ అవులియా శిష్యుల బఖాల్ రచన వృత్తి ఒక సంఘటన చెప్పాడు. పుస్తకాలను మోస్తున్న ఒక తత్వవేత్త ఒక ఖలీఫా ను చేరి చలనాలు 3 రకాలు చెప్పాడు — సహజ, వాలంటరీ, ఇన్వాలంటరీలు.

గాల్లోకి రాయి విసిరేస్తే అది కిందకి పడాలి, ఇది సహజ చలనం. ఇన్వాలంటరీ

చలనం మాటల నియంత్రణలా ఉండదు. దీనిపై
ఆధారపడి చెబితే అంతరిక్ష పదార్థాల చలనం
ఐన్‌స్టీన్ చలనం ఎక్కువవుతుంది అని ఆ శాస్త్రవేత్త
చెప్పాడు. షేక్ షహాబుద్దీన్ సుహ్రవర్ది తప్పనిసరి
ఆ ఖలీఫా వద్దకు డబ్బు తీసుకొనడానికి వెళ్లాడు.
అంతరిక్ష పదార్థాల ఐన్‌స్టీన్ చలన స్వభావానికి
కారణం భగవంతుడు ఆజ్ఞ ప్రకారం వర్తిస్తున్న
దివ్య / దేవ దూతల అద్భుత శక్తులే అని
షహాబుద్దీన్ నాకు చెప్పారు. పైగా శాస్త్ర
అంటూ అంతరిక్షానికి తరలి వెళుతున్న దేవదూతల్ని
అతీంద్రియ దృష్టి ద్వారా చూడడానికి యత్నించాడు.

ఈ విధంగా సూఫీల వలన
అద్భుతాలు, అతీంద్రియశక్తుల మీద వ్యామోహం
పెరిగి శాస్త్రాల మీద అనుమానాలు శాస్త్రవేత్తల
మీద అపోహలు పెరిగాయి, ఇట్టి అనుమానాల
పరిస్థితులలో ఆ శాస్త్ర మధ్య, పశ్చిమ ఆసియాల్లో
భారతంలోనూ అనేకం, సామాన్య శాస్త్రాలు వృద్ధి
చెందాల్సి వచ్చింది / చెందాయి.

# Historiography - Ziya-Ud-Din-Barani

## చరిత్ర రచన - జియాఉద్దీన్ బరానీ

13, 14 శతాబ్దాలలో భారతదేశం మంచి చరిత్ర రచనని చవి చూసింది. ఈ చరిత్ర రచనలో అమీర్ ఖుస్రు, ఇసామి, ఫిరోజ్ షా తుగ్లక్, షాయిబ్-సిరాజ్ అఫీఫ్ మొ॥ వారెందరో ఉన్నప్పటికీ చరిత్ర రచనలో ఈ కాలంలో అత్యంత ప్రసిద్ధుడుగా జియాఉద్దీన్ బరానీ నే చెప్పాలి.

మధ్యయుగ చరిత్రకారులందరిలో "తారీక్-ఇ-ఫిరుజ్ షాహి" ని రచించిన బరానియే అగ్రగణ్యుడు. రెవెన్యూ శాఖలోని రాజోద్యోగి కి కొడుకు. అందువల్ల రెవెన్యూ వ్యవహారాలపై లోతైన అవగాహన ఉంది. ఢిల్లీ లో చదువుకోవడం వలన ప్రభుత్వ ఉద్యోగాలు, సేవ చేస్తున్న రోజుల నుండి ప్రభువులు, పండితులు, నాయకులు కలుసుకునే అవకాశం దక్కింది.

బరాని మతాన్ని కచ్చితంగా విశ్వసించేవాడు, లౌకికత్వం పై అతనికి నమ్మకం లేదు.

జలాలుద్దీన్ పాలనా కాలం లోని ఘటనలు కళ్లారా చూశాడు, వాటినందుకే బాలా వివరంగా eye-witness

రాశాడు. అతనికి ఆర్థిక విశ్లేషణ కి సంబంధించిన అద్భుత నైపుణ్యం ఉన్నదని టారిఫ్‌లు, ద్రవ్యవిధానాల పై గల అవగాహన ద్వారా వెల్లడి అవుతుంది. ఇతనికి మంచి పరిశీలనా శక్తి ఉంది. [ఊరికే గణాంకాలు ఇవ్వడం కాక వాటిని వినియోగించి విశ్లేషణ చేయగల నేర్పు ఉంది.]

మహ్మద్ బిన్ తుగ్లక్ ఆస్థానంలో 17 ఏళ్ళ పాటు ఉండడం వల్ల ఆ సుల్తాన్ తో బరనీ కి దగ్గరి సంబంధం ఏర్పడింది. వాస్తవం మీద ప్రాధాన్యతని ఉంచి మధ్యయుగపు చరిత్రకారుల్లో ఇతడు చెప్పుకో- దగ్గ వాడు. మహ్మద్ బిన్ తుగ్లక్ పాలనా కాలాన్ని వివరించేటప్పుడు తేదీలను సరిగా ఇవ్వలేదు. కొన్ని చోట్ల పైపైన రాసి దాటుకున్నాడు. కొన్ని అస్పష్టంగా ఉన్నాయి.

బరనీ మొత్తం మీద వ్యాఖ్యాతలా ఉంది. చరిత్ర తన ముక్కుసూటిదనం, పిచ్చి కల్పనల ద్వారా పాఠకులని ఆకర్షిస్తాడు. కొన్ని చోట్ల విశ్లేషణ నిష్పక్షపాతంగా రచించాడన్నది కాదనలేని నిజం. ఇతని సమకాలీన రచయితల చేత కూడా బరనీ మిక్కిలిగా ఉదాహరించబడ్డాడు.

క్రీ.శ. 1370 లో రచింపబడిన ఒక అజ్ఞాత రచన గా "సిరత్-ఇ-ఫిరుజ్ షాహి" లభిస్తున్నది. ఇది ఫిరోజ్ షా తుగ్లక్ ఆదరణలో రచింపబడి ఉండవచ్చు. "ఫుతుహాత్-ఇ-ఫిరుజ్ షాహి" కి ఇది విస్తృత రూపంగా కన్పిస్తుంది. ఇందులో ఫిరోజ్ తుగ్లక్ కార్యకలాపాల్ని విస్తృతంగా పొగడడం కన్పిస్తుంది.

J. L. Mehta

"తారీక్-ఇ-ఫిరోజ్ షాహి", "ఫత్వా-ఇ-జహాందరి" ల రచయిత జియావుద్దీన్ బరాని నాటి సమకాలీన చరిత్రకారులందరిలో, లేదా మధ్యయుగ భారతదేశంలో గొప్పవాడిగా చెప్పవచ్చు.

మిన్హాజుస్ సిరాజ్ వలెనే ఇతడు కూడా ఉన్నత ప్రముఖుల కుటుంబంలోని వాడు. లోడి తురుష్క వలసదార్ల కుటుంబానికి చెందిన ఇతడు సౌభాగ్యసంపదల మధ్య, ఉన్నత కుటుంబాల ఆచారాల మధ్య ఢిల్లీలో పెరిగాడు.

మహ్మద్ బిన్ తుగ్లక్ కాలంలో రాజాస్థానంలో చేరి 17 సం॥ల పాటు ఆతని ఆశ్రయాన్ని పొందాడు. ఒక పండితునిగా సుల్తాన్ బరాని ని ఎంతగానో గౌరవించేవాడు. బరాని అమీర్ ఖుస్రు కు సన్నిహిత సహచరుడు. ఎంతో మంది రాజాస్థాన ప్రముఖులలో బరాని చొరవగా ఉండేవాడు. తన ఉన్నత సాంఘిక హోదా పట్ల బరాని కి పూర్తి చేతన ఉంది.

బరనీ "తారీఖ్ ఇ ఫిరోజ్ షాహీ"

క్రీ.శ. 1259 నుంచి 1359 వరకు అంటే ఒక శతాబ్ద కాలం పాటు సుల్తానుల చరిత్రను మనకు అందిస్తుంది. మిన్హాజ్ ఎక్కడ వదిలి పెట్టాడో బరానీ అక్కడ ఆరంభించాడు. అందువల్ల బరానీ రచన మిన్హాజ్ రచన "తబకాత్ ఇ నాసిరి" కి కొనసాగింపు అని చెప్పవచ్చు.

బరానీ రచనలో ఫిరోజ్ తుగ్లక్ ను గురించిన భాగం తప్ప తక్కినదంతా ప్రామాణిక చరిత్ర రచనయే అని చెప్పవచ్చు. ఈ యుగంలో ఉత్తమ చరిత్రకారుడుగా బరానీని నిల్పేది ఈ రచనా భాగమే. చరిత్ర రచనలో బరనీ తనకు మార్గదర్శకుడని తాను పేర్కొన్న మిన్హాజుస్ సిరాజ్ ను కూడా మించిపోయాడు.

మహమ్మద్ బిన్ తుగ్లక్ పాలనను గురించి బరానీ పేర్కొన్నది అస్పష్టంగా కన్పిస్తుంది. బరానీ 'కావాలని' విషయాలు, సంఘటనలు వక్రీకరించి విరూపకంగా (distorted) రాశాడు, పక్షపాత బుద్ధితో పేర్కొన్నాడు. బరానీ ఇతని "ఏడు గొప్ప పథకాల"ను కనీసం వాటి కాలక్రమంలో కూడా రాయలేదు. అంతేగాక ఈ పథకాలు చేపట్టడానికి కారణాలు రాయడానికి బదులు ఎంతసేపూ వాటి తీవ్ర పరిణామాలు

గురించి వర్ణించాడు. ప్రజలు పడ్డ బాధలు, సుల్తాన యొక్క
నిర్దాక్షిణ్య, క్రూర చర్యల్ని అతిశయించి చెప్పాడు. అయితే
ఈ పథకాలు ఏ కారణాల వలన విఫలమయ్యాయో
వాటిని మాత్రం వివరించలేదు, విశ్లేషించలేదు.

రచన

అలాగే ఫిరోజ్‌షా తుగ్లక్ ను
స్తుతి బరాని చేసిన రచన ఒత్తిడుల కింద
రచించ బడింది. రాజాస్థానం చేత నిరాదరణపాలై,
తన శత్రువుల చేత పాలించే చక్రవర్తి కి విరోధిగా
ముద్రించ బడిన క్లిష్ట సమయంలో బరాని ఒక
చరిత్ర కారుడిగా తన విధుల్ని పక్కకు పెట్టి సుల్తాన
ను ప్రసన్నం చేసుకొనేందుకు అతన్ని అతిగా పొగడడం
చేశాడు. అతని రచనకు పెట్టిన "తారిఖ్ ఇ
ఫిరోజ్ షాహీ" నిజానికి సరైన పేరు కాదు.
ఒక శాస్త్రీయ చరిత్ర కారుని గా బరాని గొప్పదనం
అతను మహమ్మద్ బిన తుగ్లక్, ఫిరోజ్ షాతుగ్లక్ ల
గురించి రాసిన దాన్ని బట్టి గాక అతడి ముందు
సుల్తానుల గురించి రాసిన భాగాన్ని బట్టి తెలుస్తుంది.

బరాని రచన కేవలం[1]
వర్ణనాత్మకమైనది కాదు, అది విశ్లేషణాత్మకమైంది
మరియు విమర్శనాత్మకమైంది. అతడు వివరాల

గురించి బాధ పడడు. రచనలు చదువుతూ రాజకీయ,
పాలన చరిత్ర ని ఏకమొత్తంగా పరిగణించి, ఒక
శాస్త్రీయ పద్ధతిలో చరిత్ర లోని ఏ కాలానికి చెందుతాయో
ఆ కాలపు లక్షణాలని వివరీకరిస్తాడు.] కొంత
విషయాల గురించి అతడు చేసిన చిన్న ప్రస్తావనలు,
లోతైన సంబంధాలు [cryptic references]
పాఠకుల బుద్ధి ఏ విధంగా పని చేస్తుందో, ఆ
యుగపు గొప్పలు, నిర్బంధాలు వివిధంగా తెలుసు
కోవడానికి గొప్పగా పనికి వస్తాయి.

Conclusion

[అతని ఆత్మాశ్రయ ధోరణి వలన
మత దృష్టి, వర్గ భావన, ఉన్నత వర్గ భావాలు,
అర్థంలేని కాలంలో అతని వ్యక్తిగత అనుభవాలు మొ॥
ఉన్న బరనీ ఒక నిజమైన చరిత్రకారుడిగా
ఆ విస్మరించగలగాడు. అతని వ్యక్తిగత లోటుపాట్లని
బాగా అర్థం చేసుకున్నారు అతని రచనల్ని మరింత
బాగా విశ్లేషించగలరు, అంచనా వేయగలరు.]
(evaluate చేయగలరు.)

[బరనీ మరో రచన అయిన
" ఫత్వా-ఇ-జహాందారి " ను " తారీఖ్-ఇ-
ఫిరోజ్ షాహీ " కి ఉపబంధమైనదానిగా
(Complementary) భావించారు. ఈ పుస్తకం లో

బరానీ తన పూర్వపు గ్రంథ విషయాన్ని సంగ్రహంగా చెప్పి సుల్తానత్ యొక్క రాజనీతి లాక్షణికాలను మాత్రం మరింత విస్తృతపరచి రాశాడు. ఇందులో అతడు చారిత్రక దృష్టికోణం లో వాస్తవ ఇస్లాం రాజరిక సిద్ధాంతాలు, విదేశీ రాజకీయ సంస్థలను ఢిల్లీ సుల్తానులు అలవర్చుకున్న తీరును, రెండు శతాబ్దాల కాలంలో భారతీయ పరిస్థితుల్లో అవి పొందిన తీవ్రమైన మార్పుల్ని వివరించాడు.

ఇంకా ఈ పుస్తకంలో సుల్తాన యొక్క అధికారాలు, విధులు; ప్రముఖుల యొక్క ప్రత్యేక హక్కులు; రాజ్య రక్షణ- భద్రతా సిద్ధాంతాలు; శాంతి- భద్రతల సమస్యలు; నేరాలు - శిక్షలు; మతము- రాజకీయాలు; సైన్యం యొక్క పాత్ర; సుల్తాన యొక్క గూఢచార విభాగాలు మొ॥ వి వర్ణించబడ్డాయి.

Read Barani's para in Persian lit answer page. 44

బరానీ చరిత్ర రచనలో అనేక ప్రమాదాలు చేశాడు. అతడు ఆస్థానాలకు, జైత్రయాత్రలకు, ~~అధికార నియామకాలకు~~ పరిమితం చేశాడు. తన నాటి పాలన, ఆర్థిక విషయాల్ని విస్మరించి విశ్లేషించాడు. తన నాటి వివిధ సాంఘిక వర్గాల మధ్య ఘర్షణల గురించి వివరంగా అందించాడు!

నాసిరుద్దీన మహమ్మద ఆధీనంలో

(1346-65) ఫక్రుద్దీన సునామి (ఆయిద),

చరిత్రకారుడైన మిన్హాజ్ ఉద్దీన జుర్జాని (మిన్హాజ్ సిరాజ్) గలరు. సిరాజ్ ఆది నుంచి క్రీ.శ. 1260 వరకు సాధారణ చరిత్ర రచనను పర్షియన్లో "తబకత్-ఇ-నాసిరి" పేర రచించాడు.

భారతదేశంలో అనేక నగరాలలో పర్షియన్ సాహిత్యంలో కొద్ది మార్పులు వచ్చాయి. వాటిలో "మసూద్ సద సల్మాన" (మరణం A.D. 1131) రాసినవి ముఖ్యమైనవి. ఇవి లాహోర్‌లో గల సంబంధాన్ని తెలిపే రచనలు. మొత్తం మీద ఢిల్లీ సుల్తానత్ ఏర్పడక ముందు భారత్‌లోని పర్షియన్ సాహిత్యం చాలా వరకు ఎరువు తెచ్చుకున్నట్టుగా సాహిత్య ప్రక్రియలు, రూపకల్పన శైలి మొదలైన ప్రాంతాలనుండే ఎరువు తెచ్చుకున్నట్లు కన్పిస్తుంది.

ఢిల్లీ సుల్తానత్ స్థాపించబడిన తర్వాతనే భారతీయ ప్రభావం పర్షియన్ సాహిత్యంపై పడజొచ్చింది.

## అమీర్ ఖుస్రూ చేసిన సేవ: [క్రీ.శ. 1253-1325]

[భారతదేశంలో పర్షియన్ సాహిత్య వృద్ధి దృష్ట్యా ఖిల్జీల పాలనా కాలం సువర్ణయుగం. ఈ కాలంలోని పర్షియన్ పండితుల్లో, కవుల్లో పేరెన్నికగన్న వాడు అమీర్ ఖుస్రూ.

"కవులలో రాజు యొక్క విహారం
కనిపించగానే అతని ముందు వారి
కవిత్వం ఎలా సూర్యుని ముందు నక్షత్రాల
వలె వెలవెల బోయింది"

— అని ఖుస్రూ కవిత్వాన్ని మొగలుల కాలం నాటి చరిత్ర కారుడు బదౌని స్తుతించాడు.]

దేశం వెలుపల కూడా ఆదరణ పొందిన రచనలు చేసిన అతికొద్దిమందిలో ఒకడు ఖుస్రూ. ఇతని అసలు పేరు అబుల్‌హసన్ (Abul Hasan). [1253-1325] ఢిల్లీ సమీపంలో గల పటియాలి లో జన్మించాడు. ఇతని తండ్రి టర్కీ వలసదారుడు. చిన్నతనంలో ఖుస్రూ తాతయ్య ఆలనాపాలనా చూసాడు. చదువు పట్ల ఆసక్తి, అన్ని విషయాలపై జిజ్ఞాస గలవాడు. నాటి గొప్ప సూఫీ గురువు షేక్ నిజాముద్దీన్ ఔలియా వద్ద సూఫీతత్వం నేర్చుకున్నాడు, వీరిద్దరూ మంచి స్నేహితులు కూడా. [ఖుస్రూ ~~[illegible]~~ బాల్బన్, కైకుబాద్, జలాలుద్దీన్ ఖిల్జీ, అల్లావుద్దీన్ ఖిల్జీ, ముబారక్ షా మరియు ఘియాసుద్దీన్ తుగ్లక్ లనే ఆరుగురు

సుల్తానుల వద్ద పనిచేశాడు.]

[ఖుస్రూ కవిత్వ వివేచన గల్గు భావుకత గలిగినది. అతడు ప్రతి పద్య ప్రక్రియను విజయవంతంగా నిర్వహించాడు. భారత్ లాంటి పర్షియన్ సాహిత్యానికి ఇతని రచనలు క్రొత్తదనం తెచ్చాయి. భారత్ సాహిత్యంతో పరిచయం పెరగడం, దాని ప్రభావం పర్షియన్ రచనలపై పడటం కన్పిస్తుంది.]

[ఖుస్రూ విస్తృతమైన, వైవిధ్య భరితమైన రచనలు.] అతడు దాదాపు 50 లక్షల పద్యాల్ని రచించినట్లు తెలుస్తుంది. [99 రచనల్ని అతడు చేశాడని తెలుస్తుంది.] అవి కావ్యం లో గేయం, ఇతిహాసం, గద్య కావ్యం మొ|| ల్ని రూపాలు ఉన్నాయి. [పర్షియన్ పద్ధతుల్ని ప్రక్రియల్ని వాడినా అతని కావ్యం భావజాలంలో మాత్రం సంపూర్ణంగా భారతీయమైనదే. దీనిద్వారా అతడు కొత్త పర్షియన్ శైలిని సృష్టించాడు — అదే "సబక్ ఎ హిందీ" (భారతీయశైలి) గా పిలవబడింది.]

[అమీర్ ఖుస్రూ రచనల్లో కొన్ని నిలిచాయి. సాహిత్యపరంగా విలువైన 5 రచనలు — "మట్లా ఉల్ అన్వార్", "షిరిన్ ఖుస్రూ", "లైలా మజ్ను", "అయినా ఇ సికందరి" మరియు

"హాస్త బిహిస్త్". వెంన్నాంటుని అతడు అక్కడిద్దిన 41

శిల్పికి బహూకరించాడు.

ఆయన 5 దివాన్లు (ఖుస్రూ యొక్క సంకలనాలు) - "తుహ్ఫతుల్ ఉస్ సిఘర్", "వస్తుల్ హయాత్", "ఘుర్రతుల్ కమాల్", "బకియ నకియ" మరియు "నిహాయతుల్ కమాల్." ఈ సంకలనాలు ఖుస్రూ యొక్క గొప్ప గేయ భావ (lyrical) కవిత్వ సామర్థ్యాన్ని చూపుతాయి.

ఖుస్రూ రాసిన చారిత్రక వర్ణనాత్మక పద్యాలు "మస్నవిస్" లు గొప్ప సాహిత్య, చారిత్రక విలువ గలవి. ఖుస్రూ వాస్తవంగా 'చరిత్రకారుడు' కాదు. అయితే ఆనుగుణమైనంత చిత్రాన్ని వివరంగా వాటి ఉండడం చేత, తన మస్నవీలను చారిత్రక కోణంలో ఉపయోగించడం చేత, ఆయన రాసిన చారిత్రక రచనలు చరిత్ర విద్యార్థులకు ఆసక్తిని కలిగించేవి. "కిరాన్ ఉస్ సదైన్" లో ఉదాహరణకు కైకుబాద్ & ఆయన తండ్రి బుగ్రాఖాన్ & మధ్య జరిగిన గొడవ, రాజీ కుదుర్చుకోవడం చెప్పబడ్డాయి. "మిఫ్తాహ్ ఉల్ ఫుతూహ్" లో జలాలుద్దీన్ ఖిల్జీ సైనిక విజయాలు వర్ణించబడింది. "ఆషికా"

లో ఖిజ్రఖాన కు దేవలరాణి కి మధ్య ప్రేమ
వర్ణించబడింది. "నుహ్ సిపెహ్ర్" లో సుల్తాన
ముబారక్ ఖిల్జీ పాలన వర్ణించబడింది (పద్యాల్లో).
ఈ రచనలో సమకాలీన సాంఘిక, మత పరిస్థితులు
కూడా వర్ణించబడ్డాయి. "తుగ్లక్ నామా" లో
ఘియాసుద్దీన్ తుగ్లక్ అధికారానికి వచ్చిన తీరు
వివరించాడు. "ఖజైన్ ఉల్ ఫుతూహ్" లో
అల్లాఉద్దీన ఖిల్జీ దక్షిణ దండయాత్రలు చెప్పబడ్డాయి.
అయితే ఖుస్రో ఆస్థానకవి కాబట్టి ఆయన
రచనల్లో అధికారిక దృక్పథమే ఉంది.

అమీర్ ఖుస్రో రచనల్లోని మరో
గొప్ప విషయం ఆయన దేశభక్తి.

"భారతదేశాన్ని నేను రెండు కారణాల
వలన పొగిడాను. మొదటిగా భారత
దేశం నా జన్మస్థలం, మరియు ఇది మన
దేశం. అందువల్ల దేశాన్ని ప్రేమించడం ముఖ్య
బాధ్యత .... హిందూస్థాన్ స్వర్గం
లాంటిది. దీని వాతావరణం ఖురాసాన్ కన్నా
మెరుగైంది ---- ఇది పచ్చగా ఉండి
ఏడాదంతా పూలతో ఉంటుంది ---

ఇక్కడ బ్రాహ్మణులు లక్షాధికారులు కోటీశ్వరులు ఉండరు. కానీ దగాల్లో ఎంతమంది ఉంటారు ఉన్నారు..... "

— అరుణ్ శౌరీ

హిందువులు ఎందరో ఉర్దూ రచనలు చేసి ఉర్దూ భాషాభివృద్ధికి పాటుపడ్డారు.

---

పర్షియన్ లో చరిత్ర రచనలు:

[సుల్తానుల కాలంలో పర్షియన్ సాహిత్యం చరిత్ర రచనకు గొప్ప సేవ చేసింది.] చాలా మంది చరిత్రకారులు తమ సమకాలీన చరిత్రని పర్షియన్ లో రాశారు. నాటి చరిత్ర కోసం ప్రధానంగా మనం రాజాస్థాన గ్రంథకర్తల మీద ఆధారపడాలి. అయితే వీరిలో చాలా పద్ధతులకు చెందిన కాలక్రమానికి చెందిన తప్పులు ఉన్నాయి. వృత్తిగత, పైస్థానాలకు నిష్ఠాపరులు వీరిలో ఎన్ని పాటలు చేసినప్పటికీ సుల్తానుల కాలపు చరిత్ర తెలుసుకోవటానికి వాటిని చదవడం తప్పనిసరి.

నాటి చరిత్రకారులలో ముఖ్యులు

మిన్హాజుస్ సిరాజ్ — తబకత్ ఇ నాసిరి

ఇసామి — ఫుతూహుస్ సలాటీన్

షామ్స్ సిరాజ్ అఫీఫ్ — తారీఖ్ ఇ ఫిరోజ్ షాహీ.

సుల్తానులలో ఫిరోజ్ షా తుగ్లక్ "ఫుతుహాత్ ఇ ఫిరోజ్ షాహీ" ని రచించాడు. బరనీ

పర్షియన్ లో సూఫీ సాహిత్యం:

సుల్తానత్ కాలంలో విస్తృతంగా "మల్ఫూజ్" "మల్ఫూజాత్" సాహిత్యం పర్షియన్‌లో వెలువడింది. పర్షియన్ రాయబడిన సూఫీ సాహిత్యం మౌలికంగా, సాహిత్య పరంగా కూడా విలువైనది. పర్షియన్ సాహిత్యం యొక్క వైవిధ్యభరిత స్వభావంగా "మాల్ఫుజత్" ప్రక్రియ (నాటి ప్రముఖ సూఫీ మతగురువుల సంభాషణలు) వెలువడింది. ఈ మాల్ఫుజత్ లలో ఉపదేశాత్మక కథలు మరియు వ్యాఖ్యానాలు కూడా ఉంటాయి. అమీర్ హసన్ సిజ్జీ ప్రఖ్యాత సూఫీ గురువు షేక్ నిజాముద్దీన్ ఔలియా యొక్క మాల్ఫుజత్ రచించాడు. ఇది "ఫవాయిద్ ఉల్ ఫౌద"గా ప్రసిద్ధి చెందింది. అలాగే సూఫీల జీవితం, బోధనలు, అద్భుతాల గురించి ప్రజల్లో బాగా పెరగడంలో తర్వాతి కాలంలో కొన్ని కల్పిత మాల్ఫుజత్‌లు కూడా వెలువడ్డాయి. మీర్ ఖుర్ద్ యొక్క "సియారుల్ ఔలియా" లాంటి భారతీయ సూఫీల జీవితచరిత్రలు ఉన్నాయి. ఖైరుల్ మజాలిస్ యొక్క మాల్ఫుజత్ షేక్ నాసిరుద్దీన్ చిరాగ్ కు సంబంధించినది. ఈ రచనలు సమకాలీన సామాజిక స్థితిగతులను కూడా ప్రతిబింబిస్తాయి, ఆధ్యాత్మిక విషయాలే కాకుండా.

## పర్షియన్ లోనికి అనువదించబడిన రచనలు :

Ziau నక్షబాబి (d. 1350) ఒక బలికి

పర్యటనకి వెళ్లిన భర్త భార్యకి చెప్పిన సంస్కృత కథల్ని పర్షియన్ లోనికి అనువదించి అనువాదాలకి శ్రీకారం చుట్టాడు. ఇదే "తూతీ నామా" (Book of the Parrot) గా ప్రసిద్ధి చెంది టర్కిష్ పర్షియన్ నుండి మిగతా భాషల్లోకి అనువదించబడింది. ప్రాచీన భారతీయ గ్రంథం కోక శాస్త్రం (Kok Shastra on sexology) కూడా పర్షియన్ లో రాయబడింది. ఫిరోజ్ షా తుగ్లక్ కాలంలో ఎన్నో వైద్య, సంగీత, సంస్కృత గ్రంథాలు పర్షియన్ లోనికి అనువదించబడ్డాయి. కాశ్మీర్ కు చెందిన సుల్తాన్ జైనుల్ అబిదీన్ రాజతరంగిణి తో పాటు రచనలు మహాభారతాన్ని పర్షియన్ లోనికి అనువదింపజేశాడు.

## ఇతర ప్రసిద్ధియైన కవులు :

అల్లావుద్దీన్ ఆస్థానంలోని మరో కవి ఖ్వాజా నజ్మొద్దీన్ హసన్. అతని సరళమైన, సౌందర్యమైన ఘజళ్ళు అతనికి "హిందూస్థాన్ యొక్క సాది" అనే బిరుదు తెచ్చి పెట్టాయి. ఈ నజ్మొద్దీన్ హసన్ చేతనే నిజాముద్దీన్ ఔలియా బోధనలు కాలక్రమంగా క్రీ.శ. 1307 నుండి 1322 వరకు "ఫవాయిద్ ఉల్ ఫౌద్" పేర గ్రంథీకరించబడ్డాయి. సూఫీ విషయాలలో ఇది ప్రామాణిక గ్రంథంగా చెప్పవచ్చు. ఈ కవి యొక్క కవి కల్పనాశక్తిని బరాని గొప్పగా మెచ్చుకున్నాడు.

అల్లావుద్దీన్ కాలంలోని ఇతర ప్రసిద్ధియైన కవులు సద్రుద్దీన్ అలీ, ఫక్రుద్దీన్ కవ్వాస్, హమీదుద్దీన్ రాజా, మౌలానా ఆరిఫ్, అబ్దుల్ హకీం, షిహాబుద్దీన్ సద్ర నశీన్ మొ|| వారు ప్రసిద్ధులు.

మహమ్మద్ బిన్ తుగ్లక్ ఇబ్న్ బటూటా కి ఆశ్రయం ఇచ్చాడు. జియావుద్దీన్ బరానీని ప్రోత్సహించాడు. ఇతని ఉదారతకు ఆకర్షింపబడి Chach నుండి బద్రుద్దీన్ మహమ్మద్ భారత్ కు వచ్చాడు. ఇతడు సుల్తాన్ ని తన కవితల్లో స్తుతించాడు. 30,000 పద్యాలలో షానామాను రాశాడు. ఇందులో సుల్తాన్ దిగ్విజయ యాత్రలు వర్ణించబడ్డాయి.

కేటాయించి, కృషి చేయడం వలన ఇస్లాం మత

తత్వాలు, భావాలు భారతదేశంలో ప్రబలడానికి కారణం

అయ్యాయి. [పరస్పర సహన భావం ముస్లిం సాధువుల

పట్ల ప్రత్యేకించి ముస్లిం మార్మికవాదుల పట్ల హిందువులు చూపే

భక్తి భావం వలన వెల్లడవుతుంది. అలాగే ముస్లింలు కూడా

హిందూసాధువుల్ని గౌరవించడం మొదలు పెట్టారు. ఈ పరస్పర

సహన భావన ఫలితంగా వారిద్దరూ కలిసి పూజించే

"సత్యాపీర్" (నిజమైన సాధువు) ఏర్పడ్డారు. ఈ సహనభావమే

అర్థాలు కాలంలో మత మార్పిడి పొందిన హిందువులు తిరిగి

తమ మతంలోకి రావడానికి దోహదం చేసి ఉండవచ్చు.]

హిందూ-ముస్లిం [illegible] వర్గాల మధ్య

తరచుగా మతాంతర (కులాంతరం) వివాహాలు జరుగుతుండడం కూడా

రెండు మతాల మధ్య సామరస్యానికి దారితీసి ఉండవచ్చు.

ఈ మతాంతర వివాహాలు బలవంతంగా చేయబడిన

వాటిపై తప్పనిసరిగా రుద్దబడినవి అయినప్పటికీ

[కాలక్రమంలో ఇవి రెండు వర్గాల మధ్య వైరం తగ్గేందుకు

ఒకరి సంప్రదాయాలు మరొకరి ఆచార విధానంలోకి

ప్రవేశించేందుకు దోహదం చేశాయి.] ఈ సామరస్యం,

సహకారం రాజకీయ పాలనా వర్గం లోకి కూడా వెళ్ళింది.

స్థానిక స్వపరిపాలన లోపల రాజ్యం

లౌకికవాద భావం ఓ ప్రస్థానం

స్వపరిపాలన ఉండా దాన్నలతో ఉంచి ఉంటే హిందూ
గ్రామ పెద్దల్ని, గ్రామ ఖాతాలు రాసేవాళ్ళ లేకుండా ఉంచటం
చేశారు. అంతేగాక ముస్లిం పాలకులు హిందువుల్ని
కూడా ప్రభుత్వ సర్వీసుల్లో చేర్చుకున్నారు, పైగా
సమర్థులైన హిందువులకు ఉన్నత పదవులు కూడా ఇచ్చారు.
అందువల్లనే బీజాపూర్ కు చెందిన ఇబ్రహీం ఆదిల్షా
ను తన (ముస్లిం) ప్రజలు తను తన రాజ్యంలోని
హిందువుల పట్ల చూపిన ఆదరణ గాంచి "జగద్గురు"
అని కీర్తించారంటే ఆశ్చర్యమనిపించదు. అదేరీతిలో
హిందూపాలకులు తమ పౌర, సైనిక పాలనలో
ముస్లిములను నియమించారు. విజయనగర పాలకులు
రెండవ దేవరాయల కాలం నుంచీ తమ సైనిక పదవుల్లో
ముస్లిములను నియమించేవారు. రాణాసంగ తాను బాబరు
తో యుద్ధం చేసేటప్పుడు అతని కింద ముస్లిం సైనిక
దళం ఉంది. ఈ నియామకాలు రాజకీయ ఒత్తిడులవల్ల
(లే) రాజకీయ కారణాల వలన చేసినా లేదా
సహృద్భావంతో చేసినా ఇవి హిందూ ముస్లింల
మధ్య సంతృప్త వాతావరణానికి తద్వారా మిశ్ర
సంస్కృతి కలగడానికి దోహదం చేశాయి.

ఈ రెండు సంస్కృతుల సమ్మేళనం ఎంత విశేషంగా జరిగిందంటే బాబరు భారత దేశానికి వచ్చినప్పుడు ఇతడు " హిందూస్థానీ విధానాన్ని " గుర్తించాల్సి వచ్చింది.

" మానవ చరిత్రలో ఇటువంటి అద్భుతదృశ్యం అరుదుగా మాత్రమే చూస్తాం. రెండు విశాల, బాగా వృద్ధి చెందిన అయినా తీవ్రంగా భేదాలు చూపే మహమ్మదీయ, హిందూ నాగరికతలు కలియడం / కలవడం, కలసి సమ్మేళనం పొందడం అన్నదే ఆ అద్భుతదృశ్యం. వారి మధ్య ఉన్న వైరుధ్యాలు, వారి సంస్కారము-మతాలలో ఉన్న భిన్నత్వం వాటి ప్రభావం యొక్క చరిత్ర ని విశేషంగా జ్ఞాన బోధన చేయుదానిగా మలుస్తాయి "

— జాన్ మార్షల్

## (E) సంగీతం లో పరస్పర ప్రభావం - మిశ్ర సంస్కృతి

పరస్పర ఆదానాలు, సమ్మేళనాభావాలు

కేవలం మతాచారాలు, నమ్మకాలు, (B) వాస్తు, (C) సాహిత్యాలకి మాత్రమే పరిమితం గాక కళలకి కూడా వ్యాపించాయి. ముఖ్యంగా సంగీతం లో ఈ మిశ్ర సంస్కృతి స్పష్టమైంది.

తురుష్కులు మన దేశానికి వచ్చినప్పుడు వారితో పాటుగా కొత్త సంగీత పరికరాల్ని - రబాబ్, సారంగి మొ॥ వాటిని; కొత్త సంగీత పద్ధతులు, నియమాలను తీసుకొచ్చారు. దర్బారులలో ఖిల్జీల ఆస్థానంలో ఉత్తర భారతీయ సంగీతం, భారతీయ సంగీత విద్వాంసులు ఇరాన్ సంగీతాభివృద్ధిని ప్రభావితం చేసి ఉండవచ్చు. ఏమైనా శాస్త్రీయ సమ్మేళనం సుల్తానుల పాలన లో భారతదేశం లోనే జరిగింది.

ఈ సమ్మేళన ఫలితంగానే ఖుస్రూ నూతన సంగీత ప్రక్రియ "ఖవ్వాలి" ని ప్రవేశపెట్టినట్లు తెలుస్తుంది.

ఫిరోజ్ షా తుగ్లక్ కాలంలో ఈ సమ్మేళనం బాగా జరిగింది. "రాగదర్పణ్" అనే భారతీయ ప్రాచీన గ్రంథాన్ని ఇతని పాలనా కాలంలోనే పర్షియనులోకి అనువదించారు. సంగీత సభలు సూఫీల ఖానాల నుంచి ప్రభువుల భవంతుల దాకా వ్యాపించాయి.

జౌనపూర్ పాలకుడు సుల్తాన హుస్సేన షర్కీ

సంగీతాన్ని గొప్పగా ఆదరించాడు. సూఫీ సాధువు పీర్ బోధన్ నాడు తెండన గొప్ప సంగీతవిద్వాంసుడని తెలుస్తుంది. గ్వాలియర్ కు చెందిన రాజా మాన్ సింగ్ గొప్ప సంగీత ప్రియుడని తెలుస్తుంది. అతని హయాంలోనే ముస్లిములు పరిచయం చేసిన నూతన సంగీత పద్ధతులు, హిందుస్థానీలోకి కూడా కలిపి రచించిన "మన కౌతుహల" అనే సంగీత గ్రంథం వెలువడింది.

కాశ్మీరులో పర్షియన్ సంగీతం చాలా చెప్పుకోదగినంతగా ప్రభావితం అయిన ఒక నూతన వైవిధ్య భరితమైన సంగీతశైలి వృద్ధి చెందింది.

## సంస్కృతుల పరస్పర ప్రభావం - మిశ్రమ సంస్కృతి

క్రీ.శ. 1290లో ఖిల్జీల పాలన ప్రారంభమవ్వడంతో దేశపాలనలో ముస్లిముల పరభుత్వాధిపత్యం అంతమైంది. ఖిల్జీలు మొదటికాలం భారతీయ ముస్లింలు. వీరి పాలనలో భారతీయ ముస్లిములతో పాటు హిందువులకు కూడా రాజ్యోద్యోగాలు ఇవ్వడం మొదలు చేశారు. క్రమేణా సంబంధ బాంధవ్యాలకు అవకాశం ఏర్పడింది. మహమ్మద్ బిన్ తుగ్లక్ కూడా ఇదే మాదిరిగా ప్రవర్తించాడు. ఫిరోజ్ తుగ్లక్ హిందువుల పట్ల విధానాలలో ఉన్నప్పటికి అతడు చేపట్టిన చర్యల ద్వారా, పేద ప్రజోపయోగ చర్యల వల్ల ముస్లిం పేదలతో పాటు హిందూ పేద ప్రజలు కూడా లాభపడ్డారు.

ఈ విధంగా 14 వ శతాబ్దం - ఖిల్జీల, తుగ్లకుల పాలనలో చరిత్ర మలుపు తిరిగింది. భారతీయ హిందూ సంస్కృతుల అభివృద్ధిలో ఇది గొప్ప మైలురాయి. వలస వచ్చిన ముస్లిములు, స్వదేశీ హిందువుల మధ్య ఘర్షణ మొదట స్థాపితమై తర్వాత పరస్పర సహకారానికి దారి తీసినాయి. ఇది క్రమంగా ఒకరిలో ఒకరు కలవడానికి

1M

ఇచ్చిపుచ్చుకోడానికి దోహదం చేసింది. ఇలాగ విధంగా 57 ముందుగానే ఈ రెండు సంస్కృతుల సమ్మేళనానికి కారణ భూతమయ్యే శక్తులు జనించాయి.

తర్వాతి కాలంలో ప్రముఖ సుల్తానత్ పతనం చెందటం, నాశనమైపోవటం అనేది అపాయ కరం కాక పోగా సాంఘిక-సాంస్కృతిక శక్తుల సమ్మేళనానికి మంచి ప్రోత్సాహాన్ని ఇచ్చింది, హిందూ-ముస్లిం సంస్కృతులు పరస్పరాధారితాలు కావడానికి కారణం కూడా అయ్యింది. ఎందు కంటే ఢిల్లీలో కేంద్రీకృత అధికారం పతనం కావటం అనేది ముస్లిముల రాజకీయాధికారం వికేంద్రీకరింపబడటానికి మరియు మొదటిసారి కొత్తల రాజధానులకు ప్రాంతీయ కేంద్రాలుగా ప్రాబల్యం రావడానికి కారణమైంది. అప్పటి సుల్తానత్ ప్రావిన్సులు సుల్తానత్ పతనానంతరం ప్రాంతీయ ముస్లిం రాజ్యాలు గా మార్పు పొందాయి. దీంతో 15 వ శతాబ్దం కల్లా ఇస్లాం ను సాంఘిక సాంస్కృతిక శక్తి గా సమృద్ధిగా భారతీయులంతా పొంది ధారాళగడ్డ లా బాగా వేళ్లూనుకొంది.

ముస్లింలు భారత సమాజంలో అంతర్భాగం

IMP అయ్యారు. ఇకమీదట భారత సమాజం హిందూ లేదా ముస్లిం సమాజం కాదు, అది భారత సమాజం మాత్రమే! హిందూ ముస్లిం సంస్కృతి ప్రాచీన భారతీయ లేదా హిందూ సంస్కృతులలో విలీనం పొందింది, ఈ మార్పును భారతీయ సమాజం సహజంగా అంగీకరించింది.

ప్రాంతీయ ముస్లిం రాజులు, ప్రముఖుల
వద్దను చాలా వరకు రక్తం, ఆలోచన, ధోరణులని
భారతీయులే. వారిలో తెలివైన కొంది మాత్రమే తమ
విదేశీ వారసత్వాన్ని చెప్పుకోవడం, తద్వారా సాధారణంగా
ఉన్నత స్థానాన్ని సంపాదించుకోవడం చేసేవారు. ప్రతి విధాలా
వారు భారతీయ ముస్లింలే.

15 వ శతాబ్దంలో చాలా మంది
ప్రాంతీయ, ప్రావిన్షియల్ పాలకులు హిందువులైనా,
ముస్లింలైనా విజ్ఞానవంతులు, ఉదారతగల పాలకులు.
వీరు తమ ప్రజల సంక్షేమం, సంతోషం కోసం పనిచేస్తూ
వారి మంచితనాన్ని, క్షేమాన్ని గొప్పగా చూరగొన్నారు.
వారు ఏ జాతి మత పక్షపాతం లేకుండా పండితుల్ని,
కళాకారుల్ని ఆదరించేవారు. తమ సమాజాల యొక్క
సాంఘిక, సాంస్కృతిక, వైదిక, భౌతిక పురోభివృద్ధి కోసం ఎంతో
సహాయపడేవారు.

హిందూ-ముస్లిం సమాజాల సంస్కృతుల
తొలి ముఖ్య ప్రతినిధిగా నిలిచే అమీర్ ఖుస్రూ ఖిల్జీ,
తుగ్లక్ల పాలనా కాలంలో ఉన్నాడు. హిందూ, ముస్లింల
సామాన్య సాహిత్య వారసత్వం అయిన ఉర్దూ హిందూ-ముస్లిం
సంస్కృతుల సమ్మేళనానికి ప్రతిసాంస్కృతిక ప్రాతినిధ్యం
వహించింది. ఆ ఉర్దూ భాష ఈ కాలంలోనే

జరిగింది. ఢిల్లీ సుల్తానులు మంచి భవన నిర్మాతలు. వారి భవనాల వాస్తు విధానం ఇస్లాం, ప్రాచీన భారత పురాతన సంప్రదాయాలు - విధానాల మధ్య నిరంతర సంబంధ బాంధవ్యాల్ని, సమ్మేళనాన్ని విశదం చేస్తుంది. ఇవి ఆరోగ్యకరమైన, నిర్మాణాత్మకమైన రీతులలో రెండు కళా శైలుల మధ్య జరిగిన ఇచ్చిపుచ్చుకునే ధోరణికి సూచికలు.

- భక్తి ఉద్యమకారులు, సూఫీ సాధువులు ఈ కాలంలో సాంఘిక-మత సంస్కరణల్ని, హిందూ ముస్లిం ఐక్యతని చేపట్టారు. వారు సాంఘిక-సాంస్కృతిక స్థాయిలో రెండు మతాల మధ్య ఉన్న ఖాళీని పూరించటానికి ప్రయత్నించారు. అదనంగానే 14, 15 శతాబ్దాలలోని రాజకీయ చరిత్రకు ఈ కాలంనాటి ఇండో-ముస్లిం సమాజం యొక్క సాంఘిక-సాంస్కృతిక అభివృద్ధి ఎక్కువ ఆకర్షిస్తుంది.

# * LINGAYATS *

[లింగాయతులు అన్న పదాన్ని ఏ శైవులైతే తమ శరీరం పై ఇష్టలింగాన్ని - లింగాయతుల పూజా సాధనం ను ధరిస్తారో వారికి ఉపయోగిస్తారు. వీరికి వీరశైవులు కూడా అంటారు. వీరు 12 వ శతాబ్దంలో కర్ణాటక లో ముఖ్యంగా మైసూరు ప్రాంతంలో అంతవరకు ఆ దేశంలో ప్రముఖ స్థానంలో ఉన్న జైన మతాన్ని తోసిరాజని లింగాయతులు ప్రాముఖ్యాన్ని సంపాదించారు.]

లింగాయతుల మతం పేరు వీరశైవం ఐదు గొప్ప మతాచార్యుల లో విశ్వాసముంచుతారు. వారు రేణుక, దారుక, ఘంటకర్ణ, ధేనుకర్ణ, మరియు విశ్వకర్మ. సంప్రదాయం ప్రకారం ఈ ఐదుగురు మతాచార్యులు పరమశివుని యొక్క ఐదు ముఖ అవతారాలు అంటే - సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష మరియు ఈశాన [earthly manifestation]. ఈ ఐదుగురు ఆచార్యులు [కలియుగంలో రేవణసిద్ధ, మరుళసిద్ధ, ఏకోరామ, పండితారాధ్య మరియు విశ్వారాధ్య) అనే అవతారాలు గా వచ్చారని చెబుతారు. వీరు ముఖ్యంగా ప్రాచీన లింగాయతుల పద్ధతిని ప్రభావించారు. వీరిని ("పంచాచార్యులు"

బోధించారని అంటారు. "స్వాయంభువ ఆగమము" వీరి అవతారాలకు సంబంధించిన వివరాలు తెలుపుతుంది. వీరు దేశంలో 5 మఠాలు పెట్టారు, అవి కేదార ఉజ్జయిని, శ్రీశైలం, రంభాపురి మరియు బెనారస్లలో ఉన్నాయని చెబుతారు. ఈ మఠాలకు వీరశైవ ప్రచారం చేసే కార్యక్రమాలు అప్పజెప్ప బడ్డాయి.

లింగాయతులు సాధారణంగా ఆగమాంతలో ఒక దశగా చెప్పబడుతుంది. ఈ శైవ సంప్రదాయాలకు ఇతర సంప్రదాయాల వలెనే శైవ ఆగమాలు ప్రామాణికంగా ఉండడం అనేది కారణం. అందుకే ఆగమాలను వైదికములుగా బోధించే గ్రంథాలుగా పరిగణిస్తారు.

వీరశైవులు 63 శైవ మూర్తుల తమిళ నయనార్ల ద్వారా భక్తిని వెల్లడిస్తారు. వీరిని అనంతర మధ్యయుగ సాధువులలో వేరు పద్దతి గాను పురాతనులు అంటారు. వీరి రచనలను దివ్య ప్రేరణ గలవిగానే భావిస్తారు.

మధ్యయుగ సాధువులను పురాతనుల భిన్నంగా "నూతన పురాతనులు" అంటారు.

వీరు దాదాపు 770 మంది దాకా చెప్పబడ్డారు. వీరందరూ 'బసవ' అనే ముద్రనామాలు ~~అంటారు~~.

బసవ జైన మత భ్రష్టుడు. అయినా వీరశైవంలో మాత్రం చరిత్ర ప్రసిద్ధుడు. అతను వీరశైవ స్థాపకుడు కాడు కేవలం దానిని పునరుద్ధరించినవాడే. అయినా ప్రాముఖ్యం (కర్ణాటకలో లింగాయతను ప్రసిద్ధం చేసినవాడు బసవడే.) సంప్రదాయం ప్రకారం ఇతడు బాగేవాడి (బీజాపూర జిల్లా) లో మాదిరాజ, మదలాంబికలకు జన్మించాడు. అతని బాల్యం కప్పడిలో గడిపాడు. ఇది కృష్ణ, మలప్రభల సంగమస్థానం వద్ద ఉంది. ఇక్కడ బసవనికి వీరశైవ పునరుద్ధరణకై కృషి చేయాల్సిందిగా దివ్య సందేశం అందిందని చెప్తారు. బిజ్జలుని బసవడు ప్రధాన మంత్రి కావటం (1156-68), అతని సోదరిని బిజ్జలుకిచ్చి పెళ్ళి చేయటం, బసవ తలపెట్టిన కార్యానికి సాయపడ్డాయి. ఈ కార్యంలో అతనికి తన మరో సోదరి కొడుకైన చెన్నబసవని సాయం బాగా లభించింది. ఈ వీరశైవ వ్యాప్తిని ప్రబోధించిన గురువులు జంగములు. (బసవ వీరశైవాన్ని వ్యాప్తి చేయటానికి ఈ జంగముల బోధనల్ని సాధనాలుగా వాడుకున్నాడు.)

(లింగాయతులు ~~[illegible]~~ ఉత్తర దేవాలయాల్లో విగ్రహారాధన గురించి ఆలోచించలేదు. అలాగే అగ్నికి బలులర్పించడం మొదలైన వాటిని

అంగీకరించలేదు. బ్రాహ్మణ గాయత్రి కి బదులుగా వీరు శివ గాయత్రి ని పఠించారు. ఈ వీరశైవం యొక్క అన్ని భావాలు సంస్కరణల రూపంలో ఉంటాయి. ఉపనయనం స్థానంలో వీరశైవులు దీక్షా ఉత్సవం బాలికలకు కూడా చేస్తారు. స్త్రీలు పెళ్లి ప్రయత్నాల మొదటిగానే లింగాన్ని ధరించాలి. విధవలు తిరిగి వివాహం చేసుకోవచ్చు. స్త్రీలను వారి నెలసరి ఋతుక్రమ సమయంలో మైల పడ్డట్లుగా భావించే వారు కారు. బ్రాహ్మణులు నిర్దేశించిన సాంఘిక భావాల్ని వీరశైవులు వ్యతిరేకించటం వలన అది బ్రాహ్మణులకు కోప కారణం అయింది. అయితే వీరశైవుల ఉదారత వల్ల వారు సమాజం లోని కింది తరగతుల వారి మద్దతును గెలుచుకున్నారు.

వీరశైవుల తత్త్వాన్ని / సిద్ధాంతాలను "శక్తి విశిష్టాద్వైత" అంటారు, అంటే శక్తి విశేషణాలున్నట్లుగా భగవంతుని అద్వైతతత్త్వం. (the non-duality of God as qualified by Sakti) దీన్ని వివరంగా చెబితే ఆత్మ, భగవంతుని మధ్య ద్వైత భావమేది లేదు, ప్రతిదీ

శక్తి చేత అర్హత పొందినదే. వీరశైవ తత్త్వమనేది నిజానికి భేదాభేద (భేద + అభేద) సిద్ధాంతానికి చెందింది. [doctrine of difference-cum-nondifference] ఆత్మ శివునితో సమానంగా భావించబడింది, ఎందుకంటే ఆత్మ శివుని నుంచే జనిస్తుంది, శివుని శక్తిలో భాగం పొందుతుంది, చివరికి అంతిమ విశ్రాంతిని ఆనందాన్ని పొందుతుంది. ఇది "అభేద" భావనకి సంబంధించింది. అయితే ఆత్మ శివుని నుంచి భిన్నమవుతుంది కూడా, ఎందుకంటే ఆత్మ అది శక్తిలో భాగం పొందినప్పటికీ శివుని వలె సర్వజ్ఞత్వము/ సర్వవ్యాపిత్వము | అన్నిటిలో ఇమిడి ఉండడము ; సర్వశక్తిత్వము లను ఆత్మ కలిగి లేదు. ఇది "భేద" భావనకి సంబంధించింది.

వీరశైవ పద్ధతి ప్రకారం ఆత్మ యొక్క అంతిమ ధ్యేయం పరమాత్మ లో ఐక్యం పొందడమే. ఈ అంతిమ దశ అనుభవాన్ని శాస్త్రీయంగా చెబితే ("లింగాంగ-సామరస్య") అంటారు, అంటే లింగానికి (శివునికి) అంగానికి (ఆత్మకి) మధ్య అభేదము| అనన్యత | తాదాత్మ్యత అని అర్థం.

లింగాయతులు భగవంతుని మీద ప్రేమకి ప్రాధాన్యతని ఇచ్చారు. మానవ జీవిత ధ్యేయాన్ని దేవునిపై ప్రేమ, భక్తి ల ద్వారానే సాధించగలమని నమ్మారు. వీరశైవులు గురువుకి అధిక ప్రాధాన్యత నిచ్చారు. ఉపవాసాలు,

విందులు, ఉత్సవాలు, తీర్థయాత్రలు మొ॥ వాటిని (నిరసించారు; వ్యతిరేకించారు)

వీళ్ళు బౌద్ధ, జైన మతాల్లాగే బ్రాహ్మణులను తీవ్రంగా వ్యతిరేకిస్తారు, అలాగే వారికి చెందిన సాంఘిక వ్యవస్థల్ని కూడా బహిష్కరిస్తారు. వీరశైవులు మానవ సమానత్వాన్ని ప్రబోధించారు. కుల వ్యవస్థ ను ఖండించారు. వీరశైవమంలో చేరిన వారంతా కలిసి భుజించాలి, కులాంతర వివాహాలు చేసుకోవచ్చు / చేసుకోవాలి, ఏకమత్యంగా జీవించాలి. వీరు బాల్యవివాహాల్ని అంగీకరించలేదు. విడాకులని అనుమతించారు. విధవలను గౌరవం తోనే చూసేవారు, విధవల వివాహం వీరశైవులు అంగీకరించారు.

లింగాయతం కూడా ఇతర శైవ సంప్రదాయాల వలెనే 28 శైవ ఆగమాల మీదనే ఆధారపడింది. శివుడే సర్వోన్నత దైవం, కేవలం అతన్ని ఆరాధించాలి, ఇదే వీరి తత్త్వం. అందువల్లనే వీరిని "వీరశైవులు" అన్నారు. అంతేగాక ప్రతి ఒక్కరూ వారు ఎన్నుకున్న 'గురువు' ను కూడా ఆరాధించాలి.

# * Bhakti Schools in the South *

## 13th and 14th centuries

### శ్రీ వైష్ణవులు :

11 వ శతాబ్దికి చెందిన రామానుజాచార్యుడు సర్వ జనులు భక్తి ద్వారా మోక్షం సాధించవచ్చునని చాటాడు. ఇతడు విశిష్టాద్వైతవాదాన్ని స్థాపించాడు. శంకరుని మాయావాదాన్ని ఖండించి సద్గుణోపాసనను గూర్చి ప్రచారం చేశారు. శూద్రులతో సహా అన్ని కులాల వారికి భక్తి మార్గం ప్రబోధించాడు.

(3) రామానుజుడు మోక్షానికి భగవంతుని గూర్చిన జ్ఞానం కంటే అతని దీవెనలు ముఖ్యమైనవని తలచాడు. అన్ని కులాల వారికీ ఈ భక్తి మార్గాన్ని అతడు ప్రబోధించాడు. ఆళ్వార్లు, నాయనార్లు ప్రపత్తి పద్ధతాన్ని విశ్వసించేవారు. కానీ రామానుజుడు మాత్రం భక్తి ని వేద సంప్రదాయాలతో మిళితం చేయ ప్రయత్నించాడు. ఈ విధంగా చూస్తే రామానుజుడు ఇటు భక్తి మార్గాన్ని ప్రతిపాదించిన ప్రజా ఉద్యమం, భగవంతునికి పూర్తిగా అర్పించుకోవటానికి (ప్రపత్తి) అటు వేదాల మీద ఆధారపడిన ఉన్నత కులాల వారి ఉద్యమానికి మధ్య 'వారధి' గా

నిలుస్తాడు. రామానుజుడు ఈ విధంగా ప్రజల మతంలను, భగవంతుని పట్ల గల దృష్టిలను, ఆతని తో మనిషికి గల సంబంధంలను ముఖ్యమైన మార్పులు తెచ్చిన భక్తి ఉద్యమానికి నిజమైన మార్గదర్శకుడిగా ఉన్నాడు.

(1) రామానుజుడు (1017 - 1137)

మద్రాసు సమీపంలోని (శ్రీ) పెరుంబుదూర్ లో జన్మించాడు. కాంచీపురంలోని యాదవప్రకాశ వద్ద విద్యాభ్యాసం చేశాడు. ఇది శంకరాచార్యుల పాఠశాల. రామానుజుడు మాత్రం యామునాచార్యుల ప్రభావానికి గురి అయ్యారు. తన గురువు యాదవప్రకాశతో విభేదించాడు. ఈ ప్రపంచం మాయ కాదని, సంపూర్ణ ఏకత్వం మీద శంకరాచార్యుల వారి భావనను రామానుజుడు ఖండించాడు.

రామానుజుడు వేదాంత తత్త్వానికి మౌలికంగా భాష్యం చెప్పాడు. (2) మానవ వ్యక్తి రూపంలో ఉన్న దేవుని అతీత భావంలో పూజించడం పై ప్రాముఖ్యత నిచ్చాడు. ఆతడే, ఆ వ్యక్తి రూపంలో దేవుడే సర్వోన్నత సత్యం అన్నాడు. భగవంతుడే అత్యున్నత సృష్టికర్త, వినాశకారి, స్థితికర్త ఈ ప్రపంచానికి అని తెలిపాడు.

ఆత్మ భగవంతునిలో ఒక భాగమై ఉన్నప్పటికీ భగవంతుని కంటే భిన్నమైనది.

(4) [ " [illegible], భగవంతుని లాగ ఏదైతే ఉందో
అదే ఆత్మలనూ ఉన్నప్పటికీ, మరియు అతని
చేత సృష్టించబడటమే గాక అతని నుండి వెలువడిందే
అయినప్పటికీ, ఆత్మ ఐక్యం పొందడం ద్వారా గాక
అతనికి చేరువ లో ఉండడం ద్వారానే పరమత్వం
పొందుతుంది "

— (శ్రీ) రామానుజాచార్యులు ]

(5) [అందుకే రామానుజులు వేదాంతం లోని
ఏకత్వ తత్త్వం పరిధిలోనే ద్వైతాన్ని చెప్పినట్లయింది.
అందుకే దీన్ని "విశిష్టాద్వైతం" అన్నారు.]

(6) [గొప్ప పండితుడు, విస్తృతంగా పర్యటించిన
రామానుజుడు భక్తి మార్గం మీద ఎన్నో రచనలు చేశాడు.
వాటిలో "వేదాంత సంగ్రహము", బ్రహ్మసూత్రాలకి
చెప్పిన భాష్యం, భగవద్గీతకి చేసిన భాష్యం ముఖ్య
ముఖ్యమైనవి.]

(7) [శంకరాచార్యుల వలె గాక రామానుజుడు తన
సాంఘిక దృక్పథంలో చాలా ఉదారుడు. అన్ని కులాల
వారికి భక్తి మార్గం తెరవాలి అనిన చెప్పాడు. 120 ఏళ్ళ
పాటు జీవించిన రామానుజుడు పదివేలకు పైగా శిష్యుల్ని
ఏర్పరిచాడు.]

రామానుజుడు తన శిష్యుల్ని
ఏకమత్యంగా ఉంచటానికి దేవాలయాచారాల్ని ఎక్కడ
వీలయితే అక్కడ సంస్కరించాడు. కేవలం ద్విజులు
మాత్రమే వేదాలు చదవాలన్న నియమాన్ని అతడు
గౌరవించాడు, అయితే వాటినే శూద్రుల్లోనూ
చివరికి అంటరాని వారిలోనూ భక్తి మార్గాన్ని
ప్రోత్సహించాలని ఆశించాడు. సంవత్సరంలో
ఒక రోజు ముఖ్య దేవాలయాల్లోకి అంటరాని వారికి
ప్రవేశించే అవకాశం కల్పించాడు. ఇతడు తన
భావాల్ని ప్రోత్సహించడానికి దేశమంతా
విస్తారంగా పర్యటించాడు, అందువల్లే ఉత్తర భారతం
లో కూడా అనేక మంది ఇతని శిష్యులయ్యారు.

రామానుజుని మరణానంతరం

శ్రీవైష్ణవుల్లో 13, 14 శతాబ్దాల్లో చీలిక ఏర్పడి
వృద్ధి చెందింది. భగవంతునికి తమను తాము
అర్పించుకోవడం, "ప్రపత్తి" ని వివరించే విషయం లో
తలెత్తిన భేదాలే ఈ చీలికకి కారణం.

ఇరువర్గాలూ "ప్రపత్తి" లేదా
"శరణాగతి" అనే సిద్ధాంతాన్ని అంగీకరించారు.
అయితే దాన్ని విశ్లేషించటంలో, భాష్యం చెప్పటంలో
విభేదించారు.

"వడకలై" (ఉత్తర ప్రాంతాల వారు) వారు భగవంతుని దీవెన్లు పొందటానికి భక్తుడు తనను తాను ఉపయోగించుకోవాలి, తనకి తానే ప్రయత్నించాలి అన్నారు. కానీ తెన్కలై (దక్షిణ ప్రాంతాల వారు) వారు మాత్రం ఆత్మ శరణాగతి మార్గంలో పడితే భగవంతుని దీవెనలు వాటంతట అవే ఆత్మ కు మోక్షాన్ని అందిస్తాయని అన్నారు.

మొదటి ప్రాంతాల వారి వాదనను "మర్కట కిశోర న్యాయం" గా చెప్పారు. పిల్లకోతి తానే కష్టపడి తల్లిని పట్టుకు వేలాడుతుంటుందనే న్యాయం. రెండవ ప్రాంతాల వారిది "మార్జార కిశోర న్యాయం" గా చెప్పారు. పిల్లి తన పిల్లల్ని తానే నోట కరిచి జాగ్రత్తగా సురక్షిత ప్రాంతాల్లో పెడుతుందనే న్యాయం. ఈ రెండు ప్రాంతాల మధ్య మరికొన్ని భేదాలున్నాయి. తెన్కలై వారు సంస్కృతానికి బదులుగా తమిళానికి ప్రాధాన్యతను ఇచ్చారు.

(సాధారణంగా తెన్కలై శాఖ వడకలై శాఖ కన్నా ఉదారమైంది.) తెన్కలై ఎనిమిదక్షరాల మంత్రం "ఓం నమో నారాయణాయ" ను అన్న

కులాల వారికి చెప్పవచ్చునంటుంది. కాని వడకలై శాఖ వారు మాత్రం బ్రాహ్మణేతరులకి ఈ మంత్రాన్ని చెప్పేటప్పుడు 'ఓం' ను తీసేసి చెప్పాలంటారు. తెనకలై శాఖ అన్ని కులాలు సమానంగా చూడబడాలని కోరుతుంది.

<u>వరదాచార్యులు</u> లేదా నదాదుర్ అమ్మాళ్

<u>13 వ శతాబ్దం లో ఆఖరి మూడు దశాబ్దాలలో శ్రీ వైష్ణవులకి దక్షిణాదిన నాయకత్వం వహించారు.</u> <u>వేదాంతదేశిక</u> [1269 - 1370 A.D.] <u>ఈ కాలంలో ఉత్తర భారతం లో ప్రముఖ శ్రీ వైష్ణవాచార్యులు.</u>

దక్షిణ ప్రాంతాల పిళ్లై లోకాచార్యను తన నాయకుడిగా తీసుకున్నది. ఇతడు 1213 A.D. లో పుట్టాడు. ఇతడు 18 గ్రంథ సూత్రాలను (రహస్యాలను) రచించాడు. ఇతడు తన తర్వాత దక్షిణ ప్రాంతాలలో గొప్ప గురువైన మనవాల మహాముని (birth. Circa 1370) లో ప్రభావితమైన వ్యాఖ్యానకర్త ను గాంచి దీవించాడు.

# నింబార్క మతము

**[నింబార్కుడు రామానుజుని సమకాలీనుడు.]**

ఇతడు భక్తి తత్త్వాన్ని మరింత ప్రచారంలోకి తెచ్చాడు. నింబ గ్రామం (ఆధునిక బళ్ళారి జిల్లాలోని నింబపురి) లో తెలుగు బ్రాహ్మణుల ఇంట జన్మించాడు. ఇతని తండ్రి జగన్నాథుడు భాగవతుడు.

నింబార్క మత సిద్ధాంతాలు కొంతవరకూ రామానుజ తత్త్వాన్ని పోలి ఉంటాయి. అయితే నింబార్కుడు భక్తి ని దాని అసలు అర్థం అయిన ప్రేమ తత్త్వం గా ప్రబోధించాడు, అంతేగాక ఆలమందల్లో నాచే రాధ లో ఆరాధన కృష్ణుని కి అత్యధిక ప్రాధాన్యత ని ఇచ్చాడు. నింబార్కుని రాధ కేవలం కృష్ణుని ఇష్టసఖి మాత్రమే కాదు, అత్యున్నత స్వర్గం అయిన గోలోకం లో అతని తో శాశ్వతం గా ఉండే (eternal consort) నిత్య సహచరి లేదా శాశ్వత భాగస్వామి.

[రామానుజుడు పరమాత్మ మిశ్ర మూర్తిమత్త్వమని ; అది చేతన, అచేతన ప్రపంచంగా వృద్ధి చెందుతుందని చెప్పిన దాన్ని నింబార్కుడు అంగీకరించలేదు. నింబార్క మతంలో పరమాత్మ, ఆత్మ, ప్రపంచాలు ఒకటే అని అయితే భేదమయం లో అవి భిన్నాలని / ఒక దాని నుంచి మరొకటి

భిన్నమైనదని చెబుతుంది. అది కూడ, ఎందుకంటే
జీవాత్మ, అచేతన ప్రపంచం మొత్తంగా దేవుని
మీదే ఆధారపడి ఉన్నాయి, వీటికి స్వతంత్ర అస్తిత్వం
అన్నది లేదు. అందువల్ల నింబార్క సిద్ధాంతము
ఏకత్వం, బహుత్వం రెండూ గలది. ఇతని భావాలు
బ్రహ్మసూత్రాలకి భాష్యంగా రాసిన "వేదాంత
పారిజాత సౌరభ" లోనూ, "సిద్ధాంతరత్న" లేదా
"దశశ్లోకి" లోనూ ఉన్నాయి. 'దశశ్లోకి'

నారాయణుని నాలుగో శిష్యుడు
సనక సనందనుడు స్థాపించిన సిద్ధాంతమే సనకాది
సంప్రదాయం. నింబార్కుడు ప్రచారం చేసింది ఈ
సిద్ధాంతాన్నే. వీరు ద్వైతాద్వైత సిద్ధాంతం నమ్మేవారు.

దక్షిణాన జన్మించిన నింబార్కుడు ఉత్తరాదిగల
మధురకి అక్కడ భగవంతుని మానవ రూపంలో కొలవడమే
ఉత్కృష్టమైందని తలచి రాధాకృష్ణ ప్రేమతత్త్వాన్ని చెప్పాడు.
ఇందుకోసం శ్రీకృష్ణ స్తోత్రాన్ని విరచించాడు. కృష్ణుని
పాదపద్మాలను భజించడమే మోక్ష మార్గమని చాటాడు.

మధుర సమీపాన గల "బ్రజ" వద్ద
ఇతడు ఒక ఆశ్రమాన్ని నెలకొల్పాడు. గ్వాలియరు లోని
సౌరాష్ట్ర ప్రజల్లో ఇతని మతం యెక్కువ ప్రచారాన్ని
పొందింది.

## మధ్వాచార్యుని మతము - బ్రహ్మ మీమాంస

శృంగేరి కి పశ్చిమంగా 64 కి.మీ. దూరాన ఉన్న దక్షిణ కెనరా జిల్లా లోని ఉడిపి తాలూకా లోని 'కల్యాణపుర' గ్రామంలో బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు మధ్వాచార్యుడు. ఇతని మతము కు భక్తి కేంద్రము.

ఇతడు యవ్వనంలో ఉండగానే సన్యాసం స్వీకరించాడు. రామానుజుడి వలెనే ఇతని లోని విద్యాభ్యాసం శంకరుని తత్వంలోనే సాగింది. అయితే తన విద్యాభ్యాసం పూర్తి కాక ముందే ఇతడు పద్ధతిలోంచి బైటికి వచ్చి తన సొంత విధానాన్ని ఏర్పర్చినాడు.

ఇతని తత్వం 'భాగవతపురాణం' ఆధారంగా అభివృద్ధిచెందింది. ఇతను వాయుదేవుని అవతారంగా చెప్తారు. ప్రపంచం భగవంతుని చేత రెండు రూపాలలో పాలించబడుతుంది - అవే విష్ణు మరియు లక్ష్మి. ప్రపంచం లోని ఆత్మలు శాశ్వతంగా ఆతని నుంచి భిన్నమైనవి అని మధ్వాచార్య మతం. భగవంతుని కి జీవాత్మ కి మధ్య సంబంధం యజమాని కి సేవకుని కి మధ్య ఉండే సంబంధం లాంటిది. భగవంతుని కి సేవ చేయటం, పూజించటం ద్వారా జీవాత్మలు అనేక విధాలుగా భగవంతుని మాదిరిగా అవుతాయి. ఇతని మతము కు కేంద్రం భాగవతం లో చెప్పిన రీతి గా కృష్ణుని యందు భక్తి కలిగి ఉండడం. ఇందులో రాధ కి స్థానం లేదు. అయితే [illegible] అవతారాలు

ప్రారంభించబడుతాయి. శక్తి గూడా ప్రసాదిస్తాడు.

మధ్వాచార్యుని దృష్టిలో జీవుడు వేరు
బ్రహ్మ (నారాయణుడు) వేరు. బ్రహ్మ జీవుడు రెండూ
ఒకటే అని భావించటం మోక్షసాధనకు ప్రతిబంధకమని
చెప్పాడు. ద్వైతంలో పూర్తిగా సన్యాసం స్వీకరించాడు.
కర్మ ద్వారా ఉన్నత స్థానాలు లభిస్తాయేగాని, మోక్షం
లభించదని ఆయన నమ్మకం.

నారాయణుని నమ్మిన శిష్యులలో ఒకరైన
బ్రహ్మ స్థాపించినదైన బ్రహ్మ సంప్రదాయాన్ని
మధ్వాచార్యుడు ప్రచారం చేశాడు. ద్వైతం లోని
వీరి నమ్మకం.

మోక్షసాధనలో తొలిమెట్టు క్రమంలో

వాంఛలను విడనాడి, భగవంతుని వైపు మనసును సారించటం.
రెండో మెట్టు సద్గురువును వెతుకు కొనటం. గురూపదేశం తర్వాత
మానసిక బలంతో, భక్తి ద్వారా ఆలోచనలను నిగ్రహించి
భగవంతునికి అర్పించాలి. దీని ద్వారా ఫలితంగా చివరకి
భగవంతుని సాక్షాత్కారం లభించి తద్వారా మోక్షం లభిస్తుంది.

13 వ శతాబ్దానికి చెందిన శ్రీ
మధ్వాచార్యుడు దాదాపు 37 వైష్ణవ గ్రంథాలు రచించినట్లు
తెలుస్తుంది. ఇవన్నీ ప్రత్యేకించి శంకరుని అద్వైతానికి భిన్నంగా
ద్వైతం ఆధారంగా రచించబడిన భక్తి మార్గ గ్రంథాలు.

మాధ్వాచార్యుని ప్రకారం వ్యవస్థ

"స్వతంత్ర" మరియు "అస్వతంత్ర" గా విభజించవచ్చు.
సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపకుడు, సర్వజ్ఞాని అయిన
భగవంతుడు స్వతంత్రుడు. ఇతర పదార్థాలు, జీవులు
అస్వతంత్రాలు. ఏదైనప్పటికీ లౌకిక జీవాల శిక్షలను
గురించి అతని శిష్యులు విచారించలేదు. అతని
నిత్యత్వంలో అంతర్భావం గల భక్తి తో భగవంతుని సేవించి
ముక్తి పొందటమే వారి ధ్యేయంగా ఉండినది.

(సనాతన బ్రాహ్మణులు వేదం శూద్రులు
చదువరాదని చెప్పిన నియమాన్ని రామానుజుని వలె
మధ్వాచార్యుడు కూడా వివాదాస్పదం చేయలేదు.
శూద్రులకు భక్తి మార్గం ప్రత్యామ్నాయం చూపిస్తుందని
అంటాడు. ఇతడు ఉత్తర భారతం కూడా పర్యటించినట్టు
తెలుస్తుంది.]

మధ్వాచార్యుడు గొప్ప శారీరక దారుఢ్యం
గలవాడని తెలుస్తుంది. శృంగేరి ఆచార్యులతో త్రివేంద్రంలో
జరిగిన వాదన వల్ల మధ్వుడు చివరికి అనేక కష్టాల
పాలయ్యాడు. మధ్వుని మతం నచ్చని కొందరు అతన్ని కష్టాల
పాలు చేశారు. మధ్వుడు ఉత్తర భారత పర్యటనకి వెళ్ళగా
అక్కడ దారిదోపిడి దొంగలు మొదలు ఎన్నో కష్టాలు పడ్డాడు.
శివాలయాలు దర్శించాడు. తర్వాత "వేదాంతసూత్రాలు"
రచించాడు. తర్వాత ఉడిపి చేరి శ్రీకృష్ణ దేవాలయం

Chapter 19

# భక్తి ఉద్యమ ఆవిర్భావానికి గల కారణాలు :



క్రీ.శ. 14 - 17 శతాబ్దాల మధ్య భక్తి ఉద్యమం ఉత్తర భారతాన్ని ప్రభావితం చేసింది, అందుకు ఎన్నో కారణాలున్నాయి.

## రాజకీయ కారణాలు :

తురుష్క విజయాలకు ముందు ఉత్తర భారతంలో భక్తి ఉద్యమం స్థిరపడలేదు. రాజపుత్రులు - బ్రాహ్మణులు సమైక్యంగా కొత్త ఉద్యమాలను వ్యతిరేకించడమే అందుకు కారణం. ఈ రెండు వర్గాల యొక్క ఆధిపత్యాన్ని తురుష్క విజయాలు అంతం చేశాయి. బ్రాహ్మణుల ప్రభావం, ప్రతిష్ఠలు కూడా భంగపడ్డాయి. దాంతో సంప్రదాయ విరుద్ధ నూతన ఉద్యమాలు పుట్టుకొచ్చేందుకు, బ్రాహ్మణేతర వ్యతిరేక ఉద్యమాలు వెలువడేందుకు మార్గం సుగమమైంది.

బ్రాహ్మణులు సదా ఆలయాల్లోని విగ్రహాలు కేవలం దేవుని బొమ్మలు కాదని అవే భగవంతుడని, దివ్య శక్తులు గల దేవుడి విగ్రహమని అందు తమ చేత ప్రభావితుడు కాగలడని ప్రజల్ని నమ్మించారు. అయితే తురుష్కులు బ్రాహ్మణుల్ని వారి దేవాలయ ఆదాయాలకు రాజాశ్రయానికి దూరం చేశారు. విగ్రహాలను ధ్వంసం చేశారు. ఈ విధంగా బ్రాహ్మణులు భౌతికంగానూ

ఎక్కడా కన్పించదు. వైష్ణవ భక్తి ఆచార్యులు సనాతన 
బ్రాహ్మణ క్రమం నుంచి భక్తి మీద నమ్మకం, మత
సమానత్వాల మేరకే పక్కకు జరిగారు. సాధారణంగా
వారు సనాతన బ్రాహ్మణత్వంలోని పలు ప్రాథమిక సూత్రాలను
సమర్థించడం కొనసాగిస్తూనే ఉన్నారు. తీవ్ర వైష్ణవారాధన
బోధించినవారు సనాతన బ్రాహ్మణత్వాన్ని పూర్తిగా వ్యతిరేకించారు
అలాగా వారు కూడా రాజ్యాన్ని, పాలక వర్గాన్ని సవాలు చేయాలని
చెప్పలేదు. ఈ కారణం చేత భారతీయ భక్తి
ఉద్యమాలను యూరోప్ లోని ప్రొటెస్టెంట్ రిఫార్మేషన్
లాంటివాటిని చెప్పరాదు. ప్రొటెస్టెంట్ రిఫార్మేషన్ కూడా
చాలా పెద్ద సాంఘిక అలజడి, ఇది ఫ్యూడల్ వ్యవస్థ
పతనం మరియు పెట్టుబడిదారీ వ్యవస్థ ఆవిర్భావాలతో సంబంధించింది.

దీనర్థం భక్తి ఉద్యమకారులు సామాన్య
ప్రజల జీవితం పట్ల నిరాసక్తితో ఉన్నారని కాదు.
వారు నిమ్న జాతుల ప్రతినిధులకు ఆరాధ్య పాత్రలు, పైగా
వీరిలో ఒక రూపంలో సామాజిక జాతులలో ఆదర్శత్వం పొందారు
అయినవారు.

ఆర్థిక, సాంఘిక మార్పులు:

తుర్కుల పాలక వర్గం రాజధానుల వల్ల
గాక నగరాల్లో జీవించింది. పెద్ద మొత్తాల్లో సేకరించిన
భూమిశిస్తు వల్ల నగరాల్లో ధనం పోగులు పడేది. ఈ

వనరులుగల వర్గం వారి వస్తువులు, సౌకర్యసంపదలు
ఆదిలోని ఆచారాల ఉద్యమాన్ని అనేక కొత్త సిద్ధాంతాలు,
శాస్త్రాలు రావడానికి కారణం అయ్యింది. ఇది 13, 14
శతాబ్దాలలో నగర హస్తకళాకారుల వర్గం బలపడటానికి
దారి తీసింది.

సంప్రదాయ సనాతన బ్రాహ్మణ ఆశ్రమం లో
ఆమోదం కలిగియుండబడిన ఆశ్రమవస్థాయి చేత అసంతృప్తులైన
ఈ నగర హస్తకళాకార వర్గం సమానత్వాన్ని చాటి చెప్పిన
ఏకేశ్వరోపాసక భక్తి మార్గాల పట్ల సహజంగానే ఆకర్షితులయ్యారు.

వీరితో పాటుగానే పేదలున్న వాళ్లుగాని,
నగర హస్తకళల ఉత్పత్తులు, మార్కెట్ల విస్తరణ మొ॥ వాటి చేత
ప్రత్యక్షంగా లాభపడిన వంజారులు క్షత్రియులు మొ॥ వర్తకులు
కూడా ఈ సమానత్వాన్ని ఆధారమైన భక్తి ఉద్యమాల
పట్ల ఆకర్షితులయ్యారు. భక్తి ఉద్యమం పొందిన ప్రజాదరణ
ప్రధానంగా ఇలాంటి భిన్న సామాజిక వర్గాల వారు అందించిన
మద్దతు వల్లనే.

భక్తి ఉద్యమానికి సంఘీభావం అందించి కల్పించింది
ఇలాంటి పెద్ద ఏ సంఘీభావ వర్గమైనా ఉత్తర భారతంలో లాగా
ఇతర ప్రాంతాల్లో నిరూపించబడింది. పంజాబు లో ఈ ఉద్యమ
ప్రజాదరణ నగరాలకే పరిమితం కాలేదు. జాట్ రైతులు
ఎక్కువగా చేరిపోవడం వల్ల ఉద్యమం విస్తృత ప్రజాదరణ
పొందింది. జాట్ రైతులు గురునానక్ కు అందించిన మద్దతు
చివరకు సిక్కుమతం ప్రజామతం గా ఎదిగేందుకు కారణమైంది.

* భారతీయ వేదాంతాలలోని మోక్షాని కి గల 3 మార్గాలు — జ్ఞాన, కర్మ, భక్తి లలో ఒకటి భక్తి తత్త్వం. కాబట్టి ఈ భక్తి తత్త్వానికి మూలం సూఫీ ఉద్యమ ప్రేరణ అనడం పొరపాటు అవుతుంది. ఈ భక్తి తత్త్వం ఒక ఉద్యమంగా క్రీ.శ. 6వ శతాబ్దం లో తమిళ ప్రాంతంలో నానాటికీ ఎదుగుతున్న బౌద్ధ, జైన మతాల ప్రాబల్యాని కి పోటీ గా ప్రారంభమైంది. ఇది దక్షిణ భారతంలో 3 శతాబ్దాల పాటు శైవ, వైష్ణవ శాఖలుగా పరిఢవిల్లింది. ఈ ఆచార్యులను వరుసగా నయనార్లు, ఆళ్వార్లు అంటారు.

## ~~ఒక సంస్కరణ ఉద్యమంగా భక్తి తత్త్వం :~~

Don't read this

భక్తి తత్త్వం తప్పనిసరిగా మతపరమైంది. ఎందుకంటే దాన్ని బోధించిన వారు చెప్పింది ఒకే భగవంతుని మీద నమ్మకం, అతనికి అంకితం కావడం. దీన్ని వాళ్ళు "ఏకాంతిక ధర్మ" అన్నారు — ఏకచిత్త మతవాదం అని ఈ అర్థంలోనే చాలా కాలం అనబడింది. శంకరాచార్యులు దీని ప్రాచీన భారతీయ సంస్కృతుల గొప్పదనాన్ని పునరుద్ధరించి వైభవం తెచ్చే సాంస్కృతిక ఉద్యమంగా మలిచారు.

భక్తి తత్త్వం ఒక సంస్కరణ ఉద్యమంగా మధ్యయుగం లో ఎదిగింది. మధ్యయుగాలలో ఎంతో మంది కవులు, గురువులు, పండితులు, సాధువులు సాంఘిక-మతపరమైన సంస్కరణ బాధ్యత ను ఒకరి తర్వాత ఒకరు గా

ఏ కాలంలోనూ చేపట్టని పలు ప్రాంతాలలో ఉద్యమంగా చేపట్టడం వలన భక్తి ఉద్యమరూపం పొందింది.

భక్తి ఉద్యమం ఆవిర్భావానికి ప్రోత్సహించబడిన గల కారణాలు

1) వీరందరూ మతాలు, సాంఘిక నిర్మాణం పతనమై పోవడము ప్రధాన కారణంగా కనిపిస్తుంది.

శంకరాచార్యుల అద్వైతమత కృషి వలన బౌద్ధమతం, జైనం మరుగున పడి బ్రాహ్మణ ఆధిక్యత ప్రసిద్ధిగా పొందింది. రాజపుత్రుల కాలంలో సమాజం మీద వీరి పట్టు మరింత పెరిగింది. విదేశీ యోధులు బ్రాహ్మణుల ద్వారా 'క్షత్రియులు' గా మారి ఉన్నత సాంఘిక హోదా పొందినందున వారి ఋణం తీర్చుకొన్నారు. రాజ్యాలు పొందేందుకు, ప్రజలలో సాంఘిక-మత నాయకులుగా మరింత బలపడేందుకు ఇది బ్రాహ్మణులకు తోడ్పడింది. తర్వాతి కాలంలో తురుష్కుల చేతిలో రాజపుత్రులు ఓటమి పొందటంతో 12, 13 శతాబ్దాల్లో ప్రాచీన భారతీయ సంస్కృతి, మత సంరక్షకులుగా బ్రాహ్మణులు ఒక్కరే మిగిలారు. బ్రాహ్మణులు ఈ విధి నిర్వహణలో క్షత్రియ, వైశ్యుల్ని సైతం దిగజార్చారు. 11 వ శతాబ్దంలో వైశ్యులు శూద్రుల మాదిరి గానే చూడబడేవారని అల్బెరూని రచనల వల్ల తెలుస్తుంది. కుల వ్యవస్థ మరింత క్లిష్టతరం చేయబడి అంటరాని వారిని మరింత నిరాదరణగా చేశారు. శూద్రుల మీద ఆంక్షలు విపరీతమయ్యాయి.

దాంతో మెల్లగా అట్టడుగు కులాల వాళ్ళు ఉన్నత కులాల వారి దోపిడీకి వ్యతిరేకంగా నిరసన చూపటం మొదలైంది. ఇది రెండవది విద్యావంతులను, సమాజంలోని చాలా వివర్గాలను ఉద్యమాన్ని కలిగించింది. హిందూమతాన్ని రక్షించాలంటే దాన్ని సంస్కరించటమొక్కటే మార్గమని గ్రహించారు. వీరంతా హిందూమతం పేరిట కొనసాగుతున్న దురాచారాలను, కులవ్యవస్థ విపరీతాలను, అన్ని దేవాలయాల్లో నాగాలైన బ్రాహ్మణ ఆధిపత్యాన్ని నిరసించారు. అన్ని కులాలు, మతాల దేవాలయాల సారాంశం ఒకటేనని ఉన్నందున వీరు మత సమ్మేళనానికి కృషి చేశారు. వీరు స్వయంగా ఉత్తమ వ్యక్తిత్వం, ఆదర్శప్రాయమైన జీవితాన్ని గడపడం ద్వారా ప్రజలకు మార్గదర్శకత్వం (చూపారు) అందించారు. ఈ సాధువులు అనుచరులు వారి సేవకి భగవత్ పూజకు అంకితమైనారు. వారి విషయం ఎంతమంది వారిని గురువుగా అంగీకరించారు దానిపై ఉండేది. వీరి నిర్వాణము స్వాభావికంగా భక్తితత్త్వం ఒక శక్తివంతమైన సంస్కరణ ఉద్యమంగా మొత్తం దేశాన్ని చుట్టేసింది.

2) భారతదేశంలో ముస్లిం మత ప్రవేశం మరియు వ్యాప్తి కారణం.

ముస్లిం మతగురువులు, పాలకులు బలవంతంగా 'దారుల్ హర్బ్' (భారతదేశాన్ని) ను 'దారుల్ ఇస్లాం' గా అన్ని మార్గాల ద్వారా ముస్లిం మతమార్పిడి కారణం చేస్తున్నారు! దీంతో హిందూ మతం ప్రమాదంలో పడింది.

ఈ క్లిష్ట సమయంలో కొందరు
వివేకవంతులైన మేధావులు దృష్టిగల వారు అన్ని కులాలు, వర్ణాల కు
చెందిన హిందువులు తమ మతంలో తీవ్రమైన సంస్కరణలు
చేయనిదే హిందూ సాంఘిక వ్యవస్థలో తీవ్ర మార్పులు రానిదే
ఇస్లాం ని నిలపడం కష్టమని తెలుసు. ఈ భావన
ఉద్యమాన్ని త్వరపడేలా చేసింది. పైగా ఇస్లాం
అప్పటికే ప్రజాదరణ ప్రఖ్యాతి పొందింది. దాని సర్వ
సమాన సూత్రం హిందూమతంలోని నిమ్న కులాల వారిని
సులభంగా ఆకర్షిస్తుంది. అందువలన భక్తి ఉద్యమకారుల
ఒక ముఖ్యోద్దేశం తమ ఇల్లు చక్కదిద్దుకోవటం ద్వారా
మతమార్పిడులను నిర్మూలించడం.

3) కొందరు భక్తి ఉద్యమాన్ని పలాయనవాద ఫలితం
అంటారు.
ఇస్లాం పాలనలో హిందువులు 'జిమ్మీలు' గా
కనీసం కొన్ని పౌరహక్కులు కూడా లేకుండా చూడబడేవారు.
హిందువులు భౌతిక, రాజకీయ, సాంస్కృతిక పరంగాలలో పొందే
అవకాశం లేకపోయింది. దాంతో తప్పించుకోలేని దాన్ని సహించాలి
(what cannot be cured must be endured) అన్నట్లు
తమకున్న దానిలో తృప్తి చెంది భక్తిలో తమ తృప్తిని పొందారని
ఈ వాదన చెప్పే వారు అంటారు. భక్తి ఉద్యమం వారికి
ఓదార్పు, సాంత్వనను అందించింది.

(Read M.A. guide page: 208)

## భక్తి ఉద్యమ ప్రాముఖ్యత :

1) హిందూ మతాన్ని పునరుజ్జీవింప చేసింది. బ్రాహ్మణ ఆధిపత్యానికి చావుదెబ్బ తీసింది, మళ్లీ ఎన్నటికీ బ్రాహ్మణ ఆధిపత్యం అంతగా తలెత్తలేకపోయింది. హిందువుల్లో తమ మతం హిందూ సంస్కృతుల వారసత్వం పట్ల నమ్మకాన్ని పెంచింది, ఫలితంగా మతమార్పిడులు ఆగాయి. కులవ్యవస్థ నాటికీ పూర్తిగా తొలగిపోనప్పటికీ ఉన్నత - నిమ్న కులాల మధ్య హిందూ తత్వాల ద్వారా పరస్పర సహకారం ద్వారా సుహృద్భావ వాతావరణాన్ని పెంపొందించి చెడు ప్రభావాల్ని తగ్గించగలిగింది. హిందువులను బాధ పెడుతున్న హిందూ దురాచారాల్ని పూర్తిగా నిర్మూలించలేకపోయినా అవి ప్రజల చైతన్య జ్ఞానంలో మరుగున పడ్డాయి.

2) భక్తి ఉద్యమం జీవితం యొక్క ఉత్తమ గుణాలకి ప్రాధాన్యం ఇచ్చింది. తద్వారా మొత్తం సమాజం యొక్క నైతికత ని మెరుగుపరుచుకుంది.

3) భక్తి ఉద్యమం ముస్లిం పాలకుల చేతుల్లో రాజకీయ & నరకప్రాయ బాధల & బానిసత్వం పొందింది. అది హిందువులకి ఆధ్యాత్మిక తృప్తిగా ఆనందంగా ఎదుర్కొనగల చైతన్య ధైర్యాన్ని సామర్థ్యాన్ని అందించింది.

ఉద్యమం నూతన భావాల్ని (a new line of thought) కొత్త ఆలోచనా ధోరణుల్ని, ఆధ్యాత్మికత ని అందించింది. ఉదాహరణకు హిందీలో సాధుకవులైన సూరదాస్, తులసీదాస్ లు హిందీ సాహిత్యానికి చేసిన సేవ అమూల్యమైనది.

9) భక్తి ఉద్యమం మరాఠాలు శివాజీ నాయకత్వంలో విజృంభించటానికి ప్రోత్సాహాన్ని అందించింది.

10) చివరికి పంజాబులో క్రీ.శ. 1594 లో గురునానక్ చేత స్థాపించబడిన సిక్కుమతము భక్తి ఉద్యమం యొక్క ప్రత్యక్ష ఫలితమే..

## దక్షిణ భారతం లో భక్తి ఉద్యమ ఫలితాలు:

1) భక్తి ఉద్యమాలు నాడు మిక్కిలి ప్రజాదరణ గల ఉద్యమాలు. అందువలన రాజులు అంతవరకు బ్రాహ్మణుల మద్దతు కోసం ప్రయత్నించే వారు కాస్త ఈ భక్తి ఉద్యమాల్ని ఆదరించటం మొదలు పెట్టారు. ఫలితంగా భక్తి ఉద్యమం ప్రబోధించిన సాంఘిక సమానత్వం మొ॥ వాటికి రాజుల మద్దతు కూడా లభించినట్లయ్యింది.

2) ఈ భక్తి ఉద్యమాలు మానవ రూపంలో భగవంతుని (కృష్ణుడు లక్ష్మి మొ॥ రూపాలు) ఆరాధించటాన్ని ప్రబోధించాయి. ఫలితంగా దేవాలయాల వృద్ధి జరిగింది.

3) ఈ దేవాలయాలు పరోక్షంగా ప్రముఖ స్థిరీకరణకు, వ్యవసాయాన్ని విస్తరింప చేసేందుకు, ఇంకా వ్యాపారంలో భాగం పంచుకుని వ్యాపారాభివృద్ధికి ఎంతో తోడ్పడ్డాయి.

Chapter (19)

## Sufism in its Pantheistic phase

## సర్వం దైవమనే దశ లో సూఫీతత్త్వం :-

~~15 వ శతాబ్దం, 16 వ శతాబ్ది ఆరంభాన్న~~ లో సూఫీలు ~~కొందరు~~ వేదాంత ~~అద్వైత~~ ప్రభావం చేత "వహదతుల్ వుజూద్" (ఉనికి యొక్క ఐక్యత) సిద్ధాంతాన్ని బోధించారు.

ఈ సిద్ధాంతాన్ని మొదట చెప్పినవాడు షేక్ మొహియుద్దీన్ ఇబ్నుల్ అరాబి (1165-1240 A.D.). ఇది క్రమంగా భారత మార్మికుల ఆలోచనల్లోకి వచ్చింది. అరాబి పద్ధతి బహిరంగంగా ఏకేశ్వరోపాసన. సృష్టికర్త (హక్) సృష్టి (ఖల్క్) రెండూ ఒకటే అంటాడు. అన్ని భౌతిక పదార్థాల యందలి భిన్నత్వం, వాస్తవికతల వెనుక ఐక్యత సాధించేది దేవుడే అని అతని విశ్వాసం.

> "అక్కడ దేవుడు తప్ప మరేది లేదు, అతడు తప్ప మరేది అస్తిత్వం కలిగి లేదు. అక్కడ కనీసం 'అక్కడ' అన్నది కూడా ఉండదు, ఎక్కడైతే అన్నిటి యొక్క పరమార్థం ఒక్కటే అవుతుందో, అక్కడ కనీసం 'అక్కడ' అనేది కూడా ఉండదు"
>
> — అరాబి

అరాబి యొక్క 'వహదతుల్ వుజూద్' అన్నది నిజానికి ఇస్లామిక్ సిద్ధాంతం అయిన 'తౌహీద్' యొక్క కొనసాగింపే. భగవంతుడు ఉంటాడు కాని ఒక్కడే ఉన్నాడు - అనే

సిద్ధాంతం నుంచి భగవంతుడు తప్ప మరేదీ ఉండదు
— ఈ సిద్ధాంతం ద్వారా అరబీ పరిచయించాడు. పైగా
అరబీ ఇది హృదయానికి సంబంధించినది కాబట్టి
హేతువు ద్వారా తెలుసుకోలేమని చెప్పాడు. దీనికి
ఉన్నతజ్ఞానం కావాలి. వ్యక్తియొక్క అవలీలగా తెలుసుకునే
అనుభవం (intuitive experience) [అరబీ దీన్ని
జౌక్ (zauq) అన్నాడు] మీద ఈ జ్ఞానం
ఆధారపడి ఉంటుంది.

intuitive = హేతువు ద్వారా గాక భావాల ద్వారా అర్థం
చేసుకోగల సామర్థ్యం, లక్షణం

అరబీ పద్ధతి భగవంతుని "సర్వవ్యాపకత్వాన్ని"
తెలుపుతుంది. ఇది బహుదేవతారాధనకు దారి తీయగల
ప్రమాదాన్ని అతడు ~~[illegible]~~ దాన్ని తీవ్రంగా వ్యతిరేకించాడు.
ఈ సందిగ్ధాన్ని అధిగమించేందుకు గాను అతడు శిష్యులందరికీ కలిపే
ప్రేమతత్వాన్ని బోధించాడు. భగవంతుని తెలుసుకోవడానికి
మార్గం ప్రేమ ఒక్కటే అని చెప్పాడు.

షేక్ షర్ఫుద్దీన యాహ్యా మునేరి
ఇస్లామిక్ 'తౌహీద' యొక్క మౌలిక ప్రభావాన్ని తన
"మక్తూబత్" లో వర్ణించాడు. ఇతడు ఉనికి యొక్క
ఏకత్వ అనే సిద్ధాంతం యొక్క gnosticism "ఇల్మ్" దశ లేదా
ఐన్ తక్షణా దర్శన (షుహూద)
దశ లేదా భావిన భావనగానే దేవుడు దేవుడే గాని

ఉంటారని తెల్పాడు. జీవుడు (జ్ఞానా) మరణించడం అంటే భక్తుడు ఈ చేతన దశలో ఒక దర్శనాన్ని అనుభవిస్తాడు. అందులో ఒక కాంతి రూపంలో ఉన్న భగవంతుని లో పాటుగా లయమైనట్లు భావిస్తాడు. భగవంతునిలో కలవడం అనేది ఒక శరీరం మరో శరీరం లో కలవడం లాంటిది కాదు. అది భావనామయమైన స్పర్శ మరియు భగవంతుడు గాక తక్కిన ప్రపంచం అంతటి నుంచి వేరుపడటం. భగవంతుని నుంచి దూరంగా ఉండడం లేదా దగ్గరగా ఉండడం అనేది మన అజ్ఞానం, జ్ఞానాల మీద ఆధారపడి ఉంటుంది. అంటే ఎవరికి ఎక్కువ జ్ఞానం ఉంటుందో వారు దేవునికి ఎక్కువ దగ్గరగా ఉంటారు. ఒక శరీరం మరో శరీరం లో కలవడం నిజం కాదు. ఎప్పుడయితే అది మీలో ఉందో ఆ విషయాన్ని అర్థం చేసుకున్నప్పుడే అది నిజమవుతుంది. ఒక దానిని మరొకటి అర్థం చేసుకోవటం అనేది దాని ఉన్నతత్వం మీద ఆధారపడి ఉంటుంది. ఎంత ఉన్నతంగా ఉంటే అంత ఎక్కువగా అర్థం అవుతుంది. (The finer it is the more comprehensible it will be) ఇది మేధస్సుకు ఉన్నతమైంది కాబట్టి కేవలం దార్శనికత గల వ్యక్తులు మాత్రమే దీన్ని అర్థం చేసుకోగలరు.

మస్నవి గొప్ప రచన కూడా.

ఇతడు "మక్తూబాత్" లో పాటుగా "ముల్ఫుజాత్" ఇంకా తత్వాల్ని శిష్యులకి మార్గదర్శకాల్లా అందించేందుకు ఎన్నో రచనలు చేశాడు.

ఆచరణా దృష్టి గల మార్మికుడుగా మనేరి

మానవ సేవ & తన మార్మిక విధానంలో ప్రత్యేక ప్రాధాన్యతని ఇచ్చాడు.

"ప్రార్థనలు, ఉపవాసాలు, స్వచ్ఛందకృత్యాలు ఇవి నడవాల్సిన కాలం మంచివే, అయితే ఇవి ఇతరులకు ఆనందపరచటం అంత ఉపయోగదాయకం కాదు"

— మనేరి.

"రాజులను, ప్రముఖులను, మంచి హోదాగలవారిని, ధనికులకు భగవంతుడు చేరువనేందుకు ఇవి దగ్గరి మార్గం ఆపదలో ఉన్నవారికి చేరువవడం, ఆకలిన వారికి చేయూతనిచ్చి సాయం చేయడమే"

— మనేరి

ఇది చివరికి వ్రాయి

ఉనికి యొక్క ఏకత్వం సిద్ధాంతాన్ని చెప్పిన మరో సాధువు షేక్ అబ్దుల్ కుద్దూస్ గంగోహి (మ. 1537). ఈ కాలానికి ఈ సిద్ధాంతం భారతదేశ మార్మికతావరణంలో ఒక భాగమై పోయింది. ఇతడు చిష్తియా సబిరియా క్రమానికి చెందినవాడు. దీన్ని స్థాపించినది షేక్ అలావుద్దీన్ అలి బిన అహ్మద సబిర్. జలాలుద్దీన్ రూమి, హాఫిజ్, జామి మొదలైన వారి కవిత్వం 'వహ్దతుల్ వుజూద్' ను దేశ పండితులకులో విస్తృతంగా ప్రచారం చేయడానికి ఎంతో కారణం అయింది.

15 వ శతాబ్దం, 16 వ శతాబ్ది తొలి కాలం వహ్‌దతుల్ వుజుద్ వారికి, వారి విమర్శకులకు మధ్య ఘర్షణ మొదలైంది. దీనికి కారణం ఇరాన్ లో అరాబిక్ గొప్ప పండితుడైన షేక్ అలాఉద్దౌలా సిమ్నాని (Shaikh-Ala-ud-Daula-Simnani) శిష్యులు భారతదేశానికి రావడమే. అలాఉద్దౌలా జీవుడు, దేవుడు ఒకటి కాదని వాదించాడు. జీవం శాశ్వతంగా ఉండే ఉన్నప్పటికీ జీవ పదార్థం పరమాత్మ పదార్థం కంటే భిన్నమైందని చెప్పాడు. ఇతడు వహ్‌దతుల్ వుజుద్ అనేది సూఫీతత్వ వృద్ధి లో మొదటి దశ అని చివరి దశ కాదని చెప్పిన "వహ్‌దతుష్ షుహూద్" (Unity of perception = జ్ఞానం ఐక్య నిశ్చిత) అని చెప్పాడు. అలా

అలాఉద్దౌలా శిష్యులు గుల్బర్గా కు చెందిన గేసుదరాజ్ ను ప్రభావితం చేయగలిగారు. గేసుదరాజ్ అరాబిక్, రూమి ఆదితరుల రచనలు ఎప్పుడూ పట్టిస్తూ ఉన్నా ఒక పత్రం కూడా రాశాడు. అయినప్పటికీ చిష్టి వహ్‌దతుల్ వుజుద్ సంప్రదాయాలు బాగా పాతుకు పోయి గేసుదరాజ్ కు లొంగలేదు. గేసుదరాజ్ రచనలు అంతగా ప్రజాదరణ పొందలేదు. పైగా ఖత్తరి సిల్సిలా ను షేక్ అబ్దుల్లా ఖత్తరి స్థాపించడంతో సిమ్నాని యొక్క షుహూద్ భావజాలానికి పెద్ద దెబ్బ తగిలింది.

Chapter 19

దాదాపు బెంగాల్ దాకా వ్యాపిస్తు
మొఘల్ లు రాకముందు అతను (ప్ర)యాణం చేస్తూ ఉండు
క్రీ.శ. 1485 లో చైతన్యుడు హజ్రత్ ఉల్లవార్ది ఇరిదేర
వారి కి అవస్థ బాగా ఉంది యొక్క సూఫీల సిద్ధాంతం
గురించి బాగా తెల్సి అతను బోధించాడు వేదాంత దాని గురించి
అతని వద్ద శిష్యులుగా ఉల్లావారితో సవాలు చేస్తూ ఉండేవాడు.

## షా నియామతుల్లా మరియు

ముఖదుమ్ మహ్మద్ జిలానీలు 15 వ శతాబ్దం మధ్యకాలంలోని వారు. వీరు షేక్ అబ్దుల్ ఖాదిర్ స్థాపించిన ఖాదిరి సిల్సిలాను భారత్ లోకి తీసుకొచ్చారు. ఖాదిరి 12 వ శతాబ్దంలో బాగ్దాదులో స్థాపించబడింది. జిలానీ ఉచ్ లో స్థిరపడ్డాడు. ఇతని కొడుకు ముఖదుమ్ అబ్దుల్ ఖాదిర్ వారసుడయ్యాడు. ఇతని మనవడు షేక్ హామిద గంజ్ బక్ష్ గొప్ప విశాల మనస్తత్వం నిశిత మర్మ లోదృష్టి గలవాడు. ఇతని వారసులు ఇతని లాగా లేకుండా వెళ్లారు.

Chapter 19

# Monotheistic Movements :

## * ఏకేశ్వరోపాసనా ఉద్యమాలు *

### ఏకేశ్వరోపాసనా ఉద్యమాల సామాన్య లక్షణాలు :-

1) ఏకేశ్వరోపాసనని చెప్పిన వారందరూ దాదాపుగా తక్కువ కులాలకి చెందిన వారే, పైగా వారందరికీ తమలో ఒక విశిష్టమైన భావైక్యత ఉందని తెలుసు. చాలా మంది ఒకరి బోధనలు ఒకరు ఒకరి ప్రభావం ఒకరు / వారిలో చాలా మందికి పరస్పర బోధనలు, ప్రభావాలు తెలిసినవే. వారి పద్యాలలో వారు ఒకరినొకరికి, తమ పూర్వుల సహపాఠ్యత/సాముద్య భావజాలు/ఆధ్యాత్మిక బాంధవ్యం తమలో పెంపొందే రీతిలో చేర్చి చెప్పటం జరిగింది. అందువల్లనే కబీరు రాయదాస ను "సాధువుల్లో సాధువు" గా (Saint among saints) అభివర్ణించాడు. రాయదాస్ గౌరవంగా కబీరు, నామదేవ, త్రిలోచన, ధన్నా, సేన, పిపా మొ॥ వారి నామాలను ప్రస్తుతించాడు. ధన్నా నామదేవుడు, కబీర, రాయదాస్, సేన్ మొ॥ వారి ప్రఖ్యాతి గురించి మాట్లాడటానికి గర్వపడతానని వారి ప్రఖ్యాతికి విష్ణు భక్తితోనే అను భక్తి మార్గానికి అంకితమయ్యానని చెప్తున్నాడు. నానక్ మీద కబీరు ప్రభావం బాగా కనబడేదే అయింది. అందువల్లనే ఆర్థోడ సంప్రదాయం లో కబీరు, రాయదాస్, ధన్నా, పిపా, సేన మొ॥ వారందరినీ రామానందుని శిష్యులుగా చెప్పడంలో ఆశ్చర్యం లేదు. ఏకేశ్వరోపాసకుల మధ్యగల ఆధ్యాత్మిక సారూప్యం

నానక్ పద్యాలతో పాటుగా కబీరు, రాయిదాస్‌ల పద్యాలు కూడా సిక్కు గురువు అర్జునసింగ్ "ఆది గ్రంథ"లో చేర్చటం ద్వారా నిక్షిప్తమయింది.

2) ఏకేశ్వరోపాసన చెప్పిన వారంతా వేరు విధంగా వివిధ ప్రాంతాలలో వైష్ణవ భక్తి, నాథపంథీ ఉద్యమం, సూఫీ తత్వాల చేత ప్రభావితులైన వారే. ఈ మూడు సంప్రదాయాల సమ్మేళనం ఏకేశ్వరోపాసన ఉద్యమాల మీద ఉంది. అయితే సాధారణంగా ఈ మూల సంప్రదాయాల్ని వారు యథావిధిగా అంగీకరించక వాటిలో ఎన్నో మార్పులు, చేర్పులు, నూతన కల్పనలు చేర్చి వాటి సిద్ధాంతాలకి కొత్త అర్థాల్ని కల్పించారు.

3) ఏకేశ్వరోపాసకులు భగవంతునితో సంబంధం ఏర్పరచుకునేందుకు ఒకే మార్గం ఉందని నమ్మేవారు, అదే వ్యక్తిగతంగా అనుభవించే భక్తి మార్గం. వైష్ణవ భక్తి సాధువులది కూడా ఈ భక్తి మార్గమే, అయితే ఇద్దరికీ మౌలిక భేదం ఉంది. వీళ్లందరినీ ఏకేశ్వరోపాసకులు అని ఎందుకన్నారంటే వీరంతా ఏ మతంతో రాజీ పడకుండా కేవలం ఒకే దేవుడు అన్న భావాన్నే నమ్మేవారు. అప్పుడు నానక్ యొక్క దేవుడు అవతారం, రూపం లేనివాడు - నిరాకారుడు

శాశ్వతత్వం గలవాడు - నిత్యుడు / అకాల్

అనిర్వచనీయమైనవాడు — అలఖ్.

అందువల్ల ఏకేశ్వరోపాసకుల భక్తి నిర్గుణ భక్తి, ఇది సగుణ భక్తి కాదు. అయితే వైష్ణవులు మాత్రం భగవంతుని అనేక మానవ అవతారాలను విశ్వసిస్తారు, అందువలన వారిది సగుణ భక్తి అవుతుంది.

ఏకేశ్వరోపాసకులు భక్తి భావాన్ని వైష్ణవ భక్తి నుంచే స్వీకరించారు, అయితే దానికి నిర్గుణ తత్త్వాన్ని ఆపాదించారు.

అయితే కబీరు తరచుగా దేవుని 'రామ్' అనేవాడు, అందువల్ల అతని రామ్-భక్తుడు అన్నారు. అయితే కబీరే తన ప్రబోధనలలో తాను పలికే రామ్ శబ్దం దశరథుని ఇంట అవతారాన్ని, రావణుని చంపిన రాముడు శబ్దం కాదని, అది నిరాకార, నిరవతార దైవమని చెప్పాడు. భగవంతుని ఏకత్వం మరియు నిర్గుణ భక్తి లతో పాటు ఏకేశ్వరోపాసకులు దివ్య నామాన్ని[1], ఆధ్యాత్మిక గురువును స్మరించడాన్ని దివ్య నామాన్ని పదే పదే ఉచ్ఛరించడాన్ని, భక్తి[2] కీర్తనలను సామూహికం గా ఆలాపించడాన్ని మరియు సాధువుల తో కలిసి జీవించటాన్ని - సత్సంగాన్ని[3] ముఖ్యమైనవి గా చెప్పారు.

4) ఆనాటికి ఆధిక్యత గల హిందు, ముస్లిం రెండు మతాల స్వతంత్రం గా గల మార్గాన్ని ఈ ఏకేశ్వరోపాసకులు అవలంబించారు. వారు ఈ రెండు మతాల్లో దేనికీ తాము [illegible] రెంటిలో గల మూఢనమ్మకాలను, సనాతన విషయాలను ఖండించారు. వాళ్లు కుల వ్యవస్థ మీద, విగ్రహారాధన మీదా తీవ్రమైన తిరుగుబాటు చేశారు. వాళ్లు బ్రాహ్మణుల ఆధిక్యతని, వారి మత రచనల్ని

తిరస్కరించారు. కబీరు తన కవిత వైఖరి లో సనాతన బ్రాహ్మణ్యాన్ని నిందించడానికి అవహేళనను హాస్యాన్ని (ridicule) శక్తివంతమైన పద్ధతిగా వాడుకొన్నాడు.

5) ఏకేశ్వరోపాసకులందరూ దాదాపుగా తమ పద్యాలను ప్రజాబాహుళ్యం మాట్లాడే "ప్రాంతీయ భాషల్లోనే" రచించారు. వారిలో కొందరు ఉత్తర భారతంలో అనేక చోట్ల మాట్లాడే పలు మాండలికాల సమ్మిశ్రితమైన భాషను కూడా వాడారు. వారు తమ ప్రాంత స్థానిక మాండలికం కంటే ఈ సమ్మిశ్రిత భాషకే ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చారు, దీని ద్వారా తమ సంప్రదాయేతర భావాలు పలు ప్రాంతాల్లోని సామాన్య ప్రజలకు చేరగలవని వారు తలచారు. ఈ ఉద్యమం లో ఉత్తర భారతంలోని పలు ప్రాంతాలకి చెందిన పలు మాండలికాలు మాట్లాడే సాధువులున్నప్పుడు ఒక సామాన్య భాష ని ఉద్యమానికి వాడుకోవడం అన్నది కొట్టొచ్చినట్లు కన్పించే లక్షణం.

ఏకేశ్వరోపాసకులు ప్రజాబాహుళ్యం వాడే ప్రతీకలని, చెప్పాలంటే తమ బోధనలని ప్రచారం చేయడానికి వాడుకున్నారు. వారి బోధనల్ని సులభంగా గుర్తుంచుకోదగ్గ చిన్న చిన్న పద్యాలలో చెప్పారు.

అందువల్లనే కబీరు పద్యాలు సొంత పెట్టని కోటలో, తప్పు పెట్టినట్లు, నిత్య వ్యవహార రోజువారీ గుణాల్ని కలిగి ఉంటాయి, కాబట్టే ఇవి పూర్తిగా ప్రజల కవిత్వం గా చెప్పవచ్చు.

6) ఏకేశ్వరోపాసకుల్లో చాలామంది సన్యాసులు కారు/కాదు. వారు ప్రాపంచిక జీవితాన్ని గడిపినవారే, పెళ్లిళ్ళు చేసుకున్నవారే. వారు ప్రజల మధ్యలో జీవిస్తు జీవన విధానం ప్రజలకి బోధనలు చేశారు. సన్యాసత్వాన్ని [illegible] గా స్వీకరించ-టాన్ని వ్యతిరేకించారు. వారు తమ పద్యాల్లో అరుదుగా కుల సమాచారాలని పేర్కొనడం వలన వారు తమ కుటుంబ వృత్తుల్ని కొనసాగించినట్లుగా తెలుస్తుంది. వారు మధ్యయుగ యూరోప్లో చర్చి చేత 'పవిత్రులుగా' గుర్తింపబడిన సాధువుల వంటి వారు కూడా కారు. వారికి వాడిన, వారే తమకు పెట్టుకున్న పేరు "సంత్", లేదా "భగత్". "ఆది గ్రంథ" లో కబీరు, రాయదాస్, ధన్నా, పీపా, నామదేవ్ మొ॥ వారందరూ భగత్ లుగానే చెప్ప బడ్డారు.

7) ఏకేశ్వరోపాసకులు తమ నమ్మకాలను ప్రచారం చేయడం కోసం విస్తృతంగా పర్యటించారు. నామదేవుడు 14వ శతాబ్దం లో మహారాష్ట్ర నుంచి పంజాబు అంతటి దూర ప్రాంతానికి ప్రచారం కోసం వెళ్లాడు. అక్కడ అతను

ప్రబోధాలు ఎంతగా ప్రజాదరణ పొందాయంటే తర్వాత కాలంలో అవి "ఆది గ్రంథ్" లో చేరాయి. కబీరు, రాయిదాస్ ఇంకా ఇతర సాధువులు కూడా విస్తృతంగా పర్యటనలు చేసినట్లు తెలుస్తుంది.

8) కబీరు, ఇతర ఏకేశ్వరోపాసకుల ఆలోచనలు అనేక ప్రాంతాలకు వ్యాపించి "తక్కువ" కులాల వారిలో విస్తృతంగా ఆదరణ పొందాయి. ఏకేశ్వరోపాసకుల ఆదరణ ప్రాంతీయ పరిధుల్ని ఛేదించింది. సిక్కుల మతంలో గానూ, రాజస్థాన్ లోని దాదు పంథీ సంప్రదాయం లోనూ కబీరు కు ఉన్నత స్థానాన్ని కల్పించటం ద్వారా ఇది నిరూపించబడుతుంది. వారి మరణానంతరం 2 శతాబ్దాల తర్వాత కూడా వారి విశ్వాసాలు కొనసాగుతూనే ఉంది, అదికూడా సుదూర ప్రాంతాల్లో కావడం విశేషం. ఇందుకు 17 వ శతాబ్ద మధ్యకాలంలో మహారాష్ట్ర సాధువైన తుకారాం తాను కబీరు, రాయిదాస్, సేన, గోరా మొ॥ వారి శిష్యుడిని అని చెప్పుకోవడం ఇందుకు తార్కాణం. 17 వ శతాబ్దానికి చెందిన తులనాత్మక మతం మీద రచన పర్షియన్ రచన "దబిస్తాన్-ఇ-ముజాహిబ్" ఉత్తర భారత ప్రజలలో కబీరు యొక్క ప్రఖ్యాతి కొనసాగుతున్నదని నిరూపిస్తుంది.

9) ఏకేశ్వరోపాసకుల బోధనలకు మంచి ప్రజాదరణ సామాన్యప్రజల్లో ప్రత్యేకించి ఉన్నప్పటికీ ఒక్క

ప్రముఖ గురువు యొక్క అనుయాయులు / ఏకేశ్వరోపాసన

ఉద్యమంలోని ఒక్కొక్క ప్రముఖ గురువు – కబీరు, రాయిదాస్, నానక్ మొ|| వారి శిష్యులు తమను తామే ప్రత్యేక విశిష్ట వర్గాలుగా వ్యవస్థీకరించుకున్నారు, ఈ వ్యవస్థల్ని "పంథ్" లంటారు. ఉదాహరణకు కబీర్ పంథ్, రాయిదాస్ పంథ్, నానక్ పంథ్ మొ||. ఈ పంథ్ లన్నింటిలోనూ నానక్ పంథ్ తర్వాత తర్వాత ఘనీభవించి ఒక ప్రజల మతంగా ఎదిగింది. మిగిలిన వర్గాలు లేదా పంథ్ లు కూడా నేటికీ కొనసాగుతున్నాయి, వాటిలో చాలా తక్కువ మంది అనుయాయులున్నారు. పరిమితమైన వర్గ పునాది తోనూ ఇవి ఉన్నాయి.

— o —

1. ఏకేశ్వర-ఉద్యమకారుల మౌల్య సమర్పణం
2. వైష్ణవ, నాథపంథ్, సూఫీల నుంచి ప్రేరణ
3. భక్తి మార్గం – ఏకేశ్వరుల నిర్గుణభక్తులు
   నామోచ్చారణ – సామూహిక కీర్తన – సత్సాంగత్యం
4. హిందూ-ముస్లిం రెండు మతాల సనాతనత్వాన్ని మూఢ నమ్మకాల్ని తిరస్కరించింది.
5. స్థానిక మాండలికాల్ని కాక ఒకే సమ్మిశ్రిత భాషని వాడడం (ప్రాంతీయ భాషల్లోనే) ప్రజా జీవితం నుంచి ప్రతీకల్ని గ్రహించడం
6. గృహస్థాశ్రమాన్ని జీవన విధానంగా స్వీకరించడాన్ని ప్రోత్సహించారు. గృహస్థ జీవితాన్ని గడిపారు. 'భగత్' 'సంత్'
7. ఏకేశ్వర సాధువులు విస్తృత పర్యటనలు చేశారు.
8. ప్రఖ్యాతి ← సుదూర ప్రాంతాల్లో
   ← పెద్ద శిష్యబృందాల ద్వారా
9. "పంథ్"

# కబీరు

రామానందుని ప్రియశిష్యుడైన కబీరు క్రీ.శ. 1398 లో జన్మించాడు. అతని బాల్య జీవితాన్ని గురించి చెప్పే ఎన్నో గాథలున్నాయి. అతడు ఒక బ్రాహ్మణ వితంతువుకు జన్మించగా ఆమె అవమానానికి భయపడి వదిలి వేసిందని అప్పుడొక ముస్లిం నేతగాడు పెంచాడని చెబుతారు. మరికొన్ని కథలు అతడు నిజంగా ముస్లిం నేతగాడు 'నీరు' కి జన్మించాడని చెబుతాయి.

అతని జన్మదినం తెలియకపోయినా అతడు తప్పక 15వ శతాబ్ది వాడే. ఎందుకంటే కబీరు సికిందర్ లోడీకి సమకాలికుడు, పైగా రామానందుడు అతని గురువు. అతని ఒక పాటలో కబీరు "నాకు బెనారసులో అకస్మాత్తుగా జ్ఞానం కలిగింది, రామానందుడు నాకు జ్ఞానోదయం కలిగించారు" అని చెప్పాడు.

కబీరు రామానందునికి ఏ విధంగా శిష్యుడయ్యాడో కూడా గాథల ద్వారా తెలుసుకోవాల్సిందే. రామానందుడు స్నానం చేసే స్నానఘట్టం మెట్ల మీద కబీరు పడుకుని ఉండగా అనుకోకుండా రామానందుడు అతన్ని తొక్కడం అప్రయత్నంగా 'రాం రాం' అని అనడం జరిగాయి. దీన్ని కబీరు తన మంత్రంగా గ్రహించాడు. ఆ తర్వాత విషయమంతా రామానందునికి వివరించగా అతడు సంతోషంగా కబీరును తన శిష్యునిగా స్వీకరించాడు. ఇది కబీరు జీవితంలో పెద్దమలుపు / గొప్ప మలుపు. ఆ తర్వాత అతడు ఇల్లు చేరి నిరాడంబర, సాధు జీవితాన్ని గడిపాడు. అతడు ప్రపంచాన్ని ఎన్నడూ విడిచిపెట్టలేదు. వివాహం చేసుకుని కుటుంబ జీవితాన్ని గడిపాడు. ఒక కొడుకు, ఒక కూతురు ఉన్నారు. కొడుకు కమల్. Kamal

వృత్తి రీత్యా నేతగాడు, ఇతర నేతగాళ్ళ వలనే మగ్గాలపై తన ఉత్పత్తుల్ని అమ్మేవాడు.

కబీరు దృష్టిలో భగవంతునికి ఒకే మార్గం ఉంది. అదే వ్యక్తిగత భక్తి అనుభవము. దీని ద్వారానే భగవంత దర్శనం కలుగుతుంది, ఇది నిజానికి భగవంతుని దీవెన. వ్యక్తి తన ఆత్మను సరైన నడవడిక, నమ్రతల ద్వారా; వైరాగ్యం, ప్రేమల ద్వారా; కీర్తనలు, ధ్యానం ద్వారా భగవంతుని స్మరించటం మొ|| వాని ద్వారా శుద్ధి చేసుకోవాలని కబీరు చెప్పాడు. కబీరు చెప్పిన భగవంత భావన అద్భుతమైన ఆకర్షణ శక్తి గలది. దీనిపై వైష్ణవం, నాథ యోగం, వేదాంత ఏకేశ్వరోపాసన, సూఫీతత్వం మొ|| వాని ప్రభావం ఉంది. ఇతడు దేవుణ్ణి రాం, హరి, అల్లా, ఖుద, నిర్గుణ, అలఖ్, శూన్య, శబ్ద మొ|| పదాలతో పిలిచేవాడు.

అతని "హిందువు, తురుష్కుడు ఒకే మట్టితో చేసిన కుండలు; అల్లా-రామా అన్నవి భిన్న నామాలు మాత్రమే." పదే పదే అతడు ఈ నమ్మకాన్ని నొక్కి చెప్పేవాడు. అతడు ఒక పాటలో "హరి తూర్పున ఉన్నాడు, అల్లా పశ్చిమాన ఉన్నాడు. నీ హృదయంలోకి చూసుకో, అక్కడ నీకు కరీం, రాం ఇద్దరూ కన్పిస్తారు. కబీరు అల్లా, రాం ఇరువురి బిడ్డ" అని చెప్పాడు.

కబీరు ఒక సంస్కర్త మరియు విగ్రహారాధన వ్యతిరేకి. ఇతడు మతాలు బయటకు కల్పించే గ్రంథాలు, తీర్థయాత్రలు, ఆచారాలు, మూఢనమ్మకాలు, విగ్రహాలు మొ||

వాటి పై దాడి చేశాడు. అతడు నిరంతరంగా కులవ్యవస్థ లేని ప్రేమన్ను, బ్రాహ్మణుల ఆధిక్యతని ఎదిరించాడు. మానవత్వం ప్రతి సోదరభావం అని, అన్ని రకాల మానవ స్వభావాలు కూడా దైవం యొక్క (refractions) అని తెలిపాడు. అతడు మోక్షం కేవలం ప్రేమ ద్వారా మాత్రమే వస్తుందని, భగవంతుని తెలియటం కావడమే ఆ ప్రేమ ని సాధించగలదని తెలిపాడు. అందువల్లనే అతడు భజనలను నమ్మాడు.

"భగవంతుడు మసీదులోనే ఉంటే అతని ఈ ప్రపంచం ఎవరికి చెందుతుంది?"

"రాం విగ్రహానికే పరిమితమైతే, బయట ఏం జరుగుతుందో తెలుసుకునేందుకు ఎవరుంటారు?"

— ప్రతి కబీరు అభిమతం.

భక్తి ఉద్యమకారుల వలెనే కబీరు కూడా ప్రాంతీయ భాషల వాడుక పై నమ్మకమున్నాడు.

"సంస్కృతం బావి లో నీరు లాంటిది, ప్రజల భాష ప్రవహిస్తున్న నది లాంటిది" అని కబీరు తెలిపాడు.

కబీరు విగ్రహారాధన కి వ్యతిరేకుడని అతని క్రింది మాటల ద్వారా తెలుస్తుంది.

"రాళ్ళ ని పూజించటం ద్వారా ఎవరైనా దేవుణ్ణి చూడగలిగితే, నేను ఒక కొండని పూజిస్తాను."

అతడు భగవంతున్ని పవిత్ర, శుద్ధ హృదయం తో

పూజించమని ప్రజలకు చెప్పాడు.

"కొందరు ద్వారకకు వెళ్తారు, కొందరు కాశీకి వెళ్తారు, ఇంకొందరు మధురకు, కానీ భగవంతుడు ఆత్మలోనే ఉంటాడని వారు గ్రహించటం లేదు"

— అని చెప్పాడు.

కబీరు ప్రబోధాలు అన్నీ సనాతనులను రెచ్చగొట్టేవిగా ఉన్నాయి.

"రాం, ఖుదా, శక్తి, శివ అందరూ ఒక్కటే. అలాంటప్పుడు పూజలు ఎందుకు వేరుగా? వేదాలు, పురాణాలు, ఖురాన్ ఇవన్నీ విభిన్న రీతుల్లో వర్ణనలు. హిందువు గాని తురుష్కుడు గాని; జైనుడు గాని యోగి గాని రహస్యాన్ని తెలిసినవాడు కాడు"

ఇలాంటి మాటలు సహజంగానే సనాతనులకు మింగుడు పడవు.

సనాతనులు కబీరును మతవిరోధిగా ముద్రించారు. ఈ ద్వేషం క్రమంగా అతన్ని బెనారస్ నుండి వెళ్లగొట్టడానికి కారణమైంది, అతనికి 60 ఏళ్ళప్పుడు ఇలా జరిగింది. 18 ఏళ్ళపాటు అతడు ఉత్తర భారతంలో అనేక నగరాలు తిరిగాడు. పెద్ద శిష్య సమూహాన్ని ఏర్పరచాడు. 20 ఏళ్ళ వయసులో గోరఖ్‌పూర్ సమీపంలో మరణించాడు.

కబీరు మరణానంతరం హిందూ-ముస్లింలు కొట్లాడారు అతని శవం కోసం. కబీరు శిష్యులు దానిపై వస్త్రం తొలగించమంటుంది. శవం స్థానంలో పూలు ఉంటాయి. సగం

పూలుగా మారగా సగం హిందువులు దహనం చేయగా సగం పూలని ముస్లింలు సమాధి లో ఖననం చేశారు అని ప్రచారంలో ఉంది.

కబీరు ప్రబోధ బోధనల నుంచి దిశను పైగా (sects) మతాలు పుట్టుకొచ్చాయి. ఇవన్నీ విగ్రహారాధనని వ్యతిరేకించాయి. హిందూ-ముస్లింలు సమంగా ఆహ్వానించాయి. 'గురు' ప్రాధాన్యాన్ని నొక్కి చెప్పాయి. ప్రాంతీయ భాషలకి పరిమితమయ్యాయి. కాలక్రమంలో ఈ మతాలు చాలా పరిమితమయ్యాయి. హిందూ మత ప్రభావాలకి లోనయ్యాయి. సాధువుల క్రమాన్ని రూపొందించాయి. వీటిలో ఆది ప్రక్రియలో గాంచాడి శిష్య మతాలు.

కబీరు మరణానంతరం కొందరు శిష్యులు అతని కొడుకు 'కమాల్' ను చేరి మతాన్ని స్థాపించమని కోరారు.

"మా నాన్నగారు తన జీవితమంతా గోడ్డు రాల మతాలన్నిటినీ వ్యతిరేకంగా కృషి సల్పారు. అతని కొడుకును, నేనెలా, అతని ఆదర్శాన్ని నాశనం చేయగలను, తద్వారా అతన్ని అపహాస్యంగా హత్య చేయగలను!" అని కమాల్ వారికి సమాధానమిచ్చాడు.

ఏమైనా కబీరు అనుయాయులు స్వతంత్రంగా ఒక మతాన్ని ఏర్పరచారు, అదే కబీరు పంథా (Kabirpanthis).

కబీరు తన బోధనల్ని ఒక గ్రంథం గా క్రోడీకరించలేదు. అతని మాటల ద్వారా బోధించటమే

ఇష్టం. చిన్న చిన్న పద్యాల రూపంలో బోధనల్ని చెప్పేవాడు. అతని శిష్యులు "బీజక" (The Seed Book) గ్రంథంలో సంకలనం చేశారు. కబీరు బోధనలపై ప్రామాణిక గ్రంథం ఇదే. ఇందులో పద్యాలు, పాటలు రుబ రాగాలలో ఉంటాయి. ఇందులో 83 రమైనీలు, 113 శబ్దాలు, 364 సాఖీలు ఉన్నాయి. బీజక్ లోని భాష బెనారస్, మిర్జాపూర్, గోరఖ్‌పూర్ ప్రాంతాలలో ఆ నాడు వాడుకలో ఉన్న హిందీ భాషగా చెప్పబడుతుంది.

* కబీరు బోధనలలో 4 ముఖ్యాంశాలు
  - రచనల మీద ఆధారపడిన మతాన్ని ఖండించాడు
  - విగ్రహారాధనని వ్యతిరేకించాడు
  - కులవ్యవస్థని
  - హిందూ ముస్లిం ఐక్యత కోసం కృషి చేశాడు.

* నాథపంథ యోగులు చెప్పిన ఆరోగ్యాభ్యాసాలు తెలిసినా కబీరు సన్యాసత్వం గాని, పుస్తకాలు నేర్పడం గాని సత్యజ్ఞానాన్ని తెల్పుతాయని & అవసరమైనవని భావించలేదు.

* (స్త్రీ) భార్యాత్వం ఆధ్యాత్మిక పురోగమన క్రమాన్ని రక్షిస్తుంది కాబట్టి సాధువులు రాజస్థానాలకు దూరంగా ఉండమని కోరాడు.

* భగవంతుని ఏకత్వాన్ని నమ్మేడు కాబట్టి కబీరు హిందూ మతాలు ఆ దేవుణ్ని చేరుకొనేందుకు భిన్న మార్గాలేనని చెప్పాడు. అందువలనే హిందువులు, ముస్లింల మధ్య విభేదాలు అర్థం లేనివన్నాడు.

* కబీరు సాంఘిక లేదా సంఘ సంస్కర్త కాదు. అయితే మానవుల ఉత్తమ వ్యక్తిత్వం సంఘాన్ని తీర్చిదిద్దుతుందని విశ్వసించాడు.

* హిందూ, ముస్లిం మతాలకు చెందిన విస్తృతప్రభావం పై కబీరు బోధనల ప్రభావం గురించి భిన్నాభిప్రాయాలు వెల్లడౌతున్నాయి. కబీరు బోధనలు కొనసాగుతున్నా రెండు మతాలూ వాటి స్థిర మార్గాలను కొనసాగిస్తూనే ఉన్నాయి. కులవ్యవస్థలు పట్ల ఉల్లంఘనలూ లేవు. కాలక్రమంలో కబీరు అనుయాయులు కబీరు-పంథీలు ఒక వర్గం గా మిగిలిపోయారు.

అయితే కబీరు కృషిని విశాల దృక్పథం లో చూడాలి. అతను సృష్టించిన అభిప్రాయ వాతావరణం ఎన్నో యుగాల తరబడి పని చేసింది, తద్వారా కబీరు మానవ సమానత్వానికి, హిందూ-ముస్లిం ఐక్యతకు, పట్టి సుద్దుల దొంగ భక్తి వ్యతిరేకతకు, అన్ని రకాల కపటానికి గల వ్యతిరేకతకు ప్రతీకగా నిలిచాడు. ఇది కబీరు సాధించిన ఉత్కృష్టత.

* కబీరు భక్తి ఉద్యమకారులు, సూఫీ సాధువులు ఇరువురితోనూ కలిసి మెలిసి తిరిగేవాడు.

* తీవ్రమత దృష్టి కలిగి ఉన్నా అతను హిందుత్వానికి గానీ ముస్లిం మతానికి గానీ బానిస కాదు. పూర్తిగా స్వాతంత్ర్యమైన ఆలోచనలు గలవాడు. రెండు మతాల యొక్క లోపాలనూ ధైర్యంగా విమర్శించాడు.

* అతడు బ్రాహ్మణులను, ముల్లాలను ఒకే మాదిరిగా

నిరసించాడు. కేవలం బ్రాహ్మణులు, ముల్లాలే వారి మతాల రక్షకులమన్నట్టు నిరసించి వారి సనాతన, దోపిడీ ధోరణులను ఎండగట్టాడు.

* వేదాల యొక్క పురాణ యొక్క జ్ఞాన గ్రంథాలు గా గల పవిత్రతను అంగీకరించలేదు.

* అయితే హిందూ సిద్ధాంతాలైన 'పునర్జన్మ', 'కర్మ' మొదలైన వాటి మీద పూర్తి నమ్మకం ఉంది. జీవిత పవిత్రత కోసం నిలబడ్డాడు. ముక్తి సాధన కోసం భగవంతునికి తనను తాను అర్పించుకోవటం, అంకిత భావంతో కూడిన ప్రార్థన ను మార్గం గా చెప్పాడు.

* పూర్తి సాంఘిక అంటే అప్పుడు ఉన్న దురాచారాలైన 'సతి', 'బాల్యవివాహాల' పట్ల విమర్శలు సంధించాడు.

* కబీరు ఈ ప్రపంచాన్ని త్యజించటం పట్ల విముఖత చూపాడు. అలాగే అనుచరులు వారి స్వయం పోషణార్థం వారికి కష్టించి / చెమటోడ్చి సంపాదించాలని బోధించాడు. అంతేగాక గృహస్థు గా ఉండి అన్ని విధులు నిర్వర్తించాలని అలాగే నిజాయితీ, ఉన్నతత్వం, అంకితమైన జీవితాన్ని గడపాలని చెప్పాడు.

* నిర్గుణ పంథాకు చెందిన కబీరు బ్రహ్మ (దేవుడు), మాయలు అలా నమ్ముతున్నాడు.

సన్యాసి కూడా కాదు. కాని అతడు విగ్రహారాధనకి వ్యతిరేకి. అతను హిందూ మతం.

మాయ అంతా దృష్టి మరలిస్తుంటుంది. మాయ నుంచి విముక్తి అతని కరుణ వల్లనే లభిస్తుంది. భక్తి తో అతని కరుణ పొందవచ్చు.

* భక్తి భావం నిర్మలంగా ఉండాలి. భగవన్నామ స్మరణకు జపమాల అవసరం లేదు. మానసికంగానే, వదలక స్మరించాలి. భగవంతుని తనలోనే వెదుక్కోవాలి. బయట వెతకరాదు.

* తన గురువు రామానందుని నుంచి అహింస, వైదిక విలువలు, భక్తి, ప్రపత్తి లను నేర్చాడు.

* కబీర్ విమర్శలు సూటిగా ఘాటుగా ఉంటాయి. అతడు ఉపయోగించిన పదాలు సాధారణంగా తోచినా అర్థగాంభీర్యం గలవి. అసలు అర్థాలు గ్రహించడమే కష్టం.

* కబీర్ అనుచరుల్లో అత్యధిక సంఖ్యాకులు విద్యలేనివారు, తక్కువ కులాల వారు

# గురు నానక్

నానక్ చైతన్యునకు సమకాలికుడు, కబీరును తన ఆధ్యాత్మిక మార్గదర్శిగా భావించాడు. ఇతడు క్రీ.శ. 1469 లో పుట్టాడు. లాహోరుకు దాదాపు 56 కి.మీ. దూరంలో ఉన్న నాంనకన గా నేడు పిలువబడుతున్న "తాల్వాండి" నందు క్షత్రియ కుటుంబంలో జన్మించాడు. ఇతని తండ్రి "కాలు", ఒక పట్వారి ఖజాందారు. నానక్ ను ఒక స్థానిక పాఠశాలకు విద్య నిమిత్తం పంపారు, కాని అతడు చదువు పట్ల అయిష్టంగా ఉండేవాడు. అతని తండ్రి నానక్ ను వ్యాపారం లో కూడా ప్రవేశింపచేయాలనుకున్నాడు, తద్వారా తనకు వారసుడిగా ఖజాందారు చేయాలని. కానీ నానక్ తరచుగా అడవుల్లోకి వెళ్లి అక్కడి మతగురువుల కదలికల్ని గమనించడం, వారితో చర్చలు జరపడం చేసేవాడు. అయితే నానక్ యొక్క ఈ ఆధ్యాత్మిక దృక్పథం అతని పెళ్లి చేసుకుండా నిరోధించలేదు. అయితే అతను అన్ని రకాల వృత్తుల పట్ల అయిష్టత ప్రదర్శించాడు. అతని బావ, సుల్తాన్‌పూర్ కు చెందిన జైరాము ఒక ధాన్య వ్యాపారి. ఇతడు నానక్ ను తన కింద ఖజాందారు గా నియమిస్తాడు. అయితే ఆ ఖజానాని తప్పుల తడకలుగా నానక్ వృత్తి వదిలి అడవులు పట్టాడు. అక్కడతనికి జ్ఞానోదయం కలిగింది, అతని బోధనల్లో ప్రస్ఫుటంగా కనిపించిన అంశాలు మూడు:

"హిందువూ లేడు, ముసల్మానూ లేడు"

నానక్ వ్యక్తిత్వం, నడతలలో పవిత్రతని విశ్వసించాడు. అతడు 'ఏకేశ్వరుడు' అనే భావనను నమ్మాడు. అతని దీవెనలు పొందటానికి ప్రేమ, నిరంతర ధ్యానం మాత్రమే మార్గాలని తెలిపాడు. ఇతర భక్తి సిద్ధాంతాలాగానే అతడు కూడా విగ్రహారాధనని వ్యతిరేకించాడు, కుల-మత విభేదాలని ఖండించాడు. ఇతనికి కర్మకాండ ఆచారాల పట్ల నమ్మకం లేదు. నదిలో స్నానం చేస్తుండగా నానక్ ఒక బ్రాహ్మణుడు ఆకాశం వైపు నీళ్లు చల్లడం చూసి ఎందుకిలా చేస్తున్నావని అడిగాడు. ఆ బ్రాహ్మణుడు తన భగవంతుడి పాదాలు కడుగుతున్నానని జవాబిచ్చాడు. వెంటనే నానక్ భయంకరంగా నీళ్ళని కొట్టడం ప్రారంభించాడు. ఎందుకిలా చేస్తున్నావని అడిగితే పంజాబులోని తన పొలాలకి నీళ్లు పెడుతున్నానని చెప్పాడు. ఈ విధంగా బ్రాహ్మణ ఆచారాల మీద నానక్ తన నిరసన తెలిపాడు.

నానక్ తన భావాలన్నిటినీ చెప్పినదే "రెబెక్" (or) rabab అనే వాయిద్యం సహాయంతో

పాటలూ (hymns) వినిపించేవాడు. రెబెక్ అనే ఈ
తీగ వాయిద్యాన్ని నానక్ కు గొప్ప శిష్యుడైన, అతని
కోసం బాల్యం నుండి సుల్తాన్‌పూర్ లో చేరిన "మర్దానా"
వాయించేవాడు. నానక్ భారతదేశమంతా పర్యటించాడు,
ఇంకా శ్రీలంక, మెక్కా, మదీనా లను కూడా దర్శించాడని
తెలుస్తుంది.

అతని మతం ఒక్కమాటలో చెప్పాలంటే
ఏకేశ్వరోపాసన
భగవంతుని విశ్వాసం, మానవ సౌభ్రాతృత్వం. ఇతడు
హిందూమతం నుంచి అంతర్లీనంలో చిందిన మార్మికతను,
సూఫీ / లేదా ఇస్లాం నుంచి దాని రాజీపడని ఏకేశ్వరోపాసన
దృష్టిని గ్రహించాడు.

నానక్ క్రీ.శ. 1538 లో మరణించాడు —
పంజాబు లోని కర్తార్‌పూర్ వద్ద. అతని సొంత కొడుకుల
లో తృప్తి కలుగక 'అంగద' ను తన వారసుని గా
ప్రకటించాడు.

నానక్ బోధనలు శ్లోకాల పవిత్రగ్రంథం
"ఆది గ్రంథ" లో (గ్రంథ సాహెబ్) కనిపిస్తాయి.

"మతం వట్టి మాటల్లో ఉండదు.
అందర్నీ ఒకటి గా చూసేవాడిలోనే మతం ఉంది.
సమాధుల చుట్టూ, స్మశానాల చుట్టూ తిరగడంలో మతం లేదు
ధ్యాన ముద్రల్లో కూర్చుండిపోవడం లో మతం లేదు

చెవి జూకాల్లో, కేయూరమున్న గుండులో మతం లేదు
ఉత్సవ స్థలాల్లో స్నానం చేయడంలో మతం లేదు
ప్రపంచం లోని అపవిత్రతల మధ్య పవిత్రంగా ఉండు
మతం యొక్క మార్గం నీకప్పుడు కనిపించుచుండు"

నానక్ తీవ్ర స్వాభిమానులకి, సుఖాల లోలులకి మధ్య మార్గాన్ని చెప్పాడు. కపటం, స్వార్థం, అసత్యం మొ|| వాటికి నానక్ వ్యతిరేకి. తన శిష్యుల్ని వాటిని దూరం చేయమని తెల్పాడు.

నానక్ యొక్క అనుయాయులు స్వతంత్ర మతాన్ని నెలకొల్పారు - శిఖ్ మతం. కబీరు పంథీలు కింది కులాల వారు, వృత్తికారుల నుంచి, రైతుల నుంచి చాలా మంది శిష్యుల్ని పొందారు. సామాన్య జీవితానికి ప్రాధాన్యమివ్వడం, అర్థంకాని ఆచారాలు లేకపోవడం, మొ|| వారిని బాగా ఆకర్షించాయి. పైగా కబీరు, నానక్ ఇరువురి బోధనల్లోనూ నిజాయితీ, ఇంగితం, ఆచరణాత్మకత ఉన్నాయి, ఇవి సమకాలీన వారిని ఆకట్టుకున్నాయి. ఇద్దరూ సాధారణ సమతూక జీవితాన్ని సమాజంలో భాగంగా ఉండే జీవనాన్ని చెప్పారు. సాంఘిక సమానత్వానికి వారు ఇచ్చిన పిలుపు అయస్కాంతం లాగా పని చేసింది. ఇద్దరూ కులాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. కేవలం భిన్న భక్తులు కలిసి ఉండడం, సన్యాసి జీవనం చేయడం మీద దృష్టిపెట్టక

గారు సంఘర్షణ సమాచార్య వాలితవాదాల పై పునర్విలోకించా-లని కోరారు. (ప్ర)జలు, ముఖ్యంగా ఉన్నతవర్గాల హిందువుల చేత, ఉన్నతవర్గాల ముస్లింల చేత అవమానాలు భరిస్తున్న వాస్తవకళాకారులు కులాలు వీడి ఈ కొత్త క్రమం లో చేరడం ద్వారా కులం జాతి మతాల తప్పించు కోవచ్చని తెలిపారు.

అయితే ఈ రెండింటిలో సిక్కులు మాత్రమే స్వతంత్ర మతంగా ప్రఖ్యాతి చెందగలిగారు. దీనికి ముఖ్య కారణం కబీరు హిందూ ముస్లింలకు తెలిసిన భగవంతుని నామాలనే పదే పదే ఉచ్ఛరించేవాడు. దాంతో కబీరుపంథీలు క్రమేణా హిందూ మతంలో ఒక శాఖ అయ్యారు. కానీ సిక్కులు మాత్రం హిందూ, ముస్లిం మతాల బాహ్య ఆచారాలు, నామాలు మొ॥ అన్నింటినీ పూర్తిగా వ్యతిరేకించారు. ఇది సిక్కులలో తాము నూతన ప్రత్యేక మతానికి చెందిన వారమన్న భావనను బలపర్చింది.

* వ్యక్తిత్వాలను, నడతలను పవిత్రత భగవంతుని చేరడానికి ప్రథమ నియమం గా నానక్ చెప్పాడు. దాంతో పాటే గురువు యొక్క అవసరానికి కూడా ప్రాముఖ్యత నిచ్చాడు.

* నానక్ కు నూతన మతాన్ని స్థాపించాలన్న ఆలోచన, కోరిక లేదు. ఆయన మతపరమైన రుచి అంటూ హిందూ మతం, ఇస్లాం ల మధ్య అగాధాన్ని తొలగించి శాంతి, మంచితనం, పరస్పర సహకారాలతో నిండిన వాతావరణాన్ని సృష్టించేందుకే.

* నానక్ కూడా కబీరు వలెనే తన కాలం నాటి పాలకులను విమత నిరంకుశులుగా తలిచాడు. (irreligious tyrants) అయితే కబీరు కు భిన్నంగా నానక్ ఆదర్శ రాజ్యాన్ని గూర్చి చెప్పాడు. ఇది సత్యే-రాజు చేత అధిష్టింపబడుతుంది. ఈ సత్యేరాజు (or) సత్యవేత్త అయిన పాలకుడు నీతి, న్యాయం, సమానత్వాలను తన నడత కు ఆధారాలు గా కలిగి ఉంటాడు.

* పంజాబులో హిందూ-మత సంస్కరణలు చేశాడు.

* నానక్ కబీరు కంటే విప్లవాత్మకమైన దృక్పథం గలవాడు.

* మహాలా క్షత్రి (ప్రాచీన క్షత్రియ) వంశీయుడైన కాలురాం, త్రిప్తా దేవి లకు జన్మించాడు. ఇతని భార్య సులాక్షిని.

* నానక్ జరిపిన 5 భ్రమణాల పర్యటనల్లో (వీరిని udasis అంటారు.) దాదాపు

30 ఏళ్ళ పాటు దేశ పర్యటనలు చేస్తూ తన దివ్య ప్రార్థనా బోధనను ప్రచారం చేశాడు.

* తన శిష్యులకు నిజాయితీ గల సంపాదనతో, గృహస్థులుగా ఏ విధంగా జీవితే కమలం బురద నీటిలో మునిగిపోకుండా జీవిస్తుందో ఆ విధంగా బతకమని చెప్పేవాడు.

* తన చివరి రోజులలో (శంకరాచార్యుల మఠాల్లాంటి, సూఫీల ఖానఖాల్లాంటి) కర్తార్‌పూర్ నందు డేరా dehra ను ఏర్పరిచాడు. ఆదర్శ గృహస్థుగా నిలబడటానికి గాను తన కుటుంబాన్ని తోడుగా కలిశాడు, వ్యవసాయం చేశాడు.

* అతడు తన డేరా నందు సామూహిక భోజనాలు - "లంగర్" లను ఏర్పాటు చేసేవాడు. తన శిష్యుల్లో కుల విచక్షణ, అంటరానితనాల చెడుగుల్ని రూపుమాపడానికి తన శిష్యవర్గంతో నానక్ ఏర్పాటు చేసిన ఈ సామూహిక భోజనాలు సమానత్వం కోసం తీసుకున్న ఆచరణాత్మక కార్యక్రమం.

He introduced community lunch (langar) at his dehra as a practical step to eradicate the evils of caste discrimination and untouchability from among his followers.

* నానక్ గర్వభావం తొంగి చూడనీయని వాడు. అందువల్లనే గాబోలు ఉన్నత వర్గాల వారు కూడా ఆతని బోధనలను విని పాటించారు.

* సాంఘిక లోపాలను ఖండించేటప్పుడు సాధారణ భాషనే వాడాడు.

# చైతన్య ప్రభువు [క్రీ.శ. 1486 – 1533]

[బెంగాలు నందు భక్తి మార్గాన్ని ప్రవచించిన వారిలో అగ్రగణ్యుడు చైతన్యుడు.] అతడు చిన్న వయసు నందే భాగవతముల్ని చదువుతున్నాడు. [ఇతని అసలు పేరు విశ్వంభర], స్నేహితులు పిలిచే పేరు నిమాయి. ఇతడు క్రీ.శ. 1486 లో సిల్హెట్ నుండి నవద్వీప / నాడియా కు వలస వెళ్ళి స్థిరపడ్డ బ్రాహ్మణులలో జన్మించాడు. నాడియా లో ఉన్నత విద్య చెప్పే tol లోల నందు సంస్కృత భాష, సాహిత్యం నేర్చుకున్నాడు. తన తండ్రి మరణానంతరం ఇతడే స్వయంగా ఒక టోల్ ను ప్రారంభించాడు తెలుస్తుంది. ఇతని మొదటి భార్య వెంటనే చనిపోవటంతో రెండో పెళ్ళి చేసుకున్నాడు.

తనకు 22 ఏళ్ళప్పుడు మరణించిన తన తండ్రి కి పిండాలర్పించేందుకు గయకు వెళ్ళాడు. [గయలో "ఈశ్వరపురి" అనే సన్యాసి ఇతనికి కృష్ణ మంత్రాన్ని ఉపదేశించాడు. దానితో చైతన్యుని మతదృష్టి పూర్తిగా మారిపోయింది. భగవత్ ప్రేమం నిమిత్తం భక్తునిగా మారిపోయాడు.] అతన్ని కప్పిన మార్మికత తో పాటు ఇతని సహజన భావావేశ స్థితి కలిగించింది. ఫలితంగా అతడు నిరంతరం కృష్ణ నామాన్ని జపించడం, పెద్దగా నవ్వడం, మూలగడం, పారవశ్యం లోకి వెళ్ళడం, తరచుగా జ్ఞాన నిద్ర (trance) లోకి వెళ్ళేవాడు. ఇతని విజ్ఞానంతో, అమూల్యమైనత్వం అతని కి ఎంతో మంది అనుయాయుల్ని

సంపాదించి పెట్టింది. అతని తొలి శిష్యులు అద్వైత, నిత్యానంద. వీరిద్దరూ అతనికి మంచి సహాయకులు లా కొత్త ప్రయోగాలను చేయటానికి తోడ్పడ్డారు.

భగవంతుని పాటలను, కీర్తనలు "సామూహికంగా పాడటం", పెద్ద ధ్వని చేసే వాయిద్యాల తోడుగా కృష్ణ, హరి నామాలను కూడా పెద్దగా ఉచ్చరిస్తూ ధ్యానం చేయటం చేసేవారు. రెండవ మాధ్యమంగా నాదియా వీధుల గుండా "ఊరేగింపులు" చేయడం చెప్పవచ్చు. ఈ ఊరేగింపులు పెద్దగా పాడడం, పారవశ్యులై స్త్రీలలా నృత్యాలు చేయడం మొదలైనవి కూడ ఉండేవి. శిష్యులందరూ ప్రతిరోజూ శ్రీనివాస లేదా భక్తుని ఇంట కలిసేవారు. ఇక్కడ కలిసి కీర్తనలు పాడడం, పారవశ్యంతో నాట్యం చేయడం తీవ్ర స్థాయిలో జరిగేవి. శిష్యులు తరచూగా తమను తాము మరచిపోయి జ్ఞాననిద్రలోకి చేరిపోయేవారు. ఈ విధమైన పకాల, విజయాలతో కూడిన సామూహిక కార్యక్రమం సామాన్య ప్రజానీకాన్ని వారివైపు ఆకర్షించింది.

అయితే నాటి సనాతన వర్గాలకి, బ్రాహ్మణ్య వర్గాలకి ఈ చర్యలు ఏ మాత్రం రుచించలేదు. వారి ఆరోపణల మేర నాటి ముస్లిం గవర్నరు వీరి చర్యల్ని బహిష్కరించాడు. అయితే చైతన్య

క్రమం మొత్తం మీద ఏకమొత్తంగా విధించిన బహిష్కరణ
చివరికి ఎత్తివేయాల్సి వచ్చింది. కొందరు ఆ నష్టం గవర్నరుల
కలిసి భగవంతుని ఉపదేశం అందించని, అందువల్లే నిషేధ
ఆజ్ఞను వెనక్కి తీసుకున్నాడని చెబుతారు.

(క్రీ.శ. 1510 జనవరిలో విశ్వంభర
కేశవ భారతి ద్వారా సన్యాసం స్వీకరించాడు. పైగా
'శ్రీకృష్ణ చైతన్య' అనే ఉత్త నామం ధరించాడు.) దీని
సంక్షిప్త రూపం 'చైతన్య' పేరనే అతడు ఖ్యాతిగాంచాడు.
కృష్ణుడు నివసించిన బృందావనంలో నివసించాలని చైతన్యుడు
అనుకున్నా (తన తల్లి కోరిక మేరకు 'పూరీ' లో స్థిరపడ్డాడు.)
'పూరీ' నే తన కేంద్ర స్థావరం చేసుకున్నాడు. అక్కడ
ప్రతాపరుద్ర గజపతి, ఒరిస్సా రాజు ; మరియు
వాసుదేవ సార్వభౌమ చైతన్యుని శిష్యులయ్యారు. ఇచట
ప్రజలు మరియు ఆచారం, ఉత్సుకత కలిసి కొద్దీ చేత చైతన్య
మతం ఈ ప్రాంతంలో బలమైన, విస్తృతమైన పునాదిని పొందింది.

(పూరీ నుంచి చైతన్యుడు విస్తృతమైన
మత పర్యటనలు జరిపాడు — దక్షిణ, పశ్చిమ, ఉత్తర
భారతాలలో.) బృందావనాన్ని చూసి చైతన్యుడు
అసహ్య పడాల్సి వచ్చింది. ఇక్కడ ప్రజలు ఆ స్థలం,
కృష్ణుడు పుట్టిన ఆ స్థలం పట్ల చాలా నిర్దయగా
ఉన్నారు, ఆ ప్రాంతమంతా మురికి కూపంలా ఉంది.
చైతన్యుడు బెంగాల్ నుంచి రూప, సనాతన అనే ఇద్దరు

మురికి కూపం లాంటి బృందావనాన్ని ఉన్నత వైభవం కి పూర్వ వైభవం కలిగించాడు.

వైష్ణవుల్ని పంపాడు. వారి కృషి ఫలితంగా ఆ
ప్రాంతం సాంస్కృతిక వైభవం పొంది ముఖ్య మత ప్రదేశం ఏర్పడింది.
దీంతో ఉత్తర భారతంలో వైష్ణవం ఉన్నత స్థితి పొందింది.

క్రీ.శ. 1515 కల్లా చైతన్యుడు పూరీ లో
స్థిరంగా ఉండాలని నిశ్చయించుకున్నాడు, క్రీ.శ. 1533 లో
అతడు మరణించాడు. పూరీ లో అతని నివాసం
ఫలవంతమైంది. చాలా మంది అతని ప్రేమతత్వాన్ని
అనుసరించారు. అతని జీవితంలోని చివరి 12 ఏళ్ళు
చైతన్యుడు చాలా తరచుగా రోజుల తరబడి జ్ఞాననిద్ర
లోకి వెళ్ళిపోయేవాడు. అలాంటి ఒక జ్ఞాననిద్రలోకి
అతడు మరణించాడని అంటారు. వైష్ణవులు దీన్ని
భగవంతుని ప్రేమ పిచ్చి – దివ్యోన్మాద లేదా
ప్రేమోన్మాద అని చెప్తారు.

[చైతన్యుడు నిజాయితీ, ఉద్దేశాలు
నిండిన ప్రేమ భగవంతుడిపై ఉంచటం ద్వారా మాత్రమే
ముక్తి పొందుతారని చెప్పాడు.] తనను తాను గా
రాధా-కృష్ణ తత్త్వం లో పూర్తిగా మునిగిపోయాడు.
అతని దృష్టిలో కృష్ణుడు కేవలం విష్ణుమూర్తి అవతారం
మాత్రమే కాదు, అతడు దివ్యత్వం యొక్క అత్యున్నత
భావం. దివ్య జీవితం యొక్క పారవశ్య శక్తిని
వెల్లడించే అత్యున్నత శక్తి లో కృష్ణుడు పైనే
ఉన్నాడు, ఈ అత్యున్నత శక్తియే రాధ

అని చెప్పాడు.

భక్తుని యొక్క ధ్యేయం అత్యున్నత స్థితి అయిన 'మాధుర్య' చేరుకునేంత వరకూ భక్తి యొక్క నిచ్చెన ను ఎక్కడమే. ఈ మాధుర్య స్థితి లో భక్తుడు పారవశ్యం లో తనను రాధ గా తాదాత్మ్యం చెందుతాడు, అంతేగాక పారవశ్య దశ ఉన్న కృష్ణుని లో విశ్వం పొందటం చేస్తాడు.

రాధ అంటే మరేదో కాదు, కృష్ణుని లో ప్రేమ పారవశ్య సంద్రం లో మునిగిన జీవాత్మయే. అందువల్ల రాధ, అంటే ఆదర్శీకరించబడిన ప్రేమ తప్ప మరేదీ కాదు. [కృష్ణుని పట్ల వ్యక్తి కృష్ణుణ్ణి శాశ్వతంగా ఒక దేవుడిగా, స్నేహితుడిగా, బిడ్డగా అన్నిటికీ ఒక ప్రేయసి గా ప్రేమించడమే మనిషి యొక్క అత్యున్నత ఆశయం, అంతేగాని ముక్తి కాదు. అయితే అతని ప్రేమలో శారీరకం ఏమీ ఉండదు. నిజానికి చైతన్యుడి శిష్యులు స్త్రీలతో ఎప్పుడూ సంభాషణ కూడా చేయ రాదన్నది ఒక నియమంగా ఉండేది.] ఒక వృద్ధ వైష్ణవ భక్తురాలి తో తన శిష్యుడొకరు మాట్లాడారన్న విషయం తెలిసి చైతన్యుడు అతని ముఖం కూడా చూడలేదు.

[చైతన్యుడు హరి, కృష్ణ నామాల జపాన్ని పవిత్ర మంత్ర పఠనంగా మార్చాడు. అతడు విశ్వప్రేమ, విశ్వ సౌభ్రాతృత్వాల్ని భగవంతుని ప్రేమించటానికి ప్రథమ సోపానాలని చెప్పాడు. అతడు గొప్ప మార్మికుడు.] జీవించి ఉన్న కృష్ణుని గా భావించే చైతన్యుని చుట్టూ గొప్ప ప్రజా ఉద్యమం బయలు దేరింది. ఇతడు రాధాకృష్ణుల

అవతారంగా భావించబడేవాడు ;

చైతన్యుడు తాను తన సంకీర్తనల్లో వెళ్లి చిందులేసేవాడు. భక్తులు సమూహంగా పాటలుపాడే కార్యక్రమం ఉండేది. ఈ పాటల్లో సాధారణంగా తంబూర శబ్దాలకు అనుగుణంగా పాడుతున్నప్పుడే వారితోపాటు నాట్యం చేయడం కూడా ఉండేది. జీవితచరిత్రలు, పద్యాలు, గాథలు, నాటకాలు మొ|| రూపాల్లో చైతన్యుని చుట్టూ అతిపెద్ద సాహిత్యం పుట్టుకొచ్చింది.

[ చైతన్యుని శిష్యులు / చైతన్యులు సాధువు సన్యాసులు కారు. కులవ్యవస్థ ని రూపుమాపడం వారి ధ్యేయం కాదు. కానీ తమ ఆధ్యాత్మిక ఉద్యమంలో మాత్రం వాళ్లు ఉన్నత కులాలు, కుల వివక్షతలను నిరాకరించారి, దాంతో ఒక విధమైన సమానత్వ భావాన్ని కలిగించారు, ఇది బెంగాలీయుల జీవితాల్లోకి చొచ్చుకు పోయింది. చైతన్య శిష్యుల్లో చాలామంది ఎందరో మాత్రం లేని తక్కువ కులాల నుంచి వచ్చినవారే. కొంతమంది ముస్లింలు. చైతన్యుని తర్వాత గొప్ప నాయకుడైన హరిదాస్ కూడా ఒక ముస్లిమే. ]

చైతన్యుని తర్వాత ఎన్నో చైతన్యమత శాఖలు వెలిశాయి. వాటన్నింటిలో ఎక్కువ ప్రాచుర్యం పొందింది మాత్రం "బెంగాల్ సాంప్రదాయం". చైతన్యుని అనుయాయులు సాధారణంగా తులసి పూసలతో

చేసిన మూడు దారాల నెక్లెస్ ను, అలాంటిదే 25 రోసరి (Rosary) ను ధరిస్తారు. మూడు తలాబ్బాల పాటు కృష్ణుడు, చైతన్యుడు బెంగాలీ సంస్కృతికి స్ఫూర్తి నందించారు.

* ఇతడు జంతుబలి, మద్యపానం, మాంస భక్షణాలను ఖండించాడు.

* చైతన్యుడు మధుర, బృందావనాల్లో చాలా కాలం ఉండి లక్షల మంది భక్తులను ఆకర్షించాడు.

* పేదల, అణగారిన వర్గాల (sati) చూసి అతని హృదయం జాలి తో కరిగిపోయేది (melted with pity)

* లోని బట్టీ గుప్తల వలె చైతన్యుడు కూడా సంగీత సహిత్య వేదా కీర్తనల్లో ఆధ్యాత్మిక అనుభవ సాధనంగా ప్రచారం చేశాడు. ఇందులో భగవంతుని నామం మీద్నే జపించడం చేత బయటు ప్రపంచంతో సంబంధం తెల్పుతారు భక్తులు.

* ఇతడు పవిత్ర గ్రంథాల్ని, విగ్రహారాధనను వ్యతిరేకించ లేదు. అయినంత మాత్రాన అతన్ని సంప్రదాయవాదిగా వర్గీకరించరాదు.

* చైతన్యుని కీర్తనలు భావ కల్పంలో అద్భుతాల స్థాయిలను అందుకున్నాయి. దారంలో పాటే ఆర్జులు, మతాల సరిహద్దుల్ని ఛేదించిన ప్రేమతత్త్వం కూడా పొంగులు వారుతుంది.

* ఇతను కూడా వేరందూ మత వ్యక్తుల ప్రాంతాలలోని వాడే. వేదాంతాల్లో చెప్పిన ఆత్మలు – భగవంతునిలో

అతని సృష్టి అయిన ఈ ప్రపంచం ప్రాథమికం గా నిత్యం చెందటమే అతని బోధనల పరమార్థం కూడా.

* "ఏ ప్రాణి కృష్ణుని స్మరిస్తూ తన గురువుకు సేవ చేస్తూ ఉంటే, అతను భ్రాంతి పొరల నుంచి విముక్తుడై కృష్ణుని పాదాలను చేరతాడు"

— చైతన్యుడు

* ప్రేమ, అంకితభావం, పాట, నాట్యాల ద్వారా ఒక పారవశ్య స్థితిని పొందవచ్చని ఆ స్థితిలో భగవంతుని చూడగలమని తెలిపాడు.

* బ్రాహ్మణుల ఆధిక్యతను, మతం యొక్క బాహ్య ఆచారాలు, ఉత్సవాలు మొ॥ వాటిని వ్యతిరేకించాడు.

He believed that through love and devotion, song and dance a state of ecstacy could be produced in which the personal presence of God would be realized.

# Chapter - 19

## Society, Culture, Literature and the Arts in Vijayanagar Empire.

Society → M.A. Guide page: 253.

Culture → M.A. Guide page: 269

## * Art in Vijayanagar Empire *

క్రీ.శ. 13 - 16 శతాబ్దాల మధ్య విలసిల్లిన విజయనగర సామ్రాజ్యం అది విస్తరించిన విభిన్న ప్రాంతాలలోని కళలు, సాంస్కృతులు తనలో కలుపుకొనుటచే, కాలక్రమంలో నూతన సంస్కృతి ఆవిర్భావానికి కారణం అయ్యింది. అందువలన విజయనగర కళా సాంస్కృతులు చోళ, హొయసలులు, చాళుక్య తదితర చిన్న వంశాల యొక్క కళా సాంస్కృతుల సమ్మేళనము అని చెప్పవచ్చు.

### వాస్తు

విజయనగర కాలపు వాస్తు ను క్రింది విధంగా విభజించవచ్చు.

1) హిందూ దేవాలయ వాస్తు

2) జైన వాస్తు

3) ఇండో - సరసెనిక్ వాస్తు (నిర్దిష్ట హిందూ చిహ్నాలు గల ఇస్లామిక్ భవంతులు)

4) కోటలు, భవంతులు, కళా ప్రాంగణాలు, సాంస్కృతిక గృహాలు మొదలగు లౌకిక కట్టడాలు.

## విజయనగర కాలపు వాస్తు సౌందర్య లక్షణాలు:

1) ప్రాముఖ్యమైనటువంటి భవంతుల నిర్మాణంలో గ్రానైటు విరివిగా వాడబడేది. గ్రానైటు స్థానికంగా, సులభంగా దొరకని ప్రాంతాలలో కూడా గ్రానైటునే విరివిగా వాడటం విశేషం.

2) విజయనగర భవంతుల్లో చాలా వరకు, ఉదయం ప్రారంభం లోని సంగమ, తుళువ వంశాల వారి వరకైనా రాతి కట్టడాల్లో మోర్టారు అసలు వాడేవారు కాదు. మోర్టారు వాడకం వారికి బాగా తెలిసినప్పటికీ దాన్ని వాడక పోవటం విశేషం. ఆయా కట్టడాల్లో వాడే పెద్ద పెద్ద గ్రానైటు రాళ్లు ఎంత పెద్దగా/ భారీగా, బరువుగా ఉండేవంటే, ఎంత అందంగా ఖచ్చితంగా ఒకదానిలోకి ఒకటి ఇమిడి పోయేవంటే అసలు ఏ సిమెంటుగాని లేదా ప్లాస్టరింగ్ పదార్థమే అవసరమనిపించేది కాదు.

అయితే కట్టడాల్లో మోర్టారు వాడనందున రాళ్ల మధ్యగల చిన్న ఖాళీల్లో వృక్షజాలం పెరిగి క్రమంగా విజయనగర భవంతులు పాడుపడటానికి కారణమయ్యింది.

3) ఆలయాల్లో ప్రతిష్ఠించే విగ్రహాలు గాని, ఇతర స్వతంత్ర శిల్పాలు గాని తప్పనిసరిగా క్లోరైట రాయితో చేయబడేవి. ఇది ముదురు ఆకుపచ్చ రాయి. ఇది మృదువైన రాయి కావడం చేత సూక్ష్మ శిల్ప అలంకరణలకు, ప్రకాశమానమైన పాలిష్ కు అనువుగా ఉండేది. ఇలాంటివి చాలా శిల్పాలు రాతివాటివి గాక కంచు శిల్పాలు గా కన్పించేవి. కొన్ని శిల్పాలు హొయసాళులు, బేలూరు, హాలేబీడు లందలి ( soapstone )

సొమెస్సైన శిల్పాల ను పోలి ఉండేవి. పైగా ఈ బ్రాకెట్ రాతి శిల్పాలు గ్రానైట్ విగ్రహాలతో పోల్చినప్పుడు గొప్ప కళా పాటవం కలవిగా కన్పడుతాయి.

4) విజయనగర కాలంలోని స్తంభాలు ఆ దేవాలయాల్లో ఉన్న లేదా భవనాల్లో ఉన్న గొప్ప వైవిధ్యం చూపిస్తాయి. ఈ స్తంభాలు గట్టి, భారీ రాతి నిర్మాణాలు. బహుముఖాలు గలవి. స్తంభం కింది భాగంలో విస్తృతమైన అలంకరణాలు ఉంటాయి. అలాగే అతి చక్కగా చెక్కబడిన బ్రాకెట్- బొమ్మలు కూడా ఈ (bracket - figurines) స్తంభాల ప్రత్యేకత.

హిందూ దేవాలయాలు

విజయనగర కాలంలో దేవాలయం చాలా సంక్లిష్ట నిర్మాణం, విస్తృత సంస్థ అయ్యింది. ఎన్నో హాలులు (halls), మండపాలు (Pavilions) అనేక అవసరాల కోసం కొత్తగా నిర్మించబడ్డాయి.

చిన్నగా, సాదాగా, శిల్పాలు లేకుండా ఉండే చోళుల "గోపురం" విజయనగర కాలంలో ఐదు, పదు, తొమ్మిది లేదా పదమూడు అంతస్థుల ఎత్తు దాకా పెరుగుతూ పోయింది. గోపురం పైకి వెళ్లే కొద్దీ పిరమిడ్ ఆకారంలో కుచించుకుంటూ ఉంటుంది. పైగా గోపుర శిఖర భాగంలో రాతి లేదా కంచు కలశాలు లేదా ఇతర శిల్పాలు అలంకరించబడేవి. మొత్తం గోపురం అంతా పెద్ద ఎత్తున కూడా ఖాళీ లేకుండా చక్కగా అలంకరణాలు చెక్కబడేవి. గోపురాల

బయట గోడలలో గల గూళ్ల (niches) లో శైవ, వైష్ణవ దేవుళ్ల విగ్రహాలు అలంకరింపబడేవి.

చోళుల కాలంలో చిన్నగా ఉండే ప్రధాన గర్భగుడి కి దేవాలయ మహామండపానికి గల చిన్న దారి ని "అంతరాళ" అనేవారు. ఇది విజయనగర కాలంలో పెద్ద దారి గా మారి దాని గోడలపై శిల్పాలు అలంకరింపబడ్డాయి. ఈ కాలంలో దీన్ని "అర్ధమండపం" అనేవారు. కొన్ని దేవాల-యాల్లో ఈ అర్ధమండపాల మీద గోడలపై దివ్యమైన చిత్రాలు కూడా చిత్రింపబడి ఉండేవి. అర్ధమండపాన్ని ప్రధాన దేవతా విగ్రహాలలో వాడే స్నానాసనమూర్తి ని భద్ర పర్వతానికి గానూ వాడేవారు. అర్ధమండపం యొక్క బయట గోడలు కూడా విపరీతమైన శిల్ప అలంకరణలతో నిండి ఉంటాయి.

దేవాలయాల్లో వంద స్తంభాలు గల "నూరుకాల మండపం", వేయి స్తంభాలు గల "అయిరంకాల మండపం" ఉండేవి. సాధారణం గా ఈ వేయిస్తంభాల మండపంలో వేయి స్తంభాలు ఉండేవి కావు. పెద్ద హాల అనేక వరుసల స్తంభాలతో కూడి ముచ్చట గొల్పేటట్లుంటుంది.

దేవ, దేవతల వివాహ మహోత్సవం కోసం ఉద్దేశించబడిన "కళ్యాణమండపం" లో ఏటా ఆలయం లో వివాహోత్సవం జరిగేది. ఈ మండపం ఆలయప్రాంగణంలో విజయనగర కాలంలో కొత్తగా కలుప బడింది. ఈ మండపాలు సాధారణంగా, అనేక స్తంభాలు గల నిర్మాణాలు. ఇవి సాధారణంగా ఆలయానికి (ప్రాంగణానికి) ఎడమ మూలన నిర్మించబడేవి. (left corner of the courtyard) ఇన్నింటికి వెలుపలి ఆలయం లో నుంచి, బయట నుంచి స్వతంత్ర ద్వారాలు ఉండేవి. వీటికి తొలిచబడ్డట్లుగా (perforated) అనేక కిటికీలు ఉండేవి. మండపానికి ఒక మూల లేదా మధ్యన వేదిక ఉండేది, దీని మీద కళ్యాణం చేసేవారు.

మతాచార ప్రకారం దేవ దేవతల విగ్రహాల్ని ఉయ్యాల్లో ఊపేందుకు గాను కళాత్మకంగా చెక్కబడిన అందమైన ఉయ్యాలలు గల "ఊంజల్ మండపం" ఉండేది.

ఆలయప్రాంగణం లోని "వసంత మండపం" నందనవనం (ఆలయ తోట) మధ్యలో కట్టబడేది. దక్షిణ భారత తీవ్ర వేసవి కాలంలో దేవతలు చల్లని ప్రాంగణాలు కోరుకుంటారని ఇవి తోడ్పడేవి.

ఆలయంలోని కోనేరు మధ్యలో "నీరాడం మండపం" కట్టేవారు. దీని చుట్టూ

ఫలితంగా హిందూ, ముస్లిం వాస్తుశిల్పాల సమ్మేళనం జరిగింది. ఈ నూతన "ఇండో - సరసెనిక్ వాస్తు" విజయనగర పాలకులకు దక్షిణాది ముస్లిం రాజ్యాలతో గల సంబంధముల యొక్క ప్రత్యక్ష ఫలితమే. అంతఃపురమందు కాలంలోని హిందూ వాస్తు లింటెల్ ఈ కొత్త భవనాల్లో కోణం గల ఆర్చీలతో, వృత్తాకార డోములతో (ఇస్లాం శైలికి చెందినవి) స్థానభ్రంశం పొందింది. ఈ కొత్త శైలికి హంపి లోని జెనానా లో గల "పద్మమహల్" [Lotus Mahal] మంచి ఉదాహరణం. హంపి లో శిథిలమైన హిందూ దేవాలయం పై కట్టబడిన మసీదు అలాంటి శిథిలాలు కనిపిస్తాయి. ఇండో - సరసెనిక్ శైలికి రామరాయల గుబురు ఆర్చీలతో కూడిన కోశాగారాన్ని మరో ఉదాహరణగా చెప్పవచ్చు.

లౌకిక కట్టడాలు:

హంపి కోట లోపల ఒక పెద్ద బేస్‌మెంట్ కనిపిస్తుంది. ఇది విజయనగర రాజుల "దర్శనశాల"/ఆస్థానం (audience hall) గా భావిస్తున్నారు. దీని ప్లాట్‌ఫాం యొక్క పై భాగం దాని పై ఆరు వరుసలలో స్తంభాలు ఉన్నట్లుగా చూపబడింది. హంపి లోని మరో చెప్పుకోదగ్గ నిర్మాణం (throne platform) "సింహాసన వేదిక". దీనినే విజయ గృహము అంటారు. కృష్ణదేవరాయలు ప్రతాపరుద్ర గజపతి పై విజయం సాధించిన తర్వాత దీన్ని నిర్మించాడు కాబట్టి దీనికా పేరు వచ్చింది. ఈ సింహాసన వేదిక పై నుండి విజయనగర రాజులు

విటూ కరిగే మహానవమి ఉత్సవాల్ని తిలకించేవారు. ఈ వేదిక కింది భాగం లో శిల్పాలు అలంకరించ-బడ్డాయి. హంపి కోట కాకుండా విజయనగర రాజులు ఇంకా దేశ రక్షణ కోసం ఎన్నో కోటలు కట్టించారు. హంపి యే రక్షణ దృష్ట్యా ఏడు కోట గోడల చేత చుట్టబడి ఉండేదని తెలుస్తుంది. కోటలకు కందకాలు, భారీ ద్వారాలు, పెద్ద గోడలు, బురుజులు, బురుజుల మీద బుర్జ గదులు మొ॥ ఉండేవి. విజయనగర రాజుల అనంతరం వచ్చిన నాయక రాజులు ఈ కోటలు కట్టే సంప్రదాయాన్ని ఉదయగిరి, చంద్రగిరి మొ॥ ప్రాంతాల్లో కొనసాగించారు, వీటిని చాలా ప్రాంతాల్లోని కోటలు విజయనగర కాలానికి గా చెప్పదగినవై ఉంటాయి.

M.A.

## Extra points

Mehta * తుంగభద్ర కు దక్షిణాన గల పలు ప్రఖ్యాత దేవాలయాలు విజయనగర కాలంలో నిర్మించబడినవే. కుంభకోణం, కాంచీపురం, శ్రీరంగం, తాడిపత్రి, వెల్లూరు ఇంకా తిరుచిరాపురం మొ॥ చోట్ల చూడదగ్గ కట్టడాలు.

BT

విజయనగర కాల వాస్తు లోని చివరి దశ (last phase) "మదుర శైలి" ద్వారా తెలుస్తుంది. ఇది విజయనగర సామ్రాజ్యం పతనమైన తర్వాత కూడా కొనసాగింది. ఈ మదుర శైలి 8

వేలూరు, ఉదాహరణలుగా మదుర, రామేశ్వరం, శ్రీరంగం, జంబుకేశ్వర, తిరువారూరు, చిదంబరం, తిన్నెవెల్లి మొ॥ ఇక్కడి దక్షిణ దక్షిణ ప్రాంతాల లోని దేవాలయాలను చెప్పవచ్చు.

M.A. Guide * విజయనగర రాజులు సామ్రాజ్య ప్రారంభ దశలో చాళుక్య సంప్రదాయాలనే అనుసరించారు. శృంగేరి లోని విద్యాశంకర దేవాలయం లోను, తాడిపత్రి దగ్గర నదీతీర దేవాలయాలను చాళుక్యశైలి ప్రభావం గల విజయనగర నిర్మాణాలు ప్రారంభ దశను తెల్పుతాయి.

కాని తర్వాత కాలంలో వారి సామ్రాజ్యం వివిధ ప్రాంతాల్లో విస్తరింపబడటం వలన వారు ఆంధ్ర, ద్రావిడ, కర్ణాటక శిల్ప సంప్రదాయాలను - ద్రావిడ వాస్తురీతిని అనుసరించటం కనబడుతుంది. తిరువణ్ణామలై ఆలయ బృహద్ గోపురాలు, వందలకొద్దీ స్తంభాలు గల మండపాలు ఎక్కువై కల్పించడం ఇందుచేతనే. విజయనగర సామ్రాజ్య రాజధాని హంపిలో కృష్ణదేవరాయలు కట్టించిన ఆలయాలన్నీ ద్రావిడశైలికి చెందినవే.

BT * విజయనగర వాస్తుకారులు నిర్మాణానికి దాని అలంకారాలకు మధ్య సరైన సమతూకం సాధించారు. ఆలయ నిర్మాణం లో స్తంభాలు ముఖ్యమైన నిర్మాణ విశేషం గా ఉండేవి. ఈ స్తంభాల నిర్మాణం లో

తరచుగా వాడే శైలి లో (shaft) స్తంభం నడిమి
భాగాన్ని మధ్యమూలంగా లేదా గుండ్రంగా చెక్కబడే
శిల్ప సముదాయానికి నేపథ్యంగా వాడటం. కన్పిస్తుంది.

ఒక ఏకశిలా స్తంభం మధ్యలో
పెద్ద స్తంభం వలెగ చుట్టూ అనేక చిన్న చిన్న స్తంభాల చేత
అమర్చబడినట్లు గా చెక్కడం రెండో పద్ధతి.

ఇంకా సులువైంది గా మరో పద్ధతి ఉంది.
ఇందులో స్తంభం నడిమి భాగాన్ని కొన్ని విభాగాలు
చేసి ప్రతి విభాగం ను ఆ ఆలయానికి చెందిన చిన్న
చిత్రరూపం లో నింపేస్తారు. (each zone being occupied
by a miniature motif of the shrine itself)

స్తంభాలు ఎంత అలంకరించబడ్డాయో
వాటి బ్రాకెట్లు కూడా అంతగానే అలంకరింపబడేవి.
సాధారణ పద్ధతి లో వేలాడుతున్నట్లుండే బ్రాకెట్టు ను
పొడిగించి ఒక (volute) పొగా వంటి మడత రూపు
గా సాగదీసి తలక్రిందులు గా ఉండే తామర మొగ్గ లో
దాన్ని ముగిస్తారు.

* విజయనగర కాలం లో మరిందా అన్నా పునరుజ్జీవనం
పొందింది. నాటి వాస్తు లో కూడా ఇది స్ఫురిస్తుంది.
దేవాలయ నిర్మాణాలకి నూతన మండపాలు మొ.
వాటిని కలపటం లోనే గాక ప్రతి ఆలయం లోనూ

ప్రతి అంశం లోనూ గొప్ప ప్రగతి, సూక్ష్మ ప్రావీణ్యాలు సాధించబడటం దీని ఫలితమే. ఈ విధంగా అత్యంత ఆలయ నిర్మాణం లో భాగం చేయబడినవాటిలో ముఖ్యమైనవి అమ్మన్ ఆలయం, కళ్యాణ మండపం.

* లౌకిక కట్టడాలలో పద్మ మహాలు, ఏనుగుల శాల మొదలైన వాటిలో substance, అలంకారాలు ముఖ్యమైన అంశాలుగా కన్పిస్తాయి. ఏనుగుల శాల స్వభావం లోనూ, చూపులకూ కూడా ఇస్లామిక్ శైలి లో ఉంటుంది.

* సింహాసనపు వేదిక, దర్శన శాల ల శిథిలాలను బట్టి ఇవి స్తంభాలతో కూడిన మండపాలై, అనేక అంతస్తులు గలిగి పిరమిడల్ పైకప్పు తో ముగిసేవని తెలుస్తున్నాయి. సింహాసనపు వేదిక అద్భుతంగా అందంగా అలంకరించబడి ఉంటుంది. ఇది తగ్గుతూ వచ్చే మూడు (టెర్రస్డ్) అంచెలు అంచెలుగా ఉన్న వేదికలు కలిగి ఉంది. మిద్దె / పిడి కట్టబడిన మెట్లు కలిగి ఉంది. వేదికలు ఒక దానితో ఒకటి చక్కని నైపుణ్యంగా ఉండే పొరల ద్వారా (bold mouldings) వేరుచేయబడి ఉండేవి. మధ్యాంతర గోడలు పురాణాలు, గాథల లోని దృశ్యాల గురించి విస్తారమైన చెక్కడాలు (carvings) కలిగి ఉండేవి.

* మండపాల విషయంలో చిదంబరం లోని పార్వతి ఆలయం, కంచి లోని వరదరాజస్వామి, ఏకాంబరనాథ దేవాలయాలు,

## శిల్పకళ :

విజయనగర కాలం రాతి, లోహ శిల్పాల యొక్క సంఖ్యలోను, వైవిధ్యంలోనూ ఎంతో వృద్ధిని గాంచింది. ఆలయాల గోడల్లో బయటవైపు గూళ్ళల్లో దేవ, దేవతల విగ్రహాలు ఎన్నో అలంకరింపబడేవి. విజయనగర ఆలయాల్లో గూళ్ళ "పై భాగాలు" సామాన్యంగా, సాదాగా ఒక కుడు చిహ్నం తప్ప ఇతర అలంకారాలూ లేకుండా ఉండేవి. ఇది పల్లవుల, చోళుల కాలాల్లోని భారీగా అలంకరించబడిన గూళ్ళ కు పూర్తి వ్యతిరేకం అని చెప్పవచ్చు.

విజయనగర శిల్పాల్లో గోడల మధ్య నిల్చిన ఏకశిలా నరసింహుని భారీ విగ్రహం పేర్కొనదగింది.

విజయనగర శిల్పాల్లో నూతన ఆవిష్కరణగా (portrait sculptures) తద్రూపత్వ శిల్పాలను చెప్పవచ్చు. రాజుల విగ్రహాలు సాధారణం గా నిలువెత్తువిగా, రాజదుస్తులు, ఆభరణాలు తదితర రాజలాంఛనాలతో కూడినవి ఆయా దేవాలయాలలో కన్పిస్తాయి. వీటిలో చిదంబరం లోని శివాలయంలోని కృష్ణదేవరాయల విగ్రహం చెప్పుకోదగ్గది. ఇవి ఆనాటి ముఖ్యుల విశిష్ట ఆనవాళ్ళను, వాస్తవిక లక్షణాలను యథాతథంగా పొందుపరిచేవి. అంటే ఈ తద్రూపత్వ శిల్పాలు

ఆయా స్త్రీ, పురుషుల వాస్తవ నమూనాలను ఉంటాయన్న మాట. అందువల్ల శిల్పి వారి దుస్తులుగాని, కనబడే తీరుగాని ఏ మాత్రం మార్చేవాడు కాదు. అందువల్ల శిల్పి పాత్ర మలచాల్సిన వ్యక్తి శారీరక ఆకార రూపురేఖ యథాతథంగా చెక్కి చిత్రీకరించటమైన పునరుత్పత్తి పని మాత్రమే. అందువల్ల ఇవి ఆనాటి దుస్తులు, అలంకారాలు, ఆయుధాయుధాలు, పాదరక్షలు, తలపాగాలు మొ॥ తెలుసుకోవడానికి ఎంతో తోడ్పడుతున్నాయి.

## చిత్రకళ:

చోళుల చిత్రకళా సంప్రదాయాన్ని విజయనగర రాజులు కొనసాగించారు. హంపి, లేపాక్షి, ఆనెగొంది, కాంచీపురం మొ॥ వి విజయనగర కాలంనాటి గొప్ప చిత్రాలను కలిగిఉన్నాయి.

ఈ కాలపు కుడ్యచిత్రాలు చాలావరకు మత సంబంధమైనవే. విష్ణు ఆలయాల్లోని కుడ్యచిత్రాలు (murals) రామాయణ, మహాభారత, విష్ణు పురాణాలకు చెందినవి. శైవాలయాల్లో శివ పురాణం నుంచి దృశ్యాలు చిత్రించబడేవి. జైనాలయాల్లో జైన తీర్థంకరుల జీవితాల్లోని ఘట్టాలు చిత్రించేవారు.

హజారా రామాలయంలో (హంపి) రాముని జీవితంలోని పలు సన్నివేశాలకు చెందిన చిత్రావళి ఉంది. లేపాక్షి దేవాలయంలో ఇతిహాస, పురాణ గాథల చిత్రాలతో బాటు జంతువుల, పక్షుల చిత్రాలు కూడా ఉన్నాయి. రంగురంగుల నెమళ్ళు, చిలుకల బొమ్మలు ఆహ్లాదపరుస్తాయి. ఇవి చిత్రకారుల రేఖలపైనా, రంగులపైనా ఉన్న ఆధిపత్యాన్ని సూచిస్తాయి. అవి సహజత్వం, సరళత్వం, వెచ్చదనాల సంపన్నతను ప్రదర్శిస్తాయి.

జెసూట్ చిత్రకారులు ప్రోత్సహించిన రెండవ వెంకట కాలంలో విజయనగర చిత్రకళ కొత్త పుంతలు తొక్కింది.

## సాహిత్య సేవ :

### సంస్కృత సాహిత్యం :-

వేదాంత దేశిక (1268- 1368) సంస్కృతం, తమిళంలో గొప్ప రచయిత. ఇతడు రచించిన 120 రచనల్లో 90 సంస్కృతంలో ఉన్నాయి. ఇతని 'యాదవాభ్యుదయం' మహాకావ్యం. ఇతని 'హంస-సందేశం' కాళిదాసు మేఘసందేశాన్ని పోలింది. దేశికుని 'సంకల్ప-సూర్యోదయం' విశిష్టాద్వైతాన్ని తెల్పుతుంది. ఇతని 'సుభాషితనీవి' ఉపదేశాత్మక రచన. ఇతని ఇతర రచనల్లో 'శతదూషణి' 'తత్త్వ-టీక' 'తాత్పర్య చంద్రిక' 'అధికరణ శరావళి' 'తత్త్వ ముక్తకలాప' మొ॥ వి ముఖ్యమైనవి.

మాధవాచార్యుడు (14వ శతాబ్దం) తాత్విక, వ్యాకరణ, యోగ మొ॥ విషయాల గ్రంథాలు రాశాడు. వాటిలో 'పరాశర-మాధవీయ', 'కాలనిర్ణయ' (కాల-మాధవీయ) 'జీవన్ముక్తి వివేక', 'జైమినీయ న్యాయమాల విస్తర' మొ॥ ముఖ్యమైనవి.

సాయన 'సుభాషిత సుధానిధి', 'ధాతువృత్తి', 'ప్రాయశ్చిత్త సుధానిధి' (కర్మ విపాక), 'యజ్ఞతంత్ర సుధానిధి' 'అలంకార సుధానిధి' ఇంకా 'పురుషార్థ సుధానిధి' లు రాశాడు. అనేక వేదాల యొక్క వ్యాఖ్యానాలు కూడా రాశాడంటారు. బహుశ వాటిని [illegible] మంది పండితుల సాయంతో

లేని ఉండవచ్చు.

భోగనాథ 'రామోల్లాస', 'త్రిపురవిజయ' 'ఉదాహరణమాల', 'మహాగణపతిస్తవ', 'శృంగారమంజరి' మరియు 'గౌరీనాథశతక' లను రాశాడు.

ఇరుగప్ప దండనాథ, రెండవ హరిహరుని మంత్రి 'నానార్థరత్నమాల' ను రచించాడు. రెండవ హరిహరుని ఇద్దరు విరూపాక్ష 'నారాయణవిలాసం' అనే సంస్కృత నాటకం రాశాడు. కుమార కంపన భార్య గంగాదేవి 'మధురావిజయం' రాసింది. ఇది నాటి యుద్ధం, యుద్ధ ఆయుధాలు, కోటల వర్ణన మొదలైన వాటి స్పష్టత తెల్పుకోవడానికి ఉపయోగపడుతుంది. రెండవ దేవరాయలు 'రతిరత్నదీపిక' 'బ్రహ్మసూత్రవృత్తి' లను రాశాడు.

గోప తిప్ప 'తాళదీపిక' అను సంగీత రచన చేశాడు. ఇతడు 'కామ్యాలంకార కామధేనువు' మీద వ్యాఖ్యానం రాశాడు. సాళువ నరసింహుడు 'రామాభ్యుదయం' రాశాడు. రెండవ రాజనాథ డిండిముడు 'సాళువాభ్యుదయం' ను విరచించాడు.

కృష్ణదేవరాయలు గొప్ప సంస్కృత రచనలు చేశాడు. మదాలసచరిత్ర, రసమంజరి, సత్యవధూప్రీణనం, సకలకథాసార సంగ్రహం మరియు సూక్తినైపుణిజ్ఞానచింతామణి Suktinaipunijnacinta మొ॥ కావ్యాలు రాశాడు. ఇతని 'జాంబవతీకళ్యాణం'

'ఉషా పరిణయం' వంటి సంస్కృత "నాటకాలు" రాశాడు.

ఇతని మనుమడు సాళువ తిమ్మ కూడా గొప్ప సంస్కృత రచయిత.
ఇతడు 'భారత వ్యాఖ్య' అనే అగస్త్యుని బాల భారతం
మీద వ్యాఖ్యానం రాశాడు.

సాళువ తిమ్మ బంధువు గోప

ప్రబోధచంద్రోదయం మీద 'చంద్రిక' అనే వ్యాఖ్యానం రాశాడు.
'కృష్ణార్జున సంవాదము' కూడా రాశాడు. లొల్ల
లక్ష్మీధరుడు 'దైవజ్ఞవిలాసం' రాశాడు. శంకరుని
సౌందర్యలహరి కి వ్యాఖ్యానం రాసి అందులో తాను
'సరస్వతీవిలాసం' రాసినట్లు చెప్పాడు. లక్ష్మీనారాయణుడు
'సంగీతసూర్యోదయం' రాశాడు. పోతభట్టు భాగవతం
లాగా కొంత సంస్కృతీకరించాడు (ఇంకా ఉత్తరఖండ సింహపురాణం,
వరాహపురాణం, మత్స్యపురాణాలను తెలుగులో రాశాడు.)
'అచ్యుతరాయాభ్యుదయం' ను రాజనాథ డిండిమ III
రాశాడు. ఇతడే 'భాగవత చంపు' రాశాడు. తిరుమలాంబ
'వరదాంబికా పరిణయం' రాసింది. మోహనాంగి 'మరీచి
పరిణయం' రాసింది. (రామరాజు భార్య అంటారు.)

చెరుకూరి లక్ష్మీధరుడు 'అభిలషితార్థదాయిని'
'షడ్భాషాచంద్రిక' (వ్యాకరణం) 'శ్రుతిరంజని' (గీతగోవిందం మీద
వ్యాఖ్యానం) వంటి రాశాడు.

[illegible] 'పాండురంగ మహాత్మ్యం'

రాసాడు. అప్పయ్య దీక్షితుడు దాదాపు 104 రచనలు రాశాడంటారు. వాటిలో 'శివార్క మణిదీపిక' 'పరిమళ' 'శివతత్త్వవివేక' 'కువలయానంద' 'చిత్రమీమాంస' 'వృత్తివార్తికం' 'చాతుర్మాస్యసార' 'రామాయణ తాత్పర్య సంగ్రహ' 'మహాభారత తాత్పర్య సంగ్రహ' 'వరదరాజస్తవ' '[illegible] పద్ధతి' మొ॥ ఉన్నాయి.

వాదిరాజ 60 కి పైగా రచనలు చేసినట్లు చెప్తారు. వాటిలో 'వివర్ణవ్రణం' 'పాషండఖండనం' 'న్యాయరత్నావళి' 'యుక్తిమల్లిక' మొ॥ ఉన్నాయి.

విజయనగర కాలం నాటి సంస్కృత రచనలు చాలా వరకు ఉపనిషత్తుల, వేదాల, బ్రహ్మసూత్రాల పై తర్కశాస్త్రాల పై రాయబడిన వ్యాఖ్యానాలు, భాష్యాలు, వ్యాఖ్యానాలే ఎక్కువగా ఉన్నాయి, సాహిత్య, వైద్య, వాస్తు, సంగీత, మత, రాజనీతి కి సంబంధించిన ఉత్తమ రచనలు కూడా వెలువడ్డాయి.

తెలుగు సాహిత్యం

## తెలుగు సాహిత్యం :

(విజయనగర కాలం తెలుగు కు పునరుజ్జీవన యుగం.)

తెలుగు కు, తెలుగు పండితులకు గొప్ప ప్రాముఖ్యం ఇవ్వబడింది. ఈ కాలపు తెలుగు కవుల్లో మొదటి బుక్క ఆస్థాన కవి అయిన నాచన సోమనాథ కవి (1355-77) ని చెప్పాలి. ఇతడి 'ఉత్తరహరివంశం' సంస్కృతంలో హరివంశం ఆధారంగా రాయబడింది, ఇది గొప్ప కావ్యం.

శ్రీనాథుడు మహాకవి. చిన్నతనంలోనే మరుత్తరాట్చరిత్ర 'శాలివాహనసప్తశతి' ని రాశాడు. శ్రీహర్షుని 'నైషధాన్ని' 'శృంగార నైషధం' గా మలిచి దాన్ని తెలుగు పంచమహాకావ్యాల్లో చేర్చాడు. ఇంకా భీమఖండం, కాశీఖండం, పల్నాటి వీరచరిత్ర, శివరాత్రి మాహాత్మ్యం మొ|| వి రాశాడు. కవిసార్వభౌమ, ఉభయరత్న వంటి బిరుదులు పొందాడు.

పోతన (1400-75) సహజ పాండిత్యుడు. భాగవతాన్ని (సంస్కృతంలోనిది) తెనిగించాడు. వీరభద్ర విజయం భోగినీ దండకం కూడా రాశాడని అంటారు.

వేమన ప్రజాకవి. మనుషుల తప్పుల్ని, మూఢనమ్మకాల్ని, కులాల, స్త్రీల పై వ్యంగ్య పద్యాలు చెప్పాడు.

రెండవ దేవరాయల ఆస్థానం లోని శారద 18 తెలుగు నాటకాల్ని, రెండు ప్రాకృత భాషా రచనల్ని చేసింది. ఈ రాజు సమకాలీనుడైన జక్కన 'విక్రమార్క చరితం' రాశాడు. సాళువుల కాలంలో 'జైమిని భారతం' రాసిన పిల్లలమర్రి పినవీరభద్రుడు ముఖ్యుడు. (ప్రస్తుతం ఇతడి మరో రచన అయిన

'శృంగార శాకుంతలం' మాత్రమే దొరుకుతుంది.

నరసనాయకుని కాలంలో నంది మల్లయ, ఘంట సింగన ఉన్నారు. వీరిద్దరూ కలిసి రాసిన 'వరాహ పురాణం' 'వరాహలక్ష్మీ పురాణం' 'నరసింహ పురాణం' 'ప్రబోధ చంద్రోదయాలు' ప్రసిద్ధమైనవి. 'హరిశ్చంద్రోపాఖ్యానం' రాసిన గౌరన చెప్పదగినవాడు.

కృష్ణదేవరాయల కాలం తెలుగుకు స్వర్ణయుగం.

అతని ఆస్థానంలో అష్టదిగ్గజాలున్నారని ప్రతీతి — పెద్దన, తిమ్మన, రామభద్ర, ధూర్జటి, మల్లన, తెనాలి రామకృష్ణ, సూరన, రామరాజభూషణుడు. ఇందులో చివరి ఇద్దరూ రాయల ఆస్థానంలో ఉన్నట్లు చారిత్రకంగా చెప్పలేము.

కృష్ణరాయలే స్వయంగా తెలుగులో "ఆముక్తమాల్యద" రచించాడు. ఇందులో 3 భాగాలు ఉన్నాయి. అవి రాజనీతి, మతం, సమాజం లను గురించి వెల్లడిస్తాయి. ఇది ఎంతో చారిత్రకమైన, ఎంతో సాంఘికపరమైంది. కొందరు ఇది పెద్దన రాశాడంటారు, కానీ చాలా మంది చారిత్రకారులు ఇది రాయల గ్రంథమే అంటారు.

పెద్దన "స్వారోచిష మనుసంభవము" తొలి ప్రబంధము. తర్వాతి ప్రబంధ కవులకి మార్గదర్శకుడై పెద్దన 'ఆంధ్రకవితా పితామహ' బిరుదు పొందాడు.

తిమ్మన "పారిజాతాపహరణము", ధూర్జటి "కాళహస్తి మాహాత్మ్యము", 'కాళహస్తీశ్వర శతకము'

పింగళి సూరన "కళాపూర్ణోదయము", "రాఘవపాండవీయం" "ప్రభావతీ ప్రద్యుమ్నం" ప్రఖ్యాతిగాంచాయి. తెనాలి రామలింగడు "లింగ పురాణం", "పాండురంగ మాహాత్మ్యం" "ఘటికాచల మాహాత్మ్యం" "ఉద్భటారాధ్య చరిత్రము" మొ॥ రచించాడు. రామభద్రుని "రామాభ్యుదయం" ప్రబంధం. భట్టుమూర్తి (రామరాజభూషణుడు) "వసుచరిత్ర" సంగీత ప్రధానమైంది. రామరాజభూషణుని "హరిశ్చంద్ర-నలోపాఖ్యానం" ద్వ్యర్థి కావ్యం.

(విజయనగర కాలం నాటి తెలుగు సాహిత్యం పరిశీలిస్తే, నాడు సంస్కృతం పండితుల భాషగా, తెలుగు సామాన్య ప్రజానీకం భాషగా తెలుస్తాయి. తెలుగు సాహిత్యం సామాన్య ప్రజలకు ఉల్లాసం కలిగించేది. ఈ రచనలు నాటి ప్రజల జీవిత పరిస్థితులు, ఆటలు, బంధాలు, వారసత్వాలు తెలుపుతాయి. అందువల్ల ఈ తెలుగు రచనలు విజయనగర కాలం నాటి సాంఘిక-సాంస్కృతిక ఆర్థిక పరిస్థితులు తెలుసుకొనుటకు తోడ్పడుతున్నాయి.)

## కన్నడ సాహిత్యం :

రెండవ హరిహరరాయలు 'విద్యావిలాస కర్ణాటక' బిరుదు పొందాడు.

పలువురు జైన, వీరశైవ పండితులు కన్నడంలో ఉత్తమ గ్రంథాలు వెలువరించారు.

రెండవ హరిహరుడు, మొదటి దేవరాయల చేత పోషింపబడిన 'మధుర' "ధర్మనాథపురాణ" రాశాడు. వృత్తివిలాస "ధర్మపరీక్ష" రాశాడు. ఇది మరియు "శాస్త్రసార" కృతి సాంఘికమత ప్రాధాన్యం గలవి. ముగ్గురు రచయితలు మూడునాళ్ళ "భావాంధరంగ" [illegible] రాశారు, ఇది కన్నడలో మిక్కిలి ఆదరణ గల విషయం. కృష్ణరాయల చెందిన బాహుబలి నాగకుమార కథను రాశాడు.

తెలుగు కన్నడాల్లో ప్రసిద్ధుడైన భీమకవి తెలుగు "బసవపురాణం" ను కన్నడంలోకి అనువదించాడు.

విజయనగర కాలంలో తెలుగు, సంస్కృతాలతో పోల్చినప్పుడు వెలువడిన కన్నడ సాహిత్య పరిమాణం తక్కువైతే అయినా జైన, ప్రబంధాలు, వాంఛిణ్యాల పరంగా ఎంతో సంపన్నమైనవి. అద్వైత తత్త్వం, ప్రేమ, హాస్య, వంటి ఇలా వైవిధ్య భరితమైన

కన్నడ రచనలు ఈ కాలంలో వెలువడ్డాయి.

తమిళ సాహిత్యం:

కృష్ణదేవరాయలు తమిళ పండితులను గౌరవిస్తూ తమిళ సాహిత్యానికి సేవలందించినట్లు పలు తమిళ రచనలు పాడిన దాన్ని బట్టి తెలుస్తుంది.

తిరువత్తినాథ, చిదంబర వాసి "చిదంబర పురాణం" ను సంస్కృతం నుంచి తమిళంలోకి తెచ్చాడు. ఇతడే "మదురై చొక్కనాథరుల" ఉలా కూడా రాశాడు. ఇతని శిష్యుడు పరంజ్యోతియార్ "చిదంబర పట్టియాల్" అనే పద్యగ్రంథం రాశాడు.

ఈ విధంగా విజయనగర రాజుల కాలం తమిళ, తెలుగు, కన్నడ, సంస్కృత సాహిత్యాలకు సాహిత్యగ్రంథాలను అందించింది.

## కొసమెరుపు?



విజయనగర రాజులు వైష్ణవ మతారాధకులు. అయితే వారు ప్రత్యేకంగా సర్వ ధర్మ మతాల పట్ల సమానంగా ఉన్నారు. అందువల్ల వారు అన్ని మతాల మధ్య విభేదాల్ని కూడా పరిష్కరించారు. ఉదాహరణకు మొదటి బుక్కరాయలు వైష్ణవులకు జైనులకు మధ్య సామరస్యంగా ఒప్పందాన్ని కుదిర్చాడు.

రాయలు గొప్ప వైష్ణవుడైనా శైవ, మధ్వ, జైనుల్ని సమాదరించాడు. అతని ఉపదేష్టల్లో ముఖ్యులు శైవులు, మరి ద్వైతులు. శైవమతం విరూపాక్షునే తన రాజ్యదైవంగా ఆరాధించాడు. ఇతడు మహారాష్ట్రమతాని పాండురంగ విజయనగరంలో విఠలాలయాన్ని కట్టించాడు. తిరుపతి వేంకటేశుడు అతని ప్రియదైవం. ఇతడు తిరుపతి తదితర పుణ్యక్షేత్రాలు దర్శించాడు. తిరువణ్ణామలై నందు వేయిస్తంభాల మండపం, కోనేరు కట్టించాడు. ఇంకా కంచిలో ఎన్నో శైవ, వైష్ణవ ఆలయాలు కట్టించాడు. మరెన్నో వెండి, బంగారు కానుకలు పొందేవి. పెన్గొండ, అహోబిలం, కాంచనాల్లూర్, తిరుక్కోవెల్లి, తిరువళ్ళూరు, శ్రీరంగం లాంటి దేవాలయాలు వారి ప్రజాసేవకు గుర్తింపుగా, మతక్షేత్రాల నిర్వహణకై బంగారు వాహనాల్ని పొందాయి.

అళియ రామరాయలు వందల మంది ముస్లింలను తన సేవకై నియోగించుకున్నాడు - ప్రత్యేకంగా చెప్పాలి.

ఈ రాజులు గుళ్ళు కట్టించారేమో గానీ

ఉత్సవనిర్వహణకు కోసం విరివిగా వారికి దానాలు చేశారు. రాజాధిరాజులు మహానవమి వంటి ఉత్సవాలు విజయనగర రాజ్య సంపద్వైభవ ప్రదర్శనకు ఉపయోగపడేవి. విదేశీ యాత్రికులు ఎందరో ఈ ఉత్సవాల గురించి వివరంగా రాశారు.

ఉత్సవాల్లో దేవాలయాలకు కానుకలు ఇచ్చేవారు.

## : సాంఘిక జీవనం :

విజయనగర సామ్రాజ్యంలో అధిక సంఖ్యాకులైన మానవులు అల్పసంఖ్య లో ఉండేవారు. కులాలకి, వృత్తికి మధ్య సంబంధం ఉంది. అయితే అది మార్పులేనిది కాదు. పురాతనుల మరియు నిరసన, రాజ్యం ఏర్పడినప్పుడు వృత్తి మార్పుకి విరోధించటానికి యుద్ధాలు జరిగినప్పటికీ కొత్త తరగతులు, పరిస్థితులు ఏర్పాటు మార్పులు లేకుండా ఉండేవి. ప్రభుత్వ ఉద్యోగాలు అన్ని కులాల వారికీ తెరవబడేవి. బ్రాహ్మణ యోధులు యుద్ధాలకి రాజ్యాల సందర్భాలు తెలిపేవారు. కృష్ణదేవరాయలకు వారి విధేయత, సామర్థ్యాల పట్ల గొప్ప విశ్వాసం. అందువల్లనే శ్రీవారికోట వారిని నియమించాడు. ఆటవిక, కొండ జాతుల వారు సైనికులు గా ఎక్కువగా నియమించబడేవారు.

దండయాత్రలు/ కరువుల వల్ల ప్రజలు వలసలు వెళ్ళేవారు, నూతన ఆర్థిక - సాంఘిక పరిస్థితులకి అలవాటు పడేవారు. విజయనగర సామ్రాజ్యంలో తెలుగు, కన్నడ ప్రజలు తమిళనాడులోకి వలస వెళ్ళారు. వారు తమిళ రాజుల అధికారాన్ని నిర్వహించే అధికారులుగా, సైనికులుగా వచ్చి ఉండవచ్చు. వారి వలసలు భూమిని ఇవ్వడం ఆలయాల నిర్మాణాల ద్వారా ప్రోత్సహించబడ్డాయి.

సంఘంలో బ్రాహ్మణులకి ఉన్నత స్థానం ఉండేది. వారిలో చాలామంది తమను తామే

ఏ కులం వారు ఆ కులం వారితో వివాహం చేసుకునేవారు.

ఒకని పదవి & ఉన్న విధుల్ని నిర్వర్తించటం మీదనే అధిక ప్రాధాన్యం ఉండేది, వ్యక్తి లేదా సాముదాయిక హక్కులకి ప్రాధాన్యత ఉండేది కాదు. సాధారణ వాతావరణం ఉన్న దానితో తృప్తి పడటం, ఉన్న సాంఘిక క్రమంలో తృప్తి చెందటం, సామాజిక సామరస్యాలు ఉండేవి. అంటే ఏ వివాదాలు, భేదాలూ లేవని కాదు. అయితే ఈ వివాదాల్ని ఎప్పుడూ తీవ్రంగా పరిణమించనిచ్చేవారు కాదు.

రాజ్యం ముఖ్యంగా మాత్రమే ఆయా కులాల మధ్య వివాదాల్ని సర్ది చెప్పేందుకు ప్రయత్నించేది.

పట్టణాల్లోనూ, గ్రామాల్లోనూ ఆయా కులాల వారు ప్రత్యేక తమ తమ వాడల్లో నివసించటానికి మొగ్గు చూపేవారు. భూమిని సాగు చేసే, ఇతర తక్కువ పనులు చేసే అంటరానివాళ్ళు ఊరికి వెలుపలి వాడల్లో నివసించేవారు.

కొన్నిసార్లు ఆయా కులాల వారి ప్రత్యేక హక్కులు రాజాధికారాలకి లోబడి ఉండేవి. సదాశివ, రామ రాయలు మొత్తం మంగలి కులం వారిని పన్నులు, వెట్టి, భూమిశిస్తు, మహానవమి కానుకలు మొ|| వాటన్నింటి నుంచి (exempt) మినహాయించారు. ఈ విషయాన్ని ఎన్నో శాసనాల్లో రాశారు, ఈ శాసనాలపై మంగలి సాధనాలైన కత్తెర్లు, అద్దాలు మొ|| వి చెక్కబడి ఉన్నాయి.

Mehta

విజయనగరం లో ప్రజలు సంపన్నంగా ఉన్నట్లు పేస్ రాశాడు. ఈ నగరంలో శిల్ప కళలు వారు కప్పినారని రేవుల ఏర్పడి విస్తారత వర్తకమే జరిగేదని పేస్ రాశాడు. నగరంలో ఏ వస్తువులు కూడా చాలా చౌకగా ఉన్నట్లు రాశాడు. ప్రపంచంలోనే సమృద్ధి నగరం గా చెప్పాడు. బియ్యం, గోధుమలు, ధాన్యాలు, మొక్కజొన్న, బార్లీ, బీన్స్, పప్పుధాన్యాలు, మినపప్పు, మొదలైన పెద్ద మొత్తాలలో చాలా చౌకగా దొరికేవి పేస్ రాశాడు. మాంసం, పక్షులు, వస్తువులు సంపన్నంగా ఉండేవి.

ఉదార మతం పాటించిన విజయనగర రాజుల పాలనలో హిందువులు, ముస్లింలు, జైనులు, యూరోపియన్ వర్తకులు సంతోషకరమైన - సుఖవంతమైన జీవితాన్ని గడిపేవారు. ఈ రాజులు స్వార్థ మతసహనం గలిగి హిందువులకు - హిందువేతరులకు ఏ భేదం చూపలేదు.

కులవ్యవస్థ దాని చెడుపల్యాంశాలతో కనబడేది. విజయనగర రాజులు బ్రాహ్మణులను ఉన్నతంగా చూసేవారు. ఆ నాడు ప్రజల సాంఘిక - రాజకీయ జీవనంలో బ్రాహ్మణుల ప్రభావం విపరీతంగా ఉండేది. నిజానికి మధ్యయుగ దక్షిణ భారత హిందూ సమాజ-సంప్రదాయాలు బ్రాహ్మణులు ఎలా నడిపిస్తే అలా నడిచారు. బ్రాహ్మణులు మంత్రులుగా, రాజకీయ-మత విషయాల్లో విజయనగర రాజులకు సలహాదారులుగా ఉండేవారు. దేవాలయ వ్యవస్థలో ముఖ్య పదవుల్ని నిర్వహించేవారు.

బ్రాహ్మణులలో చాలా గా Canarese లోగల వారు బాగా చదివినా ఉండేవారని వారు వేదములు ఆరాధించేవారని న్యూనిజ్ చెప్పెడు. విజయనగర రాజ్యంలో కోటలు ఎంత విపరీతంగా ఉండేవంటే అవి పర్వతాలన్నీ కప్పేసేవి.

సమాజంలో ఉన్నత వర్గం – వారిలు,

భూస్వాములు, వర్తకులు – వ్యాపారులు, బ్రాహ్మణులు సాధారణంగా సుఖ జీవితం గడిపేవారు. ఆస్థాన కారులు, ఉద్యోగస్వామ్యం ధనికులూ సర్వసుఖాలూ పొందేవారు. విజయనగరంలో ధనికుల వ్యక్తుల వారి దుకాణాలు పట్టుపట్టీలో వస్త్రాలతో ఉండేవి. ముత్యాలు, కెంపులు, పచ్చరాళ్లు రాళ్లు, వజ్రాలను బహిరంగంగా రోడ్డు మీద అమ్మేవారని అబ్దుర్ రజాక్ రాతల వల్ల తెలుస్తుంది.

హిందూ సామాన్య ప్రజలు ఏకపత్నీవ్రతులు గానే ఉండేవారు. ~~[illegible]~~ వారిలో, భూస్వామ్య వర్గాల్లో మాత్రం నైతిక పతనం కన్పిస్తుంది. ధనికులు ఎంతమందిని కావాలంటే అంతమందిని వివాహం చేసుకునేవారు, వీరిని చనిపోయిన భర్తలతో పాటే దహనం చేసేవారని నికోలో కాంటి రాతల వల్ల తెలుస్తుంది. అంటే 'సతీ' ఆచారం ఉండేదని, ఈ క్రూరమైన విధిని బ్రాహ్మణులు బలవంతంగా రుద్దేవారని తెలుస్తుంది. సతి – కాంటి

నికోలో కాంటి మాటల్లో విజయనగర రాజుకు 12,000 మంది భార్యలున్నారు. వారిలో 4,000 మంది ఆయనతోపాటు వెళ్ళినా కాలినడకన వెన్నంటి వెళ్తారు, వీరు కేవలం వంటపని చూస్తారు. మరో 4,000 మంది సర్వాలంకారాలతో అశ్వారూఢులై వెళ్తారు. మిగిలిన

వారిని పల్లకీలలో మోసేవారు. వీరిలా 2000, వేల 3,000 మంది రాయబారులు మరణిస్తే ఇష్టపూర్వకంగా సతి చేసి భర్తల పై ఉరి భాగంగా ఎక్కడ చేస్తారు. ఇది వారికి గొప్ప గౌరవంగా భావించబడేది.

ఏదేమైనా విజయనగర రాజ్యంలో స్త్రీల పరిస్థితి బాగుండేదని చెప్పాలి. ఉన్నతవర్గాలకు చెందిన స్త్రీలు విద్యావేత్తలుగా ఉన్నారు. వారిలో కొందరు రాజ్యాధికారులుగా చేసేవారు. విజయనగర రాజధానిలో స్త్రీలు మల్లయోధులుగా, జ్యోతిషాలు-సోది చెప్పేవారిగా, అంతఃపుర రక్షకులు చూసేందుకు సమర్థులుగా, కోలాటాలుగా ఉండేవారని తెలుస్తుంది. న్యూనిజ్ స్త్రీలు రచయితలుగా, కవయిత్రులుగా, సంగీతకారులుగా, విదూషకులుగా ఉండేవారని చెప్పాడు. విజయనగర రాజుల న్యాయమూర్తులు, బంట్రోతులు, కాపలాదార్లుగా నియమించి రాణివాసపు కాపలా కాసేవారిగా (అందరూ) స్త్రీలే ఉండేవారని న్యూనిజ్ రాశాడు.

బాల్య వివాహాలు సాధారణం. కట్నాలు అధికంగా తీసేవారు, వాటిని గర్వంగా ఇచ్చేవారు. రజాక్ రాజధానిలో అర్పుడు గాళ్ళ ఉన్నట్లు రాశాడు.

ఆహారం విషయంలో చాలా విలాసంగా ఉండేవారని తెలుస్తుంది. పళ్ళు, ధాన్యాలు, చేపలు, మాంసం బాగా తినేవారు. న్యూనిజ్ చెప్పిన దాన్ని బట్టి ఎద్దు, ఆవు మాంసం తప్ప మిగిలిన పంది, మేక, కుందేలు, పావురం, రకరకాల పక్షుల మాంసం తినేవారని తెలుస్తుంది. ఇంకా

పిచుకలు, ఎలుకలు, పిల్లులు, బల్లులు కూడా మాంసం కోసం విజయనగర మార్కెట్లు లో అమ్మేవారని న్యూనిజ్ రాశాడు.

"బిసనాగ (విజయనగరం) యొక్క ఈ రాజులు అన్నింటినీ తినేవారు, కాని ఎద్దు, ఆవు మాంసం మాత్రం తినరు. వాటిని ఈ దేశంలో పూజిస్తారు కాబట్టి పొరపాటున కూడా వాటిని చంపరు. వారు మేక, గొర్రె, పంది, జింక, కుందేలు, పావురం, పరిఘు ఇంకా అన్ని రకాల పక్షుల్ని; చివరికి పిచుకల్ని, ఎలుకల్ని, పిల్లుల్ని, బల్లుల్ని కూడా తినేవారు. ఇవన్నీ బిసనాగ నగర మార్కెట్లులో అమ్మబడేవి"

— న్యూనిజ్

పైగా ఎవరికైనా క్షేమం కావాలనుకుంటే ఏమో తెలియదని చెప్పి మార్కెట్లో పళ్ళనింటిని సమృద్ధిగానే అమ్మేవారని కూడా న్యూనిజ్ రాశాడు. నదుల నుంచి ఎక్కువ ఆహారాన్ని తినేవారు - నది చేపలు. ఇంకా ఆనాటి మార్కెట్లు లో ద్రాక్షలు, నారింజలు, నిమ్మలు, దానిమ్మలు, పనసలు, మామిళ్ళు మొ॥ భారీ ఎత్తున మిక్కిలి చౌకగా అమ్మబడేవని తెలుస్తుంది.

15వ శతాబ్దం, 16వ శతాబ్ద తొలినాళ్ళలో భారతదేశం మొత్తంలో విజయనగరం విస్తారమైన సంపన్న దేశం. అందుకు దాని వ్యవసాయం, పరిశ్రమలు, వర్తక - వాణిజ్యాలు, విదేశాలలో చేసే విస్తృత నగర ప్రాంతాలు పెరిగి అభివృద్ధి చెందడమే కారణం. అబ్దుర్ రజాక్ విజయనగర సామ్రాజ్యంలో

300 ల శేకి పట్టణాలున్నట్లు వాటికి పర్షియా, అరేబియా, ఆఫ్రికా, మలయా, ఆర్కిపెలాగో, బర్మా, చైనా, హిందూ మహా సముద్రంలోని విస్తృత ద్వీపాలలోనూ వాణిజ్య సంబంధాలున్నట్లు రాశాడు.

దక్షిణ భారతం వస్త్రాలు, బియ్యం, నీలి మందు, ఇనుము, ఉప్పు, వజ్రాలు, పంచదార, దినుసులు (spices) మొ|| ఎగుమతి చేసేది. గుర్రాలు, ముత్యాలు, రాగి, చైనా సిల్కు, వెల్వెట్ మొ|| వి దిగుమతి చేసుకునేది.

తీర ప్రాంతాలలో ఓడ నిర్మాణ పరిశ్రమ వృద్ధి చెందింది.

విజయనగరాన్ని దర్శించిన విదేశీయులు దాని సంపన్నతను గురించి ఉద్ఘాటించారు. విజయనగర వాసుల దగ్గరున్న బంగారం, వజ్రాలు, ఆ సంపద డైమండ్స్ వంటి వాటికి కొరతేమీ లేనట్లు అదే విధంగా గా ఉంది. ఉన్నత, తక్కువ వర్గాల వారు ఆఖరుకు బజారులో పనివాడిలో సహా అందరూ మెడ, చేతులు, మణికట్టు, వేళ్ళ కి విభిన్న ఆభరణాలు ధరించేవారు అని పేస్ తెలిపాడు. దక్షిణ భారతం ఈ కాలంలో ఎక్కువగా 'బంగారు పిచుక' గా ఉండి విదేశీయుల ఉత్సుకతకు కారణమవ్వడంలో ఆశ్చర్యం లేదు.

విజయనగర కాల దక్షిణ భారతదేశ

IGNOU

విలక్షణాలు :

- దక్షిణ భారత బ్రాహ్మణేతర కులాల విధులు
- కుడి ఎడమ చేతి వర్గాల్లో ద్వంద్వ విభజన

3) సమాజం యొక్క ప్రాదేశిక విభజన.

బ్రాహ్మణులు తాము భూమిని నియంత్రించాలని ప్రాంతాల్లో నివసించేవారు. వారి పరువు, ఆధారం కూడా ఆ భూములు నివసించేవారి పై వారికున్న నియంత్రణ నుండే వచ్చేవి. ఉన్నత వర్గంగా వారి మత విధుల ద్వారా కూడా వీరు గౌరవం పొందేవారు. దేవదానాలుగా గ్రామాల్ని దానాలుగా పొందిన వైదిక దేవాలయాలు పెరగడంతో ఆలయ కార్యకర్తలుగా అన్ని మత సంస్థలు, ఇతర కులాల ప్రజల మత నియంత్రణాధికారం బ్రాహ్మణులు పొందారు. ఈ మత కేంద్రాల కార్యనిర్వాహకులుగా బ్రాహ్మణులు గొప్ప లౌకికాధికారాన్ని పొందారు.

సామాజిక ప్రాదేశిక విభజన రెండో తమిళ దేశంలో సామాజిక సమూహాలు సహజ భౌగోళిక ప్రాంతాల్ని బట్టి, (వృత్తి కులాల్ని బట్టి (వాటిలో కూడా ఉన్న)) విభజింపబడేవి. విస్తృత భూభాగంలో సామాజిక సమూహాలు వాటి నివాసాలున్న గ్రామ దూరంలో ఉన్న సమూహాలతో బాగా తక్కువ సంబంధం కలిగి ఉండేవి. మేనబావ, మేనమామలకిచ్చి తమ ఆడపిల్లల వివాహం చేసేందుకే మొగ్గు చూపేవారు.

తమిళ కులాల వారిని కుడి, ఎడమ అనే రెండు విభాగాలు చేశారు. వైష్ణవులు కుడి కాగా శైవులు ఎడమ వారు. సాధారణంగా కుడివాటం

ఉండేవారు.

ఈ విధంగా విజయనగర కాలం నాటి సమాజం/ సామాజిక వ్యవస్థ (బ్రాహ్మణులు, కుడి-ఎడమ కులాలు గౌరవనీయమైన వ్యవసాయ కులాలతో సహా (వెల్లాలలు) కలిపి, ఇంకా తక్కువ కులాలు (ఉదా: నేతపనివారు మొ॥) ప్రజలతో కూడి ఉండేది.

---